# సృజన

అధునిక సాహిత్య వేదిక

132 | మాసపత్రిక | అక్టోబర్ 1982




ముఖచిత్రం : వర్గపోరాటం - సుప్రసిద్ధ విప్లవ చిత్రకారుడు : చిత్త ప్రసాద్
1951 డిసెంబర్

బ్రిటిష్ సామ్రాజ్యవాదం, నైజాం నిరంకుశ రాచరిక పరిపాలన, జాగీర్దారీ వ్యవస్థ, దళారీ కాంగ్రెస్ నాయకత్వం అండన యూనియన్ మిలిటరీ, ఉరికొయ్యలు, నిర్బంధాలు, ఈ అందరి కనుసన్నల్లో రజాకార్లు- ఒకవైపు, సుత్తి కొడవలి జెండా నాయకత్వంలో వీరోచితంగా ప్రతిఘటిస్తున్న ప్రజలు మరొకవైపు.


నిర్వహణ

'సాహితీ మిత్రులు'

సంవత్సరచందా రు. 20 | ఈ సంచిక రు. 4

# వీచకే.... ఓ గాలి

భూపాల్

వీచకే ఓగాలి వీచకే వేడిగా
వీచకే అటుదిక్కు పటుదప్పికటువుగా
ఆ స్థూప మెవరిదా అమరవీరునిదమ్మ ॥వీచకే॥

చిక్కు చీకటికింక చిచ్చుపెడుతుండగా
తన వంతుపని ఏదో కొంత మిగిలుందనీ
ముత్యాల చిరునవ్వు మొఖమింత జేసుకొని
హత్య చేశారన్న కచ్చతో పడుకుండు ॥వీచకే॥

ఏ కొండ ఊటలో ఏటి గలగల లంటు
ఏ గోండు ఆటలో బాణ మిలమిల లంటు
ఏ త్యాగఫలితమో పూసేటి వెన్నెలని
ఏ అమర గురుతులో మెరిసేటి చుక్కలని
గుండె ఎర్రజెండగా ఎదురుచూస్తుంటాడు ॥వీచకే॥

వర్గకసి దెసలుగా దిసలన్ని నిండగా
చిగురు సూర్యుని తెంచ ఎదురుకాల్పులపేర
తెల్లారనీకుండ కుళ్ళు పోతున్నరని
కుమిలి కుమిలీ ఇపుడె కునుకుదీసెనె తండ్రి
తేనె కన్నులతోని తనువార చూసిపో ॥వీచకే॥

పచ్చనగు చేలన్ని పరుచుకొని మాయన్న
పాలపుంతకు తోడు కలకాల ముంటాడు
పసిపిల్లలూ నిన్ను పగదాని వనకుండ
విరిజల్లు విసిరిపో వెలుగీను మాజెండ ॥వీచకే॥



# తెలంగాణా అన్వేషణ

1947 ఆగస్టు 15, 1857ను ద్రోహించేస్తే 1948 సెప్టెంబర్ 13 తెలంగాణా రైతాంగపోరాటానికి ద్రోహంచేసింది. ఈ ద్రోహాన్ని పసిగట్టి ప్రతిఘటించాలని పూనుకున్న ప్రజలకు మరోసారి 1951 అక్టోబరు 20 ద్రోహంచేసింది. శిఖరమెక్కుతూ చీమలు మళ్ళా మొదటికి జారిపడటం మన కళ్ళముందు కనిపించే దృశ్యం. అయితే మనుషులు మళ్ళాచేసే ప్రయత్నం యాంత్రికంకాదు చైతన్యపూర్వకం.

భారతదేశంలో 1857లో ప్రారంభమైన ప్రజాస్వామిక విప్లవం ఎన్నో వీరోచిత రైతాంగ పోరాటాలలో దారి వెతుకుతూవుండగా సామ్రాజ్యవాదంతో కుమ్మక్కయిన బూర్జువావర్గం కాంగ్రెస్ నాయకత్వంలో కుట్రచేసి విఫలంచేసింది.

తెలుగుభాష గౌరవం, తెలుగుజాతి ప్రతిపత్తి వెతుక్కోవడానికి ప్రారంభమై సంఘసంస్కరణోద్యమంగా తలయెత్తిన తెలంగాణా 'దున్నేవానికిభూమి' నినాదంతో సాయుధమైంది. ఈనాడు నక్సల్బరీ వెలుగులో ఏ రైతాంగపోరాటానికి స్పష్టమైన నిర్వచనమూ నిర్దేశకత్వమూ మనం చెప్పుకుంటున్నామో ఆ లక్షణాలన్నీ ఆనాడు ప్రజలు చేపట్టిన ఆ పోరాటానికున్నాయి. జపాన్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా చైనా ప్రజలు నిర్వహించిన పోరాటంలో ఏ జాతీయవిముక్తి పోరాట లక్షణాలున్నాయో తెలంగాణా ప్రజలు నైజాంకు, ఆయన వెనుకదన్ను అయిన బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి, ఈ ఇద్దరి కనుసన్నల్లో అధికారంకోసం పొంచిన స్వదేశీ పెట్టుబడిదారీ, భూస్వామ్యవర్గాలకు వ్యతిరేకంగా చేపట్టిన పోరాటంలోనూ ఆ జాతీయవిముక్తి పోరాట లక్షణాలే వున్నాయి. భేదమల్లా ఈ లక్షణాలను నెహ్రూ పటేల్‌వర్గాలు గుర్తించినంత సునిశితంగా ఈ పోరాటానికే నాయకత్వం వహించిన ఆనాటి కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం గుర్తించలేదు. లేకపోతే స్వతంత్రించిన నైజాంకు రక్షణ, విదేశాంగ విధానంతప్పస్వతంత్ర ప్రతిపత్తి నివ్వడానికి అంగీకరించిన కాంగ్రెస్ కేంద్ర ప్రభుత్వ స్వభావాన్ని 'పోలీసుచర్య'లో గ్రహించలేకపోవడం అమాయకత్వమైనా కావాలి, ధూర్తత్వమైనాకావాలి. పోనీ, నైజాంను గద్దెదించడానికి వచ్చిన యూనియన్ మిలిటరీ సైన్యాలు ఏంచేశాయి? కాంగ్రెస్ జెండానీడన 'దున్నేవానిచేతిలోని భూమిని భూస్వాములకు కట్టబెట్టాయి. సాయుధంగా భూమిని కాపాడుకుంటున్న రైతాంగాన్ని, గెరిల్లాలను నాలుగువేలమందిని మట్టుబెట్టాయి. జాతీయవిముక్తి పోరాటానికి అనివార్యమైన దీర్ఘకాలిక సాయుధ రైతాంగ స్వభావాన్ని నెత్తురుపేర్లలో ముంచి కార్మికవర్గపార్టీ మాత్రమే నాయకత్వం వహించి త్యాగాలకు వెనుదీయకుండా కొనసాగించగల చారిత్రిక కర్తవ్యాన్ని పార్లమెంటరీ రాజకీయాల వలపన్ని ఎన్నికల నూకలుచల్లి రివిజనిజంవైపు మళ్ళించాయి.

మోసపోయిన తెలంగాణా మాత్రమే కాదు భారత రైతాంగం నక్సల్బరీలో కానీ తెప్పరిల్లలేదు. నక్సల్బరీకి పదిహేను సంవత్సరాల్లోనూ తెలంగాణాకున్నంత విస్తృతి రాకపోవచ్చు. కాని ఒకనిప్పురవ్వ దావానలమై నలుదిక్కుల రగులుకోవడం, నూతన ప్రజాస్వామిక విప్లవానికి వ్యవసాయ విప్లవం ఇరుసులాంటిదని స్పష్టంగా, సైద్ధాంతికంగా గ్రహించడం, రాజ్యాధికారం ప్రజల చేతికి రాకుండా దున్నేవాని చేతికిభూమి రాదనే అవగాహన, ఈ రాజ్యాధికారం తుపాకీ గొట్టం ద్వారా సాధించుకోవలసిందే కాని పార్లమెంటరీ పంథా ద్వారాకాదని తేల్చుకోవడం నక్సల్బరీ సాధించిన పరిణతి. అందుకే తెలంగాణా వేగుచుక్క అయితే నక్సల్బరీ ప్రభాత వెల్లువఅయింది. అంతే కాదు శత్రువుదాడి, కుట్రసరేవరి, నాయకత్వం చేసిన వంచన కారణంగా ఓడిపోయిన తెలంగాణా నుంచి నక్సల్బరీ నేర్చుకున్న గుణపాఠం రివిజనిజం మీద రాజీలేని పోరాటం. రివిజనిజంపై పోరాటానికి దిక్సూచి జనచైనా శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవం.

నక్సల్బరీ ఆటుపోటులకు గురయింది. 'కుడిఎడమలదగా'కు ఎర అయింది. వెనుకంజ వేసింది. కాని ఓడిపోలేదు. 'తిరిగి తిరిగొచ్చింది నక్సల్బరీ'- నక్సల్బరీ, శ్రీకాకుళాలు నడచి, గడచి అడుగులు గంతులుగా మళ్ళా తెలంగాణాలో అడుగుపెట్టింది. కాదు, ఆదిలాబాదు అడవుల్లో, కరీంనగర్ మైదానాల్లో, కరీంనగర్ పల్లెల్లో, ఆదిలాబాదు గనుల్లో, గోదావరిఅలల్లో ఒళ్ళువిరుచుకొని కళ్ళుతెరిచింది. మళ్ళీ ఒకసారి తెలంగాణా భూస్వామ్యం సాంఘిక బహిష్కరణను రుచిచూసింది. మళ్ళా ఒకసారి తెలంగాణా ప్రజాబాహుళ్యం భూమికోసం, భుక్తికోసం కెరటాలు కెరటాలుగా కదిలే ఎర్రజెండా ప్రవాహ స్వభావాన్ని పొందింది. తెలంగాణా రైతాంగ పోరాటకాలపు ప్రజాస్వభావానికి, నక్సల్బరీ సైద్ధాంతికపరిణతి తోడయి ఈనాడు తెలంగాణా ఆదిలాబాదు కరీంనగర్ రైతాంగపోరాటంలో తనకుతాను ఆవిష్కరించుకుంటున్నది. ఇది పునాదిలో కనిపించినంత స్పష్టంగా ఉపరితల అంశాల్లోనూ ప్రతిఫలిస్తున్నది. 'ప్రజా యుద్ధ పంథా'లో తెలంగాణా భారత రైతాంగ విముక్తికోసం ప్రారంభమైన నూతన ప్రజాస్వామిక విప్లవానికి మళ్ళా ఒకసారి దారిచూపే అవసరందృష్ట్యానే ఈ సమీక్ష, ఈ సంచిక.

27-10-82 — సంపాదకుడు

## ఎర్రెర్రని తెలంగాణా

చెరబండరాజు

ఇదేనండి ఇదేనండి ఎర్రెర్రని తెలంగాణా
కమ్యూనిస్టు గుండెకాయ కష్టజీవి కలలకోన ॥ఇదే॥

.... ...., .... .... .... .... .... ....

.... .... .... .... .... .... .... ....

ఏ యింట్లో ఏ బిడ్డడు ఎందుకొరకు చచ్చెనని
అడగండీ ప్రతిపల్లెను ప్రతిచెట్టును ప్రతిగుట్టను
ఆత్మకథలు చెప్పునవీ దోపిడింక పోలేదని ॥ఇదే॥

కంటనిప్పులను చెరిగిన చండ్ర రాజేశ్వరయ్య
పోరాటం నడిపించిన పుచ్చలపలి సుందరయ్య
ఎన్నికలని కొంపార్చిరి ఇంకెప్పుడు నమ్మకండి ॥ఇదే॥

నాటి తెలంగాణా నుండి శ్రీకాకుళ గిరిజనుడు
శ్రీకాకుళ పోరునుండి తెలంగాణా రైతువీరుడు
భూమి భుక్తి ముక్తికొరకు విప్లవించినారు చూడు ॥ఇదే॥

కొమరన్నకు వారసులూ కోరన్నలు మంగన్నలు
మేలుకొనే వున్నారు తెలంగాణా పల్లెల్లో
కోయంటే కోయంటరు సైయంటే సైయంటరు ॥ఇదే॥

చల్లబడదు చల్లబడదు తెలంగాణా విప్లవాగ్ని
మళ్ళా చెలరేగుతుంది ఆగకుండ పోరుతుంది
నక్సల్బరి అడుగులోన అడుగువేసి నడుస్తోంది ॥ఇదే॥

# తెలంగాణా పోరాట పాటలు

## ప్రజల పాటలు

జె. సి.

శ్రమ ఒక సజీవమైన ఉత్పాదకక్రియ. అది మనిషికీ మనిషికీమధ్య సామాజిక సంబంధాన్ని సృష్టించి, పెంపొందిస్తుంది. ఈ మానవసంబంధంనుంచే అన్ని కళలూ, విజ్ఞానం, నాగరికత, సంస్కృతి పుడతాయి. మానవాంశకు సర్వతోముఖ రూపం శ్రమ, శ్రమశక్తి లేక శ్రమజీవికి పర్యాయపదం శ్రమ.

పరాయీకరణక్రమంలో శ్రమ లేక శ్రమఫలితం ధనంగా, పెట్టుబడిగామారి భూస్వామి, పెట్టుబడిదారుల వశమౌతుంది వర్గసమాజంలో. కాబట్టే శ్రమసృష్టించిన సామాజిక సంబంధం, దాన్నుండిపుట్టిన కళలు, విజ్ఞానం, నాగరికత, సంస్కృతులు గూడ భూస్వామ్య, పెట్టుబడిదారీ విషయాలుగా మారుతాయి.

అయితే, శ్రమ నిత్యనూతనమైంది, సజీవమైంది. అది ఏమోతాదులోనయితే పరాయీకృతమౌతుందో అదే మోతాదులో, ఇంకఎక్కువగా పునఃసృష్టింపబడుతుంది. భూస్వామి, పెట్టుబడిదారులు ఎంతసంపన్నులైతే అంతఎక్కువసంఖ్యలో శ్రమజీవులు పెరిగి, అంతఎక్కువస్థాయిలో శ్రమ పరాయీకరణ పెరుగుతుంది.

అదేవిధంగా శ్రమలోపుట్టి, దాంతోపాటే భూస్వాముల, పెట్టుబడిదార్ల వశం లోకి వెళ్ళిపోయిన కళలు, విజ్ఞానం, నాగరికత, సంస్కృతులవెంటే నిత్యనూతనమయిన సజీవమైన కళలూవగైరాలు శ్రమతోబాటు ఉద్భవిస్తాయి.

దీన్నిబట్టి మన కర్థమయ్యే విషయం ఎప్పుడూ అధికారవర్గ కళలు (వగైరాలు) ప్రజల కళలు (వగైరాలు), అలాగే అధికారవర్గ సాహిత్యం, ప్రజల సాహిత్యం అంటూ వేర్వేరుగానే ఉంటాయని. ప్రజలంటే యిక్కడ శ్రమజీవులని అర్థం.

ఈ అర్థంలోనే ఇప్పటి "జానపద సాహిత్యాన్ని" ఒకప్పటి ప్రజలసాహిత్యంగా అర్థం చేసుకోవాలన్పిస్తుంది. అందువల్లనే "జానపద సాహిత్య సంప్రదాయం"లో భూస్వామ్య సమాజపు అవశేషాలు, విలువలు మనకు కన్పించడం. అయితే, "జానపదసాహిత్యం" కూడా పరాధీనమయిన ఒకప్పటి ప్రజల సాహిత్యం అవటంవల్లనే దానిరూపాలు ఇప్పటికీ, మౌలికంగా, ప్రజాసాహిత్యరూపాలే. ఈ సందర్భంలోనే వర్గసమాజంలో శిష్టసాహిత్యం అనబడే అధికారవర్గ సాహిత్యం (మిగతా కళారూపాలు విజ్ఞానం, నాగరికత, సంస్కృతులతో బాటు) మానవాంశనుండి దాదాపు పూర్తిగా విడిపోయి నిర్జీవంగా, కృత్రిమంగా తయారైన విషయంగూడ చెప్పుకోవాలి.

జానపద సాహిత్యం -యొక్క మౌలికరూపాలు యిప్పటికీ ప్రజాసాహిత్య రూపాలే అని చెప్పుకొన్నాం. ఆ రూపాలు గీతం, గేయకథలు మొదలయినవి. ఆరూపాలన్నీ ఉత్పాదక క్రియ అయిన శ్రమలో భాగంగా దాని లయననుసరించి పుట్టిన పాట యొక్క స్వరూపాలే. వీధిభాగవతం, గొల్లకథలు, కోలాటం పాటలు, లేక ఉయ్యాల పాటలు, లేక ఇంకేదైనాకావచ్చు. అవన్నీ లయప్రధానంగాగల నాట్యం, వాద్య సంగీతాలతో కలగలిసిన పాటకు భిన్న రూపాలే.

జానపద సాహిత్యం- ఇంకాస్పష్టంగా చెప్పాలంటే, జానపదగీతాలు- భూస్వామ్య సంస్కృతి ప్రభావంలోకి పూర్తిగా పోలేదనే చెప్పాలి. ఎందుకంటే సాహిత్యంలో స్థూలంగా రూపం, భావం, భాష, ప్రతీకలు ముఖ్యం. రూపంరీత్యా జానపదగీతం ప్రజాసాహిత్య రూపమైన పాటనే ఆశ్రయించుకొని ఉంది. ఇకభాష. చాలావరకు జానపద గీతాల్లో భాష ప్రజలభాషే. జానపదగీతాన్ని ఏ ఒక్కవ్యక్తీ రాయడు. అది ప్రజల నోళ్ళలోనాని కొందరు వ్యక్తులు దానికి మెరుగులు దిద్దినప్పటికీ మౌఖికసాంప్రదాయంవల్ల జీవిస్తుంది. గొల్లకథల్లాంటి కథాగేయాల్ని ఒకరు లేక ఇద్దరు ముగ్గురు పాడినప్పటికీ, ప్రతిసారీ కథనం ఒక్కరీతిగా ఉండదు. సమయసందర్భాన్ని బట్టి మార్పులు చేర్పులుండవచ్చు. ఇక పాడేవాళ్ళు చాలావరకు శిష్టసంప్రదాయం నుండి దూరంగా ఉన్నవాళ్ళు. ప్రజల్లో భాగంగా ఉన్నవాళ్ళుగాబట్టి జానపదగీతాల్లో ప్రజల భాషే సంరక్షింపబడ్తుంది.

ఇకభావం, ప్రతీకలు : వీటి విషయంలోమాత్రం అధికారవర్గ సంస్కృతి ప్రభావం, శిష్టసాహిత్యంలో కన్పించినంత ఎక్కువగా కన్పించకపోయినా శ్రమతో బాటు పరాయీకరణచెందిన జానపదసాహిత్యం అధికార వర్గసంస్కృతికి ఊడిగం జేసేస్థితికి దిగజారుతుంది. మతవిషయాలు ప్రధానంగాగల వీధిభాగవతాలు దీనికి ఉదాహరణగా చెప్పుకోవచ్చు.

కళలు శ్రమనుంచి ఉద్భవించినా శ్రమను పరాయీకృతంచేసే వర్గసమాజంలో ఆ సమాజపు విలువల పరిధిలోనే ఉద్భవిస్తాయిగాబట్టి, ఆ విలువలు శ్రమతోబాటు కళలనుగూడ పరాయీకృతం చేస్తాయి. అయితే కళల పరాయీకరణ ఎంతకాలంలో జరుగుతుందో చెప్పటంకష్టం. ఉదాహరణకు, సృజనాత్మకమయిన శ్రమనుండి పుట్టిన పాట, ఆ పాటపాడిన శ్రమజీవి లేక శ్రమజీవుల చైతన్యాన్ననుసరించి పాట రాగంగా పుట్టిన వెనువెంటనే, అంటే ఆరాగానికిభావం, భాష, ప్రతీకల్నిఎంచుకుంటున్నప్పుడో లేక తరువాతికాలంలో మౌఖికసాంప్రదాయంలో నలుగుతున్నపుడో పరాయీకరణ చెంది కృతకంగా తయారుగావచ్చు.

అయితే చారిత్రికంగా సమకాలీన ప్రజాసాహిత్యమనేది ఉండాలిగదా అన్నది ప్రశ్న. శ్రమజీవుల సామాజిక సంబంధంనుండి పుట్టిన సాహిత్యం శ్రమవలెనే సజీవమైంది. ప్రతిసారీ అలాంటి సాహిత్యం పరాయీకరణచెంది అధికారవర్గాలకు ఊడిగంజేసేస్థితికి దిగజారడమో లేక చారిత్రిక ఉపరితలానికి రాకపోవడమో జరిగి ఉండాలి. కారణం అలాంటి సాహిత్య నిర్మాతలకు పోరాటబలం యివ్వగల్గిన సైద్ధాంతిక చైతన్యం లేకపోవడం గావచ్చు.

కాని ధనానికీ, శ్రమకు మధ్య పెట్టుబడికీ, శ్రమకు మధ్యగల వర్గసంబంధం పాతసమాజ గర్భంలోంచి అత్యున్నత, విప్లవాత్మక సామాజిక సంబంధంగా విధిగా చీల్చుకుని వస్తుంది. అదే ప్రజాపోరాటం. తెలంగాణా రైతాంగపోరాటం గానివ్వండి, నక్సల్‌బరీ, శ్రీకాకుళం, కరీంనగర్- ఆదిలాబాద్ పోరాటాలుగానివ్వండి- అటువంటి పోరాటానికి సైద్ధాంతిక చైతన్యం చేదోడు వాదోడైనపుడు చైతన్యవంతమైన ప్రజాసాహిత్యం పోరాట సాహిత్యంగా పుడుతుంది. ఆ విధంగా పుట్టిన ఒక సాహిత్య రూపమే తెలంగాణా పోరాటపాటలు.

X X X X

జానపదగేయ లక్షణాల గురించి వివరిస్తూ డా॥ బి. రామరాజుగారు ఆరుప్రధాన లక్షణాలను, నాలుగు ఉపలక్షణాలను తమ 'తెలుగు జానపద గేయసాహిత్యము' అనే పుస్తకంలో ఉటంకించారు. ప్రధానలక్షణాలలో మొదటిది: జానపదగేయము "ఆదిలో వైయక్తికమేయైనను, క్రమపరిణామమున నితరవ్యక్తుల దిద్దుబాట్లకు లోనైన"ది. దానికొక "జానపదగేయమునకు "ప్రత్యేక కవి యుండడన్నమాట". రెండవది పరిణత లేక నియమిత స్వరూపము లేకపోవుట" మూడవది: "గేయకాల మిద మిత్థమని యుండకపోవుట" నాల్గవ లక్షణము: "ఈ గేయములు వ్రాతప్రతులతో గాక కేవలము మౌఖిక ప్రచారముననే జీవించును" అయిదవ లక్షణము: "వాని సహజ (అకృతక) శైలి." ఆరవలక్షణము: "పాడుకొనుటకు వీలుగానుండుట." ఇక ఉపలక్షణాలు: 1) "ఆశురచనము," 2) "పునరావృత్తి," 3) "జనసామాన్య పరిచిత వస్తువు," 4) భావకవిత్వము మాదిరిగాకుండా "జానపదగేయము బహిర్వస్తు కవిత్వము (objective poetry)" అయినప్పటికి "ఏ కవిత్వమైనను ఆత్మపర మైనదే యనవచ్చును." కావున "జానపదగేయము అందును రసరాట్టగు శృంగార మునకే యగ్రతాంబూలము" అని వీరి నిర్ణయము.

రామరాజుగారివలెనే ఆర్వీయస్ సుందరం, జానపద సాహిత్యం పై పరిశోధన కావించిన ఆంధ్ర పండితులూ మౌఖికసాంప్రదాయంలో సామూహిక

సృష్టిగా పరిణతిచెందినప్పటికీ జానపదగేయం పుట్టుకతో వైయక్తికసృష్టియనే వాదిస్తారు. అయినా అది శ్రమనుంచిపుట్టింది అన్న విషయాన్ని గూడ అంగీకరిస్తారు. ఈ విధంగా ఈపండితులవాదన స్వయంప్రతికూలంగా ఉంటుంది.

కాని ఉత్పాదకక్రియయైన శ్రమ మౌలికంగా సామాజికమైంది. ఎందుకంటే శ్రమజీవి ఒకసంఘజీవి (Species being). "వైయక్తికత" అనేలక్షణం మనిషి శ్రమఅనే సామాజికమైన మానవాంశనుండి పరాయీకరణచెందేక్రమంలో పుట్టింది. అది సొంతఆస్తి ఆధారంగాగల వర్గసమాజంలో మనిషిగుణం. అటువంటి గుణం వల్లనే శృంగారాది భూస్వామ్యసమాజ లక్షణాలు శిష్టసాహిత్యానికి కలవడుతాయి. అదేవిధంగా వర్గసమాజంలో శ్రమలోభాగంగా పుట్టినప్పటికీ ఆ శ్రమ పరాయీకరణ చెందినంతమేరకు ఆక్రమంలో పాటగూడ పరాయీకరణచెంది ఆ వర్గసమాజ లక్షణాలకు కొంతవరకు విధేయంఅవుతుందని చెప్పవచ్చు. అందువల్లనే మనకులభించే జానపదగేయాల్లో వర్గసమాజ సంస్కృతిలక్షణాలే ఎక్కువకన్పిస్తాయి. కాని దాని మౌలికరూపానికీ శ్రమకూమధ్య సంబంధంమాత్రం విడదీయరానిది. ఈ సంబంధం వల్లనే శ్రమ పోరాటమనే అత్యున్నత సామాజిక సంబంధంగా మారినప్పుడు దాని పరాయీకరణ అంతంగావడానికి నాందియేర్పడి, ఆ నాందిలోనే పాటగూడ "జానపదగేయా"నికున్న అవలక్షణాలనుండి సంరక్షింపబడే అవకాశముంది. ఆ అవకాశాన్ని పాటకుకల్పించి ఆంధ్రులచరిత్రలో బహుశః మొదటిసారిగా పాట ప్రజాసాహిత్యరూపంగా రూపుదిద్దుకునేటట్లు చేసింది తెలంగాణా రైతాంగపోరాటం అని చెప్పవచ్చు.

* * * *

తెలంగాణా పోరాట పాటలు అసంఖ్యాకంగా ఉండవచ్చుగాని, 1972లో, 1977లో విరసం ప్రచురించిన రెండుసంపుటాలు మాత్రమే సులభంగా లభ్యంగావటం మూలాన వాటిలోని పాటల్నిమాత్రమే చర్చించుకుందాం. మొదటి సంపుటంలో 42 పాటలు, రెండవ సంపుటంలో 21 పాటలున్నాయి. దాదాపు ప్రతిపాటకు ఒకప్రత్యేకమైన లయ, బాణీలున్నాయి. రామరాజుగారిలాగ గణవిభజనకు పూనుకుంటే ఏదో ఒక గణక్రమంలో ప్రతిపాట యిమడవచ్చుగాని గణాలు, ఛందస్సు భూస్వామ్య సమాజంలోని పరాయీకృతమైన అధికారవర్గ సాహిత్య లక్షణాలన్న విషయం మరువరాదు. ప్రజలపాటల్లో ఆ కృతకత్వం ఉండదు. శ్రమలో ఎంతవైవిధ్యం, సహజత్వంఉందో అంతవైవిధ్యమూ, సహజత్వం శ్రమజీవులపాటల్లో కన్పిస్తాయి.

శ్రమలోపుట్టిన పాటలకు వర్గసమాజంలో శ్రమకున్నంతవిలువే ఉంటుంది గాబట్టి అవిశిష్టజనుల పరిచయంలోకి చాలావరకురావు. ప్రజలనోళ్ళలో జీవిస్తాయి.

పదాలు, ప్రతీకలు, భావం మొదలగునవి చారిత్రికంగా మారవచ్చు. కాని లయ, రాగం లేక బాణీ మాత్రం శ్రమజీవుల జీవితంతో, శ్రమతోముడిపడి వైవిధ్యాన్ని, సహజత్వాన్ని విడనాడకుండా జీవిస్తాయి. అటువంటిపాటల్ని ప్రజలపాటలనే అనాలను కుంటాను. 1946-51లో తెలంగాణా రైతాంగ పోరాజచైతన్యంతో కొత్తజీవాన్ని, అర్థాన్ని పుంజుకున్న ఆ ప్రజలపాటలే తెలంగాణా పోరాటపాటలు.

"ఈ గేయాలను రాసిన ఒకోకవి ఒకమహాకవి, ప్రజామహాకవి" ("వారసత్వం" తెలంగాణా పోరాటపాటలు, మొదటి సంపుటి). కాని వైయక్తికంగా కాదు, సామాజికంగా, పోరాటంలో అంతర్భాగంగా. కె. వి. రమణారెడ్డిగారన్నట్లు, "వికరమైన పోరాటసాహిత్యం పోరాటం ఆటుపోటులను, గెలుపోటాలను, సుఃఖదుఃఖాలను స్వయంగా అనుభవించే జనం మధ్యనుంచే వస్తుంది." (తెలంగాణా పోరాటపాటలు, రెండవ సంపుటి) ఎందుకంటే పోరాట గేయాన్ని లేక పాటను రాసిన కవి తనపాటకు రూపాన్ని వస్తువును ప్రజల నోళ్ళలోంచి, అనుభవాల్లోంచి తీసుకుంటాడు. అతడు కూడా ప్రజల మధ్యనుంచి వస్తాడు. అతడు ప్రజల మనిషి.

తెలంగాణా పోరాటపాటల్లో చాలా పాటలు మృతవీరుల త్యాగాలను, వీరోచిత సంఘటనల్ని వర్ణించేవే. ఈ పాటలన్నీ పోరాటమనే, అత్యున్నత మయినప్పటికీ ఒక ప్రత్యేకమయిన, సామాజిక సంబంధం చుట్టూమాత్రమే ఎదిగిన పాటలవటం మూలాన కావచ్చుకాని వాటిలో శ్రమజీవనవస్తు వైవిధ్యం అంతగా కన్పించదు. అయితే ఈ విషయంలో నక్సల్‌బరీ తరువాత వచ్చిన శ్రీకాకుళ, కరీంనగర్ - అదిలాబాద్ పోరాటాల్లో పుట్టిన పాటలు అపవాదాలు.

శ్రమజీవుల బతుకులోని వైవిధ్యాన్ని, సౌందర్యాన్ని, సృజనాత్మకతను కొన్ని పోరాట గీతాలకు మూలాలయిన పాటల్లో దర్శించవచ్చునేమోగాని అవి భూస్వామ్య భావజాలంలోపడి పరాయీకరణచెంది జానపదగేయాలుగా మారిపోయిన పాటల్లో మరుగుపడిపోయాయి. ఆపాటలు అన్నిగాకపోయినా కొన్నైనాలభిస్తే వాటిని జాగ్రత్తగా పరిశీలించి వాటిలోని ప్రజాసాహిత్య లక్షణాలను ఎత్తిచూపవచ్చు. ఉదాహరణకు

ఏటికేతంబెట్టి ఎయిపుట్లు బండించి
ఎన్నడూ మెతుకెరుగరన్నా - నేను గంజిలో మెతుకెరుగరన్నా
కాళ్లేయి కడుక్కోని కట్టమీద గూసుంటె
కాకిదన్ని పాయెరన్నా కాకిపిల్లాదన్ని పాయెరన్నా
పోదుకూచాల్లేక పొయికాడ కూసుంటె
పోరీదన్ని పాయెరన్నా పోరితల్లి దన్నిపాయెరన్నా

చుక్కపొద్దునలేచి బొక్కెనెత్తుక పోంగ
బొక్కబోర్లా బడితిరన్నా - నేను పక్కలిరుగా బడితిరన్నా
నాదేటి బతుకాయెరన్నా - నేను నాడె చావకపోతిరన్నా

ఈ పాటలో శ్రమజీవి తన సృజనాత్మక శక్తితో వ్యవసాయంజేసి వెయ్యిపుట్ల ధాన్యం పండిస్తాడు. అయినా అతనికి మెతుకుకూడా దక్కదు. బిడ్డకూ, భార్యకూ, ఊరివారి కందరకూ లోకువౌతాడు. కారణం తన శ్రమఫలం తనదిగాకుండాపోయింది. అతడి శ్రమ అతడి నుండి పరాయీకరణ చెందిన తరువాత అతడు తన భార్యాబిడ్డలకు ఊరికీ, పశుపక్ష్యాదులకు, చివరకు తనకుతానే పరాయివాడౌతాడు. కార్ల్ మార్క్స్ చెప్పిన పరాయీకరణ సిద్ధాంతాన్ని ఈపాట పాడిన అనామక శ్రమజీవి తన అనుభవం నుంచి ఎంత సులభంగా, దుఃఖభరితంగా చెప్పాడో చూడండి. కాని ఇట్లా భూస్వామ్య భావజాలంలో నలిగిపోకుండా ప్రజల కష్టాల్ని, బాధల్ని యథాతథంగా వ్యక్తీకరించే పాటలు చాలతక్కువ ప్రస్తుతం జానపద సాహిత్యంగా పిలవబడుతున్న ఒకప్పటి ప్రజల పాటల్లో.

అయితే ఈ పాటల్లో భూస్వామ్య భావజాలంలో నలిగిపోయినా భూస్వామ్యానికి ప్రతినిధులైనవారిపై శ్రమజీవులకున్న అక్కసు కనిపించకపోదు. ఏ వ్యవస్థలోనైనా ఆవ్యవస్థ విధించిన పరిమితులలో కనీసమైన లేక సామాన్యమైన న్యాయాన్ని సంపాదించడానికి ప్రయత్నం జరుగవచ్చు. ఆ న్యాయంకోసం పోరాటం, తిరుగుబాటు కాకపోయినా తిట్టుగా, పాటగా కోపం బయటపడవచ్చు. అటువంటి ప్రయత్నమే తెలంగాణా పోరాటపాటలు, రెండవ సంపుటి గురించి వివరం చేసిన వ్యాఖ్యానంలో

ఉటంకించిన పాటలో కన్పిస్తుంది.

అయ్యయ్యో రెడ్డిసాని - అన్యాయమేమమ్మ
పటేలు పటేలు - నీ మగడు పటేలు
మాదిగోని పెండ్లాన్ని - మంచాము మీదాను
పెట్టుకొని పన్నాడు - పటేలు పాపయ్య
పటేలు పెండ్లాన్ని - మాదిగోడు దెచ్చుకొనె

"నారమ్మ" అన్న శీర్షికగల ఈ జానపదగేయంలో మాదిగకులానికి చెందిన ఎల్లోజీ గ్రామాంతరం వెళ్ళినపుడు అతని భార్యను పటేలు అనుభవిస్తాడు. సరిగ్గా ఆ సమయానికి ఎల్లోజీ తిరిగిరాగా పటేలు పారిపోతాడు. ఎల్లోజీ నారమ్మను చంపి తలుపు తాళం బిగించి వెళ్ళిపోతాడు. రెండు మూడు రోజుల తరువాత పటేలు పాపయ్యవచ్చి తలుపులు బద్దలుకొట్టించి నారమ్మ శవాన్ని

పూడ్పించి దినవారాలు చేస్తాడు. మూడునెల్ల తర్వాత ఎల్లోజీ మంచినాణ్యమైన చెప్పుల జత చేతబట్టుకొనివచ్చి పాపయ్యకు బేరంపెడతాడు. కాని ఇల్లిచ్చినా, భూమిలిచ్చినా, తాను చెప్పులనియ్యనంటాడు. అంతనాణ్యతగల చెప్పులు తను తప్పకుండా తొడగాలి. ఆ భూస్వామ్య దర్పంతో పటేలు ఇంటినీ, భూముల్నే కాకుండా తన చెల్లెల్నీ, తల్లినీ, మరదళ్ళనూ, చివరకు తన భార్యనుగూడ యిస్తానంటాడు. ఆ చెప్పుల దొడగే అతడి తీవి దర్పం ముందు చెల్లెలు, తల్లి, మరదళ్ళు, భార్యగూడ దిగదుడుపే. పటేలు చివరి మాట ఎల్లోజీకి బాగానచ్చింది. కాని "రెడ్డినాని" ఇదేమిన్యాయం అంటే ఎల్లోజీ ఇచ్చిన జవాబుపై చరణాలు.

ఈ పాటలో పటేలు, ఎల్లోజీ యిద్దరూ భూస్వామ్య వ్యవస్థలోని విలువల పరిధి లోనే ఆలోచిస్తారు. వారికి స్త్రీ విలాసవస్తువు. పటేలు తన అధికారం, అహంకారంతో ఎల్లోజీ భార్యను అనుభవిస్తాడు. ఎల్లోజీ పటేలు దర్పానికి పణంపెట్టి అతని భార్య నిమ్మంటాడు. అయితే కనీసన్యాయం ఎవరికి జరిగినట్లు? ఎల్లోజీకా, ఎల్లోజీభార్యకా పటేలుభార్యకా? పటేలు ఎల్లోజీకి అతని భార్యననుభవించినందుకు ప్రతి ఫలంగా తన భార్యనిచ్చినప్పటికీ అదిన్యాయం కాదు. న్యాయానికి పటేలు - ఎల్లోజీల మధ్య సమానత్వం ఎలా అవసరమో అలాగే స్త్రీ - పురుషుల మధ్య సమానత్వం కూడ అవసరమే. అటువంటి న్యాయం వర్గవ్యవస్థలో సాధ్యంకాదు, ఒకవేళ అయితే పోరాట దశలో మాత్రం అవుతుంది.

అందువల్లనే "జానపదగేయా"ల్లో మాదిరిగా కాకుండా పోరాటదశలోని ప్రజల పాటల్లో దోపిడీ వ్యవస్థపై ధిక్కారంతోబాటు, స్త్రీ - పురుషుల మధ్య సమానత్వం, అవ్యాజమైనప్రేమ కన్పిస్తాయి. స్త్రీ పురుషునితో సమానంగా విప్లవోద్యమంలో పాల్గొంటుంది. ఉదాహరణకు: తెలంగాణా పోరాట పాటల్లో అనేకులైన మృతవీరుల వీరగాథల్తోపాటు "చిలకమ్మ" అనే వీరవనిత గురించిన పాటగూడ ప్రాచుర్యం పొందింది.

| | |
|---|---|
| ఏదేశానబుట్టినవే | నా చెల్లెల సిలకమ్మా! |
| ఏదేశానబెరిగినవే | „ |
| నువుపుట్టింది గిరిపురమే | „ |
| నువు బుట్టినప్పుడే | „ |
| కత్తికి కమినిష్టంటివే | „ |

ఇదికోలాటంపాట. వరినాట్లలోగూడ పాడబడే ఈపాటలో కరుణరసం, చిలకమ్మ శౌర్యం, ఆమెపైవాత్సల్యం చిప్పిల్లుతాయి. చిలకమ్మపై దనసాయిపేట దొరోడు

పగబట్టాడు పోలీసులకు లంచంయిచ్చి ఆమెను పట్టుకోడానికి పంపించాడు. పోలీసులు తరుముకురాగా ఆమె

| | |
|---|---|
| కారంపొడిదీసింది | నా సెల్లేల సిలకమ్మా ! |
| థాగీశానం పట్టిందే | ,, |
| వచ్చేపోలీసోళ్లాకూ | ,, |
| కారంపొడి దీసిందే | ,, |
| తూర్పారా బట్టిందే | ,, |
| వచ్చేపోలీసోండ్లయిన | ,, |
| ఆ కారంపొడి ఘాటునకు | ,, |
| కంట్లా నల్చుతున్నారే | ,, |
| వాళ్ళనివైన దప్పించింది | ,, |

కాని పోలీసులామెను వెంబడించగా పరుగెత్తిపోయి ఒకపెద్దబావిలో దూకింది. ఒకరితర్వాత ఒకరు నల్గురుపోలీసులు బావిలోకి మునిగివెతికారు. చిలకమ్మ అడుగున దాగి చచ్చిపోయింది. పోలీసోడు ఆమెశవాన్ని నెత్తిబట్టి పైకిలాక్కొచ్చి కసిదీరక ఈడిచికొట్టి ఆ ఏడుమోటల బావిగడ్డమీద బొందదీసి పాతిపెట్టాడట. ఈ పాటలో అత్యంత సహజమయిన పల్లెలభాష, నుడికారాలతో రంగరింపబడిన వాత్సల్యంతో బాటు భూస్వామ్య సమాజంలో దొరలు-పోలీసులు అవినీతితో కుమ్మక్కయినవిధం, పురుషాహంకారం స్పష్టంగా కన్పిస్తాయి. అదేవిధంగా శ్రామజీవులలో స్త్రీ పురుషుల మధ్య మౌలికంగా తారతమ్యం లేకపోవడంకూడ గమనార్హం. ఏవిధమైన ప్రతీకల్లేకుండా కేవలం సహజమయిన లయ, భాషల సమన్వయంలోనే భావం ప్రేరేపితమవుతుంది. ఆర్వీయస్ సుందరంగారన్నట్లు స్వభావోక్తి ఇలాంటిపాటలకలంకారం.

ఈ పాట కోవలోకివచ్చేవె ఉయ్యాలపాటలు, బహురూపుల పాటలు. తెలంగాణా పోరాటపాటల మొదటిసంపుటి "ముందుమాట"లో చెప్పినట్లు "విసునూరి దొరపాట," "రేనికుంట దొరపాట," "భూతల్లి భారతి" (ఈమూడు రెండవసంపుటంలోఉన్నాయి) అనబడే ఉయ్యాలపాటలుమూడే ఒక చిన్నపుస్తకంగా వేసేంతవిలువయినవి. మొదటి సంపుటంలోని "జై జైలుకొట్టుతూ మనజెండనెత్తాలి" అన్న ఫకీరుపాటగూడా ఈ కోవలోకే వస్తుంది.

విసునూరి రామచెంద్రారెడ్డి అనే భూస్వామి గురించి అనేకమైన పాటలు వ్యాప్తిలో ఉన్నాయి. అతడు నల్లగొండజిల్లా జనగామ తాలూకాలో 60 గ్రామాలపై అధికారం గల దేశముఖు. (ఇటీవల జనగామ తాలూకా వరంగల్లు జిల్లాలో కలప

బడింది) 40 వేల ఎకరాల ఆస్తి కలవాడు. మిక్కిలి క్రూరుడు. కూలికొచ్చిన ఆడ వాళ్ళను చంటిపిల్లలకు చనుబాలు ఇచ్చేవేళకు పోతమంటే పాలుపిండి చూపించమని దొప్పలు తెప్పించి వాటిలో పిండినపాలను పొలంలో చల్లించాడు. ఇంకా భూస్వామ్య వ్యవస్థకు పరిపాటి అయిన ఎన్నో ఆగడాలు చేయించాడు. అతనిపై మొదటి సంపుటిలో "ఎర్రజెండా లెగరేసిరో్రి" అన్నపాట ఉంది. అది తెలంగాణా రైతాంగ పోరాటంలో ముఖ్యమైన ప్రచారసాధనంగా ఉపయోగపడిన గొల్లకథ రూపంలో ఉంది:

తొలిసంర్త మలిసంర్త దొరో!
మీ ఊరిలోపల అయితే దొరా!
ఇసెపు కన్నె ఏత్తిరో్రి
ఇస్నూరు రామచెంద్రారెడ్డి

విసునూరుదొర భూస్వామిక దర్పంతో చేసిన కిరాతకాలన్నీ పూసగుచ్చినట్లు ప్రజలకు స్వభావసిద్ధమైన భాషలో వివరింపబడ్డాయి. రజస్వల అయిన కన్నెపిల్లల్ని గడీకి రప్పించుకొనడం, ఆదివారం నాడు, శుక్రవారం నాడు ముప్పయ్యారుకల దున్నపోతులకు క్షవరాలు చేయించడం, కూలికొచ్చిన ఆడవాళ్ళను మానభంగం చేయడం, పిల్ల తల్లుల పాలుపిండించి పొలంలో చల్లించడం, వ్రతములని నోములనిచెప్పి కోమట్లను, బాపన్లనుపిల్చి, ఊళ్ళోని ఆడవాళ్ళనుగూడ గడీకిపిల్చి ఆగంచేయించడం, వెట్టిచాకిరీ చేయించటం, అన్యాయంగా ఎన్నో భూములు సంపాదించడం మొదలైనవి అందులో కొన్ని. అయితే ఇతని ఆటలు యికసాగవు. ఎందుకంటే

చిన్న పెద్దజీతగాళ్ళు - డ్రైవర్ ఇంజన్ నడిపెటోళ్ళు
జైకొట్టి జండబట్టిరో - ఇసునూరి రామచెంద్రారెడ్డి
సంఘపోలు సైకొట్టిరో - ఇసునూరి రామచెంద్రారెడ్డి
కూటికిగుడ్డకు కరువైనోళ్ళు - చెమటతీసి బతికెటోళ్ళు
తుపాకిబట్టి నిల్చిరో్రి - ఇస్నూరు రామచెంద్రారెడ్డి
ఎర్రజెండలెగరేసిరో్రి-

రెండవ సంపుటంలోగూడ "విసునూరి దొరపాట" ఉందన్నమాట చెప్పుకున్నాం. ఈపాట భూస్వామ్యవ్యవస్థలో ప్రజలపాట లక్షణాలను చాలావరకు నిలుపుకున్నపాట. పరినాటుపాట, ఊయలపదంగా ప్రజలనోళ్ళలో నానుతూ అనేక సంఘటనల్ని గుదిగుచ్చుతూ పరిణామాత్మకంగా పెరిగిన వైనాన్ని చూపెడుతుంది. భూస్వామికదర్పం, భూస్వామికీ జీతగాడికీ మధ్య సంబంధం, స్త్రీపురుష సంబంధం, సమిష్టికృషి, కోపం, చివరికి తిరుగుబాటును స్పష్టంగా దర్శించవచ్చు ఈ పాటలో.

విసునూరి దొర పాపిష్టోడు. వాడిది పన్నెండరుకల వ్యవసాయం, సారంగి ఎద్దు, నందమామెద్దులాంటి మెరికెలైన ఎద్దుల్తో చేస్తాడు. వాడు సిరిపట్ల గ్రామాన దొర దగ్గర జీతగాడైన ఎర్రిగొల్ల మల్లయ్యను తన జీతం చాలించుకుని తన దగ్గర జీతముండమంటాడు. తన పన్నెండుమంది జీతగాళ్ళపై పెత్తనమిస్తానంటాడు. మల్లయ్య తన యింటికిబోయి భార్యను అడిగివస్తానంటడు. భార్య సత్తెమ్మ వద్దంటుంది. దొర జీతానికుంటె "ఊళ్లోన మందికీ (ఉయ్యాలో) / కంటుకావాలిరా (ఉయ్యాలో)" అంటుంది. ఎర్రిగొల్లడు మాత్రం నేను దొరదగ్గర తప్పక జీతాని కుంటాను. నీవడ్డుపెడితె ఊళ్ళొ మందితో నీకు దెబ్బలుపడే ప్రాప్తముందని పెళ్ళాం మాట వినంటాడు. ఇంతలో దొర జీపుకారుపై వస్తాడు మల్లయ్య ఇంటికి. భార్య సత్తెమ్మ ద్వార బంధంలో నిలబడిఉంది. అందమైన ఆడది కళ్ళబడితేచాలు దొరోడికి:

పాపిష్టి దొరోడు ఉయ్యాలో / దాన్నికళ్ళాజూసి, ఉ॥
ఏతల్లిగన్నాదే ఉ॥ / ఏం సక్కగున్నవూ, ఉ॥
రాజుల్లొ నువ్వోగ, ఉ॥ / రాజుబిడ్డావాని, ఉ॥
దొరల్లొ నువ్వోగ, ఉ॥ / దొరసానివై పోను, ఉ॥
హప్పుడూ దొరోడు, ఉ॥ / హనుకుంటవున్నహ, ఉ॥

గొల్లమల్లిగాడొస్తాడు. జీతం కరారయిపోతుంది. నెలఒక్కంటికి ఏడుము (పది కుంచల) ధాన్యం. మూడునెల్లయింది. ఆరుద్రకార్తె, ముసురుపెడుతున్నది. ఊళ్ళో ఉన్న అరకలన్నీతెచ్చి వెట్టిచేయిస్తేతప్ప మన పొలం అందరికంటెముందు నాట్లుపడ దంటాడుగొల్లోడు. గొల్లోనిమాట దొరవింటాడు, తనపొలంకాకపోయినా తను పనిచేసే పొలంలో ఊళ్ళో అందరికంటె ముందు నాట్లుబడాలన్నది ఎర్రిగొల్ల మల్లయ్య తపన. పొలానికీ తనకూ అంత అవ్యాజమయిన సంబంధం. కాని ఆ విధంగా చేయుడానికి భూస్వామ్య సంబంధాల్లో అతినికృష్టమయిన వెట్టిచాకిరీ చేయించడానికి కూడా వెను కాడడు వెర్రిగొల్లడు. నిజానికి అతనికున్నది భూస్వామిపై ప్రేమకాదు. పొలంపై భూమిపై ప్రేమ. ఇదొక్క సంఘటన.

సిరిపట్ల గ్రామం దొర ఎర్రిగొల్ల మల్లయ్యను విసునూరి దొరకు పోగొట్టు కున్నందుకు ప్రతీకారంగా విసునూరి దొర దగ్గరఉన్న ఏబయిదెబ్బల రైఫిల్‌ను దొంగి లిస్తాడు. ఆ రైఫిల్ విసునూరి దొర అభిజాత్యానికి ప్రతీక. ఇంట్లోకి పోయిచూస్తే రైఫిల్ లేదు. విసునూరి దొర గుండె గుబేలుమంది, చిన్నబుచ్చుకున్నాడు అప్పుడు మల్లన్నవచ్చి దొరను చూసి స్వామిభక్తితో ఏం దొరా ! చిన్నబోయున్నవు అంటాడు దొర నా ఆపదను ఆర్పేవాతీర్చేవా నీకెందుకు అంటాడు. మల్లయ్య నీఆపద ఆర్పినా

తీర్చినా నేనేనని అనగానే దొరకు సంతోషమవుతుంది. అసలు సంగతి చెప్తాడు. గొల్లోడు కిటుకు చెప్తాడు దొరకు. తనకు తన అత్తవారుపెట్టిన దావలామొలతాడు. దండకడియాలు, ధోతులు, రుమాలు, సందెడుబర్రెమేత తెచ్చియిచ్చి గొల్లోనివేషం వేసుకుని సిరిపట్లకు పొమ్మంటాడు. ఆ వేషంలో దొరను గొల్లమల్లయ్య అనుకుని పహారాజవాన్లు ఇంట్లోకిపోనిస్తారు. నడిఝామురాత్రి ఎందుకయిందంటే తన పెళ్ళాము తల్లిగారింటికి పోయిందనీ, కోడిపిల్లల్ని వెతికితెచ్చి ఇంట్లో కమ్మేసరికి ఆలస్య మయిందనీ బొంకుతాడు మల్లయ్య వేషంలోఉన్న విసునూరి భూస్వామి. అతడు దొర యింటి వెనకకుపోయి బర్రెకు మేతవేసి బొంతి కుండలు వెతకడం ప్రారంభి స్తాడు. ఆ చప్పుడుకు దొర యివతలికివచ్చి ఏమిచప్పుడంటే 'నమస్తే దొరా! నాకు ఎరుకలేదు. పాలుపిండే సర్వ (గిన్నె) క్రింది గూట్లోపెడితే ఎలుకలెత్తుకుపోయినట్లు న్నవి. వెతుకుతున్నాను. అగ్గిపెట్టె ఇయ్యంటాడు. దీపం ముట్టించి పాలుపిండంటాడు దొర. దొర వెళ్ళిపోగానే దీపం సహాయంతో మల్లయ్య వేషధారి దక్షిణపువేపు గదిలోకెళ్ళి చూస్తె ఆకాంతిలో వెండిరైఫిల్ ధగధగామెరుస్తున్నది. ఆ రైఫిల్‌ను, యింకొన్ని ఆయుధాలను మూటగట్టుకుంటాడు విసునూరి దొర. బర్రెదగ్గరికొచ్చి పాలుపిండబోతే అది తంతుంది. ఊగుడుకర్రతో దాన్ని కొడ్తాడు. అది మూత్రం చేస్తుంది పాలగిన్నెలో. ఆ గిన్నెను కిందిగూట్లోపెట్టి, ఆయుధాలమూట నెత్తిపైబెట్టు కుని వీధిలోకి వెడతాడు విస్నూరిదొర. తెల్లవారి కరకర పొద్దుపొడిచేసరికి "పెనరాని గుంటిలో" (పొలం) "రకురానిబోటి" (గుట్ట) వద్దకు తనుతీసుకుపోతున్న ఆయుధాల కోసం రాకుంటే ఊరివారితో దాటిస్తానని సిరిపట్ల దొరకు చాలెంజిచేస్తూ ఉత్తరంరాసి ఎదురుగాఉన్న కుమ్మరి వెంకులు ఇంటిమూల మడతతో గొడకుకొట్టి పోతాడు. తెల్ల వారుతూనే దాసదాసీలు లేచి దొరకు చాయపెడతారు. కప్పుమీద కప్పు చాయదాగిన సిరిపట్ల దొరకు బర్రెఉచ్చ వాసనవస్తుంది. ఇదేమిటంటే మాకేమీతెలియదు. గూట్లోని పాలగిన్నె తెచ్చి ఎప్పటి మాదిరిగానే చాయ చేశామంటారు దాసదాసీలు. దొర యింటి బయటకుబోయి చూస్తే కుమ్మరి ఎంకులు ఇంటిమూలకు ఉత్తరం కనబడ్తుంది. ఇంట్లోకి పోయిచూస్తే ఏబయిదెబ్బల రైఫిల్ లేదు. ఈసారి సిరిపట్ల దొర గుండె గుబేలుమంది. ఈ సంఘటనలో జీతగాని ప్రభుభక్తి, భూస్వాముల దర్పం, అవి జాత్యం కన్పిస్తాయి. ఈ పాటపాడే ప్రజలకు భూస్వాములపై ఉండే కోపం, వేళా కోళం కూడ అవగతమవుతాయి.

ఇక విసునూరి గ్రామంలో దొర శ్రమజీవులను దోపిడీచేసే విధాన్నివర్ణించే సంఘటన. దొర ప్రజలనోరుగొట్టి బంగళాకట్టాడు. (1940లోనే విస్నూరు రామ చెంద్రారెడ్డి రెండులక్షలవిలువజేసే భవనం కట్టించాడు. చూ॥ రెండవ సంపుటి)

పన్నెండుమంది జీతగాళ్ళనూ, గొల్లమల్లయ్యనూ పిలిపించి ఊళ్ళోవాళ్ళందర్నీ వెట్టికి తోలుకరమ్మన్నాడు. ఊళ్ళోవాళ్ళు వెట్టికిఇరవై అరకలుకట్టారు. మల్లయ్య సారంగి ఎద్దునూ, నందమూ మెద్దునూకట్టి గొర్రుతోదున్నసాగాడు. దొర ఆదిగూడెం (మాలగూడెం) కువచ్చి మాలపెద్దలతో నాట్లకు కూలిమనుషుల పంపమన్నాడు. నగమీదుబోయిన అడ వారు వందమంది, పడుచువారు వందమంది, పసిపిల్లలతల్లులు వందమంది– మొత్తం మూడువందలమందిని పిలిపించు కొచ్చాడు. కర కర పొద్దెక్కుతుండగా ఊరుదగ్గర ఉన్న పొలంలో పనిచేయమన్నాడు. సాయంకాలంకాగానే

పసిబిడ్డతల్లులకు ఉ॥ / పాలుపేష్టలువచ్చె ఉ॥
దొరోనికాడికీ ఉ॥ / పోరయినవచ్చిరీ ఉ॥
పొద్దుపొడిచీనపుడు ఉ॥ / వస్తిమయ్యాదొర ఉ॥
అన్నంబు ఆకలి ఉ॥ / మాకుఅవుతున్నదీ ఉ॥
ఎక్కడాలేనిది ఉ॥ / దడపుట్టుచున్నదీ ఉ॥
పోతమయ్యాదొర ఉ॥ / పొద్దుగూకీనాది ఉ॥
పసిపిల్లలయినా ఉ॥ / పాలకేడుస్తారు ఉ॥

అని అడుగుతారు పసిపిల్లలతల్లులు. అప్పుడు దొరోడు గుర్రాలకొట్టే కొరడాతెప్పించి పోతనన్నవాళ్ళను కొర్లించికొట్టాడు. కుమ్మరి ఎంకుల్ని పిలిపించి నూరు బొడ్డుగిన్నెలు తెమ్మన్నాడు. వాటిలో పసిబిడ్డతల్లుల్ని పాలుపిండమన్నాడు.

ఒకరొమ్ముపిండితే ఉ॥ / గిన్నెనిండిపాయె ఉ॥
కాతెమ్మరొమ్ములా ఉ॥ / పాలునిలబాడెను ఉ॥
అప్పుడూదొరోన్ని ఉ॥ / సాపిచ్చుతున్నరూ ఉ॥

ఇలా శపించినా వదలక పెద్దపెద్ద లాంపులుదెప్పించి పొలంలోపెట్టి పనిచేయమన్నాడు. పోతనన్నవాళ్ళను కొర్లించికొట్టసాగేడు. వెట్టికొచ్చిన అరకలు నడిజాముదాత్రిదాక దున్నాయి. సారంగిఎద్దు, నందమూ మెద్దుకూడ గడగడ ఒణుకసాగాయి. మొండికేసిన గొడ్లను గొల్లమల్లయ్య ఉరికించి, తాటించి గుద్దుతున్నాడు. ఆ మూడువందల కూలీ లకు ధైర్యం తొలిగిపోయింది. అప్పుడు గొల్లమల్లయ్య భార్యచూసింది. మూడు వందలమందికీ ధైర్యంచెప్ప మొదలుపెట్టింది.

ఇంతమందినివాడు ఉ॥ / కొట్టిసంపుతాడ ఉ॥
గొల్లోనిపెల్లమూ ఉ॥ / వెరగొల్లసత్తెమ్మ ఉ॥
వెరగొల్లసత్తెమ్మ ఉ॥ / దానెవచ్చినాది ఉ॥
ఏమయ్య ఓదొర ఉ॥ / ఏమిజేసినావు ఉ॥

మూడువందలమంది ఉ॥ / గుంపాయినిలబడిరి ఉ॥
పొద్దుపొడిచీనపుడు ఉ॥ / వస్తిమయ్యాదొర ॥ఉ
అన్నంబు అకలి ఉ॥ / మాకు అవుతున్నాది ఉ॥
ఎక్కడాలేపిదీ ఉ॥ / దడబుట్టుతున్నదీ ఉ॥
పోతమయ్యాదొర ఉ॥ / పొద్దుగూకీనాది ఉ॥
పసిపిల్లలయినా ఉ॥ / పాలకేడుస్తారు ఉ॥
నీతల్లిదగ్గిరా ఉ॥ / పాలుజీకాలేద ఉ॥
అప్పుడూదొరోన్ని ఉ॥ / అడుగుతున్నదిబాల ఉ॥

అదివినిదొర అద్నా గొల్లదానివి, ఎంతధైర్యమేసీకు అని లెక్కచేయలేదు. ఎర్రిగొల్ల సత్తెమ్మ కూలీలందర్నీ పొలంవిడిచి రమ్మంది. మూడువందలమంది ఆమె నాయకత్వాన్ని అంగీకరించి గడ్డపైకొచ్చారు. దొరోడు సత్తెమ్మదగ్గరకువచ్చి గుర్తుపట్టి కొరడాతిప్పి ఆమెను మూడుదెబ్బలుకొట్టాడు. అదిచూసి ఆడవాళ్ళందరు తమ తమ ఆయుధాల్తో దొరను చుట్టుముట్టి

ఏమిరా దొరోడ, ఉ॥ / హట్లగొడుతున్నావూ. ఉ॥
కూడుకుమ్మాలేక, ఉ॥ / మేము బతికీఉంటే, ఉ॥

అని తలాయించారు. దొరోడికి భయంబుట్టి వాళ్ళని తప్పించుకుని గొల్లమల్లయ్య దగ్గరకుపోయి ఎరాగొల్లోడ, నువు చూస్తూ ఊరుకుంటున్న వేమన్నాడు అతణ్ణి రెండు దెబ్బలుకూడా కొట్టాడు. గొర్రె తోలితోలి అలసిపోయున్న మల్లయ్య విసిగి తన చేతిలోని మేడికర్ర దీసి దొరపై తిరుగబడ్డాడు. అదిజూసి దొర బ్రతుకు జీవుడా అని గుర్రమెక్కి పారిపోయి తన బంగళాలో పడ్డాడు. వాడి అగడాలు చివరికి భూస్వామిత్వం స్థిరంగా నిలిచి ఉండడానికి దోహదమిచ్చిన ప్రభుభక్తిని గూడ తిరగబడేటట్లు చేశాయి.

ఈ విధంగా "విసునూరి దొరపాట" భూస్వామ్యవ్యవస్థ తిరుతెన్నులపై గొప్ప వ్యాఖ్యానం. ఆ వ్యవస్థ ఉక్కుగోళ్ళ నుంచి తప్పించుకునే మార్గాన్ని కూడ ఆ వ్యవస్థలోని పరిస్థితులే కల్పిస్తాయన్న సత్యాన్నిగూడ ఈపాట సూచిస్తుంది. విస్నూరు దొరకు వ్యతిరేకంగా ఆ మూడువందలమంది స్త్రీలుచేసిన తిరుగుబాటు స్త్రీలు పురుషులతో సమానంగా తెలంగాణా రైతాంగపోరాటంలో పాల్గొన్న వాస్తవానికి తార్కాణం.

కూలిజనంలో నాట్లపాటగా పేరుపొందిన ఈ గీతానికి ప్రతికూలీ ఒక కవే. సమిష్టిబాధకు, కృషికి, తిరుగుబాటుకు సమిష్టిశ్రమలో భాగంగా ఈపాట వ్యక్తమా

తుంది. ఈ పాటరీతిలోనే "రేవిగుంట దొరపాట," "మాతల్లి భారతి" పాట గూడ నడుస్తాయి. అయితే "మాతల్లి భారతి" పాట ఈ ఉయ్యాలపాట లయను మంచి ప్రచారసాధనంగా వాడుకున్న పాట. తెలంగాణా రైతాంగ పోరాటాన్కి నాయకత్వం వహించిన కమ్యూనిస్టుపార్టీలో సాంస్కృతిక యోధుడైన కవి పాడినపాట.

ఈ పాట పోరాటం చరిత్రను తెలుపుతుంది. ఒకవిధంగా అది పోరాటం యొక్క మానిఫెస్టోగూడ. మావో, స్టాలిన్, దేవులపల్లి వెంకటేశ్వరరావు, మగ్దుం మొహియిద్దీన్, బద్ద మెల్లారెడ్డి, రాజబహదూర్ గౌడ్, ఆరుట్ల రాం చంద్రారెడ్డిలాంటి అప్పటి కమ్యూనిస్టు నాయకుల్ని వరుసగా తలుచుకుంటుంది. దున్నేరైతుకు భూమి, పొట్టకు సరిపోయేతిండి, ఒంటికి సరిపోయే బట్ట, బాధపెట్టేరోగాలకు మందు, యివే జనంయొక్క డిమాండులు. ఈహక్కుల్ని సాధించడానికి కష్టజీవులందరు కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో ఒక్కటయ్యారు. అది నైజామును భయపెట్టింది. మతం పేరు జెప్పి రజాకార్లను పంపించాడునైజాము. గ్రామాలకు గ్రామాలను కాల్చివేయించి, బీదవాళ్ళందర్నీ ఆడమొగ పసికందులన్న భేదంలేకుండా హింసించాడు, చంపించాడు. జాగీర్దార్లు, దొరలు నైజాముభూస్వామ్య వ్యవస్థకు మూలస్తంభంవంటివారు. వారి ఆగడాలు యింకొకవైపు. కాని కమ్యూనిస్టుపార్టీలో చేరిన వీరగెరిల్లాయోధుల నాయకత్వంలో రజాకార్లను తిప్పికొట్టారు. దొరల్ని వెళ్ళగొట్టి, వాళ్ళఆస్తుల్ని జప్తుచేసి, వేలాది ఎకరాలభూమిని బీదలకూ, దున్నేవారికి పంచిపెట్టి గ్రామరాజ్యాలను స్థాపించారు. ప్రజల పౌరసత్వ హక్కులన్ని పునఃస్థాపింపబడ్డాయి. కాని నైజామునవాబుకు అండదండగా నెహ్రూఉన్నాడు. ప్రజలు పంచుకున్నభూమిని తిరిగి భూస్వాముల కిప్పించేందుకు, ప్రజారాజ్యాలను ధ్వంసంచేసేందుకు వారిమధ్య ఒప్పందం కుదిరింది. నైజాం దొంగల్ని నాశనంజేసినా కాంగ్రెసుదొంగలు వస్తున్నారు. దేశముఖులు, దొరలంతా కాంగ్రెసులోచేరిపోయి సైన్యాలఅండతో గ్రామాలకు తిరిగివస్తున్నారు బీదాబిక్కి పంచుకున్న భూమిని లాక్కుందామని. అయినా రక్తంలోపుట్టి రక్తంలోపెరిగి రక్తజెండను స్థాపించుకున్న వీరగెరిల్లా రైతాంగయోధులు అకుంఠిత దీక్షతో పోరాడవలెనన్న కర్తవ్యాన్ని ఎలుగెత్తి చెప్పుతున్నాడుకవి. పోలీసుయాక్షను ఇండియన్ యూనియన్లో నైజామును కలిపివేయడానికి చేస్తున్నామని ప్రకటించినా కాంగ్రెసుప్రభుత్వపు నిజమైన ఉద్దేశం పోరాటాన్ని అణచివేయడానికి, భూస్వామ్య శక్తులకు మద్దతునివ్వటానికన్నవిషయం కవి తన రైతుసోదరులకు చెప్తున్నాడు.

రెండు సంపుటాల్లో ఉన్న అన్ని పాటల్ని స్పృశించడం ఈ వ్యాసం ఉద్దేశం కాదు. ఒకవేళ అలాచేసినా పోరాటచరిత్ర యొక్క మలుపులకు శ్రమజీవులు కవితా

పరంగా ఏ విధంగా స్పందించారో తెలుసుకోవడం కోసమే, కాని ఈ విషయాన్ని నిర్ధారించడానిక్కి కావలసిన పాటలు రెండు సంపుటాల్లోనూ చాలా తక్కువ.

శ్రమ పరాయీకరణ క్రమంలో దొరల గాదెల్ని, భోషాణాల్ని చేరి అస్తవ్యస్త సామాజిక సంబంధాలకు, విలువలకు కారకమైంది. ఆ సామాజిక సంబంధాలు విలువలు శ్రమకే సంకెళ్ళయిపోయాయి. ఆ పరాయీకరణ క్రమాన్ని నిలిపి ఆరోగ్యవంతమైన సామాజిక సంబంధాలను, విలువలను సృష్టించాలంటే ప్రస్తుత భూస్వామ్య ఉత్పత్తి సంబంధాల నుండి విముక్తి జెందాలి. భూస్వామ్య వ్యవస్థలో ఉత్పత్తి సంబందాలకు మూలం భూమి. శ్రమజీవి శ్రమసాఫల్యానికి, భూస్వామి అధికారానికి ఆధారం భూమి ఆ భూమి, దానిపై శ్రమసాఫల్యం శ్రమజీవికే చెందినట్లయితే అస్తవ్యస్తమయిన సామాజిక సంబంధాలకు, విలువలకు తావేఉండదు. ఈ సత్యం ఇంత స్పష్టంగా, విపులంగా, సైద్ధాంతికంగా మార్క్సిజమ్ చదువుతున్న వారికితెలిసినంతగా బీదరైతులకు తెలియకపోవచ్చుగాని భూమికీ, తమకూ ఉన్న అవినాభావ సంబంధాన్ని చీల్చి, భూమితోబాటు దానిపైని తమశ్రమనూ భూస్వాములు దోచుకొంటున్నారన్న స్పృహమాత్రం వారికుంది. ఆస్పృహే భూమిచుట్టూ వారల్లుకున్న పాటల్లో కన్పిస్తుంది. ఆస్పృహే ఆంధ్రమహాసభలో కమ్యూనిస్టులు నిలదొక్కుకుని తెలంగాణా రైతాంగ పోరాటానికి నాయకత్వం వహించడానికి బలాన్నిచ్చింది.

అప్పటి కమ్యూనిస్టుల సైద్ధాంతిక అవగాహన ఆ స్పృహను ఎంతవరకు చైతన్యవంతం చేసిందో చెప్పటం ఈవ్యాసం ఉద్దేశంకాదు కాని శ్రమ, దానిలయ, స్పృహలు కలిసి కమ్యూనిస్టు ఉద్యమకారులైన తెలంగాణా పోరాట కవులకు మాత్రం ప్రచార భూమికగా అపరిమితమైన వైవిధ్యం, కవితాపటిమగల బాణీలనందించాయి. మచ్చుకు:

1) నిదురమేల్కొనవోయి తెలుగోడా నిలిచిపోరాదోయి మొనగాడా
2) పై పై ఓ నల్లగొండ ధీరుండడా నీవెత్తేదే ఎర్రజెండ
3) ఓ పల్లెటూరి కూలిరైతా పిల్లాజల్లా సల్లగున్నారా
4) లేదంటావా యిది కాదంటావా మరియేమంటావో పెత్తనమా దొరతనమా
5) నాజీల మించిందురా ఓరన్నా నైజాము సర్కారురా
6) గుండెల్లొ గుబాగుబా - కన్నుల్లో భుగాభుగా
7) ఖైదీలం మనమంతా ఖైదీలం
8) బండెనుక బండికట్టి - పదహారు బండ్లుకట్టి
9) పోయె పోయె పోయె తెలంగాణ బంధనాలు

నిఖార్సయిన నేలచూపుతో - ఉప్పెనలాంటి పోరాటంపూపుతో
పటపూర్వపు బతుకుకోసం - కదలి కదిలించినవి

# తెలంగాణా పోరాట నాటకాలు - నాటికలు

కాకరాల

తెలంగాణా (రైతాంగ సాయుధ) పోరాటం, ప్రజల (వర్గ) పోరాటాల పరిణామ క్రమంలో ఒకమలుపు. ఈ దేశపు రాజకీయ చైతన్యానికి సంబంధించి అది కీలకమైన మలుపుకూడా.

మహాకవి 'మగ్దుం' మాటల్లో

"భారతభూమికి జ్యోతితెలంగాణా! నవ
భారతభూమికి నేత తెలంగాణా!! నేడు
పిలుస్తున్నది వేరొకబాటకు తెలంగాణా!
విప్లవ సందేశాన్నందించే వీర తెలంగాణా!!!"

అలాంటి వీరతెలంగాణాలో ఉప్పెనలా లేచిన వర్గపోరాటాల చైతన్యం నుంచి పుట్టిన సమర సారస్వతంలో భాగమే నాటకాలూ నాటికలూ. "అభ్యుదయ ఉద్యమాలతో సంబంధం లేకుండా నిజమైన సారస్వతం పుట్టదు, పెరగదు, అని జీవితానుభవం రుజువుచేస్తుంది" అన్నాడు ప్రఖ్యాత రచయిత హోవార్డ్‌ఫాస్ట్.

ఇలాంటి అనుభవజ్ఞుల మాటల్ని అవగాహన చేసుకుని ఆలోచించేవారికి ఓ జీవితసత్యం తెలుస్తుంది. జీవన ప్రగతికీ, దాన్ని ప్రతిబింబించే సాహిత్య కళా

---

10) ఏరన్న రాకమునుపె ఎరువాకవచ్చెరన్న యవరింట్ల వుందువన్న బువలేని జీతగాడా (మొదటి సంపుటి)
11) దేశాలల్లో ఒక దేశమో రన్నయ్య దేశవిప్లవాలు చూడరో రన్నయ్య
12) శాంతము శాంతము యనుచును - సరగునసే నేతెంచితిని సభలో పలికిన్ నేనవచ్చితి - నాగురువు గాంధీని తలచితి
13) నీ భావరూపం నేదెల్పగా - గాథరెందుకు నీకింతగా?
14) అంబరావే భారతాంబరావే - ధనధాన్యరాసుల్లా తల్లీనీవు రావే

(రెండవ సంపుటి)

మొదటిలైన్లుమాత్రమే ఉదహరింపబడిన ఈ పాటల్ని పాడుతుంటే వినాలి వాటి కవితాగుణాన్ని సరిగ్గా పోల్చడానికి. తెలంగాణా పోరాటదశలో ఈ పాటల్ని అప్పటి ఉద్యమకారులు పాడగా విన్నవాళ్ళుమాత్రమే అవెంతటి గొప్పపాటలో చెప్పగలరు.

ప్రక్రియలకీ, వాటికి దోహదంచేసే, విజ్ఞానవికాసానికీ, ప్రజల (వర్గ) పోరాటాల రాపిడినుంచే ప్రాణచైతన్యం పుడుతుందన్నదే ఆ జీవితసత్యం. "భాష సంఘంలోంచి పుట్టింది. ఈ భాషాసాధనం ద్వారానే, ఒకరి అభిప్రాయాలు మరొకరికి తెలుస్తున్నాయి. కాబట్టి కవిత్వం పుట్టుకగురించి తెలుసుకోవాలంటే సంఘంపుట్టుక గురించికూడా తెలుసుకోక తప్పదు" అన్నాడు "క్రిస్టాఫర్ కాడ్వెల్". కవిత్వ పరిణామంలోనే సాహిత్య ప్రక్రియలు వర్గీకృతం అవుతూవస్తున్నాయి వీటిపుట్టు పూర్వోత్తరాల్ని తెలుసుకోవాలనుకున్నా సంఘం పుట్టుపూర్వోత్తరాల్ని తెలుసుకోవాలి. మానవజీవితం (జాతుల-మతాల-వర్గాల) వైరుధ్యాలతో సంఘర్షిస్తూ వస్తోంది. సంచార మానవజాతుల (అనాగరిక దశల్లోని) వైరుధ్యాల, సంఘర్షణల, పోరాటాల, వ్యభావంలో నాగరికత వేసిన ముడతలు (complexes) వుండవుగనుక వాటిని తేలిగ్గానే తెలుసుకోగలం.

మానవజాతులు స్థిరపడుతున్నకొద్దీ, వర్గీకరణం పెరిగింది. వాటితోపాటు, నాగరీకపుముడతలు (complexes) పెరిగాయి, ఆ పెరుగుదల వైరుధ్యాల్ని పెంచింది. పెరిగిపోతున్న వైరుధ్యాల, సంఘర్షణల, పోరాటాల స్వభావాన్ని సంక్లిష్టంచేస్తూ వస్తున్నాయి. సంక్లిష్టమవుతూ పురోగమిస్తున్న జీవితాన్ని విశ్లేషిస్తూ అద్దంపట్టే కవిత్వం, మిగిలిన సాహిత్యకళాప్రక్రియలూ, అందుకవసరమైన విధంగా వర్గీకరింపబడుతూ వస్తున్నాయి. ఆ వర్గవిభజనసంఖ్య పెరుగుతున్నకొద్దీ, సంక్లిష్టతా పెరుగుతూ వచ్చింది. ప్రజల (వర్గ) పోరాటాలకాలంలో, ప్రజలనుంచీ పుట్టినప్రక్రియల్లో యీ క్లిష్టతవుండదు, చైతన్యంవుంటుంది. పాలకులపోషణలో, కళాకారులు ఈ ప్రక్రియని జీవనాధారాలుగా మల్చుకున్నప్పుడు చైతన్యం హరించుకుపోయి క్లిష్టత ఆ స్థానాన్ని ఆక్రమిస్తుంది.

ఈ భూమిని ఆదిశేషుడు పడగలమీదెత్తుకుని మొయ్యడంఅబద్ధం. కాని ఈ భూమ్మీద చీవితంబరువుని (స్థిరవ్యవసాయం ఆరంభమైన నాటినుండీ) దుక్కిదున్నే రైతాంగం, వారిభుజాలమీద మోస్తూ వస్తున్నారన్నదిమాత్రం నిజం, వారిభుజాలమీద స్వారీచేస్తూ వస్తున్నారు భూస్వాములు. వారినెత్తిమీదనుంచుని 'పంపిణీ'చేస్తూ వస్తున్నారు వాణిజ్యవేత్తలు, వారందరి ఆస్తులకూ కాపలాకాస్తూ వస్తున్నారు పాలకులు (రాజులు). పాలక వర్గాల ప్రాపకంమీద బ్రతికేవిధంగా ప్రణాళికల్ని (చట్టాల్ని రూపొందించుకుంటూ వస్తున్నారు పురోహితులు, వీరిపీడన భరించలేక, ఆ రైతాంగం భుజంమార్చుకుంటున్నప్పుడల్లా వుప్పెనల్లా ప్రజల (వర్గ) పోరాటాలులేచేవి. జడంగా వున్న జీవితాన్ని కదిలించిన ఆ చైతన్యం భావసంఘర్షణల్ని లేపేవి, అవివారికి కొత్త ఊపునిచ్చేవి, కొత్త చూపునిచ్చేవి. కవిత్వ, సాహిత్య కళాప్రక్రియల స్వరూపస్వభావాలే సంపూర్ణంగా మారిపోయేవి అలా నిశితమైన కొత్తచూపుల్ని పెంచుకుంటూ

వస్తున్న ప్రక్రియల్ని పాలకవర్గాలు మలుపు మలుపులోనూ మాయచేసి తమ ఆధిపత్యాల్ని నిలుపుకుంటూ మళ్ళీ అంధయుగాలవైపు నడిపించేవి. ఈ ఆటుపోటుల్నుంచి అంతిమంగా రూపొందిన కళాప్రక్రియలు 'నాటకాలూ, నాటికలు'. అంచేత వీటి రచనా విర్మాణాల్లోనే సంక్లిష్టత వుండడం సహజం.

నాటకం అంటేనే సంఘర్షణ. గ్రీకు నిర్వచనం ప్రకారం నాటకం (Drama) అంటే 'A Thing to be done' అన్నది, ప్రజలతో ప్రాతినిధ్యంవహించే వర్గ పోరాటాలనుంచి పుట్టినవి, వారి చైతన్యాన్ని పెంచే విధంగా, జరగవల్సిన విషయాల్ని ప్రతిపాదిస్తాయి. ఆ పోరాటాలు పుట్టకముందు, పుట్టి అణచివేయబడ్డాక పుట్టినవి, ప్రజాచైతన్యాన్ని విదృపుచ్చి పాలకవర్గాల ఆధిపత్యాలకి ఆయువుని పెంచేవిధంగా జరగవల్సిన విషయాల్ని ప్రతిపాదిస్తాయి. కీలకొంశంలో యిప్పటిదాకా, ప్రపంచంలో వచ్చిన నాటకాల్నీ, నాటికల్నీ పరిశోధిస్తే అంధయుగాల్లో (Dark ages) పుట్టినవి. ప్రజల (వర్గ)పోరాటాల కాలంలో పుట్టినవి వాటినవే పట్టించుకుంటాయి.

"పాలకవర్గాల భావాలే ప్రతి శకంలోనూ ప్రబలంగా వుంటాయి. అంటే సంఘాన్ని భౌతికంగా పాలించేవర్గమే, మానసికంగానూ పరిపాలిస్తుందని అర్థం. భౌతిక విషయానికి సంబంధించిన వుత్పత్తి సాధనాలు, ఏ వర్గం చేతిలో వుంటాయో, ఆ వర్గం చేతిలోనే మానసిక విషయానికి సంబంధించిన వుత్పత్తి సాధనాలు కూడా వుంటాయి" అన్నాడు మార్క్స్ మహాశయుడు.

ఈ సూత్రంతో విశ్లేషించుకుంటే ఏ సమాజాల్లో ప్రజల (వర్గ)పోరాటాలు వేగంగాపుట్టి, పురోహితుల్నించి భూస్వాములూ, భూస్వాముల్నించి వాణిజ్యవేత్తలూ, వాణిజ్యవేత్తలనుంచీ కార్మికకర్షకులూ, అధికారాన్ని కైవసం చేసుకున్నారో అక్కడ విజ్ఞాన వికాసం వేగంగా జరిగింది. కవిత్వ, సాహిత్య, కళాప్రక్రియల పరిణామం కూడా అంతవేగంగానూ జరిగింది. ఈ వేగంలో నాటకాలూ, నాటికలూ, (ఏకాంకికలు) గ్రీకునుంచి రోమ్‌కి, ఇటలీ నుంచి స్పెయిన్‌కి, స్పెయిన్ నుంచి ఇంగ్లండుకీ, ఇంగ్లండు నుంచి ఫ్రాన్స్‌కీ, ప్రపంచమంతా సామ్రాజ్యవాదం గొడుక్కిందికి వచ్చిన ఈ ఆధునిక యుగంలో అమెరికా, రష్యా, చైనా చేసిన ప్రపంచయాత్ర కన్పిస్తుంది.

అదే భౌతికంగా, పురోహిత భూస్వామ్య, వర్గాలపాలననుంచి బైటపడకుండా వస్తున్న, మనదేశంలో నాటకాలూ, నాటికలూ మిగిలిన సాహిత్య ప్రక్రియలు కూడా కష్టలకూ, కళాకారులకూ జీవనాధారాలై వారిభావాల్నే ప్రచారంచేస్తూ వస్తున్న మంద గమనం కనిపిస్తుంది.

జాతీయాభిమానంతో భాసుడు-కాళిదాసు - భవభూతి అంటూ గతకాలపు నాటక రచయితల పేర్లను వల్లించుకున్నా, వారివల్ల ప్రక్రియలు, వ్యక్తీకరణ శక్తిని పెంచుకున్నాయిగాని, ప్రజల చైతన్యాన్ని విదృపుచ్చుతూనే వచ్చాయనిపిస్తుంది. ఇందుకు భిన్నంగా పీడిస్తున్న బికారపు (శకార) పాలకవ్యవస్థని- పీడించబడుతూ అనివార్యంగా వేశ్యలుగా, జూదరులుగా, దొంగలుగా పతన జీవితంలో జారుతున్న ప్రజల్ని- ఆ వ్యవస్థనుంచీ, పీడనకిగురవతూ భావిలో పుట్టబోయే వాణిజ్య వ్యవస్థ ప్రాతినిధ్యాన్ని కొత్త వ్యవస్థని సమర్థిస్తూ, పాతవ్యవస్థమీద తిరగబడిన తిరుగుబాటుదారుల్ని, అంతిమంగా వారి తిరుగుబాటునీ, చిత్రీకరిస్తూ శూద్రకుని 'మృచ్ఛకటికం' మాత్రమే కనిపిస్తుంది. ఆ తర్వాత నాటకాలూ, నాటికల విషయంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదపు దురాక్రమణ దాకా పెద్ద అంధయుగం (Dark age) కన్పిస్తుంది.

అది అంధయుగమే అయినప్పటికీ వర్గపోరాటాలిచ్చిన చైతన్యంలో పుట్టిన నాటకాలూ, నాటికలు వివిధరకాలుగా వర్గీకరించబడిన కళాప్రక్రియలకి తీసిపోని విధంగా మనకీ వున్నాయట. అవి క్షేమన కావ్యప్రబంధాల్ని పరిశీలిస్తే తేలుతుందని 'ఆరుద్ర' గారి లాంటి పెద్దలు ప్రతిపాదిస్తున్నారు. వుంటె వుండొచ్చు కాని, అవి కళల్నే జీవనాధారాలుగా చేసుకున్న కళాకారుల 'జీవిక' ప్రధానంగా మందంగా పరివర్తనచెందినట్టు కనిపిస్తుంది నాకు. అదే వర్గపోరాటాల చైతన్యాన్ని అందుకున్న సమాజంలో పుట్టిన, సారస్వతాల్లో భాగంగా పుట్టిన, నాటకాలూ, నాటికలూ, ట్రాజిడీస్ (Tragedies)గా- కామెడీస్ (Comedies)గా- ఫార్స్ (Farses)గా- మిరకిల్ ప్లేస్ (Miracle plays) గా- మెలోడ్రామాస్ (Melo Dramas)గా- పేంటోమైమ్స్ (Panto Mimes) గా- బ్యాలెట్స్ (Ballets) గా- ఒపేరాస్ (Opperas)గా- ఇంకా ఎన్నో విధాలుగా, వర్గీకరణం చెంది పురోగమించినట్టు కన్పిస్తుంది.

బ్రిటిష్ సామ్రాజ్యవాదం వలసగా మారాక జరిగిన ఆధునిక నాటక నాటిక పరిణామం చూసినా, అధికశాతం వెనుకటి భూస్వామ్య, సంస్కృతనాటకాలకి- విదేశీ నాటక నాటికలకీ, అనుకరణలో, అనుసరణలో కన్పిస్తాయి. మిగిలిన జానపదజాతీయ ప్రక్రియల వెవకదుగూ కన్పిస్తుంది. భూస్వామ్య సామ్రాజ్యవాద, పాలకవర్గాల భావాల్ని ప్రచారం చేసి చేసి, కరిమింగిన వెలగపండ్లయిపోయిన మార్కెట్ నాటకాల్ని తీసిప్రక్కనపెడితే, సామాజిక చైతన్యంకాదు కనీస స్పృహతో వచ్చిన, సాహిత్య కళాప్రక్రియలే తక్కువ. నాటకాలూ, నాటికలూ మరీ తక్కువగా కన్పిస్తాయి.

ఒక్కమాటలో చెప్పుకోవాలంటే, కొన్ని శతాబ్దాలుగా మనల్ని పట్టుకునివదలని జడత్వాన్ని, దాదాపు అరవైఏళ్ళపాటు సాగిన స్వతంత్ర 'సంస్కరణ ప్రజాపోరాటాలు

పూర్తిగా ఒడిలించలేని మందగమనాన్ని- ఆరేళ్ళపాటు ఉధృతంగా సాగిన 'తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటం' ఒడిల్చి, చైతన్యాన్ని పెంచి, వేగాన్ని పెంచింది, విశాలమైన నేలచూపుని ప్రజల కందించింది. ఆ సాంఘిక జాగృతి, ఆ సమర సాహిత్యంలో చోటుచేసుకుంది. అది ఆనాడు పుట్టిన నాటకాలూ, నాటికల్లో నిండుగా వుంది.

X X X X

రెండో ప్రపంచ యుద్ధకాలంనుంచీ, వుధృతంగా ప్రజలకి ఉద్యమాలద్వారా, అందుతున్న ఆ విశాలమైన నేలచూపుని, రైతాంగం అందుకుంటున్నకొద్దీ, పొలాలు మేలుకుంటున్నాయి. 1941-42లో పుట్టిన 'కయ్యూర్' పోరాటంలో పాటలూ, కవితలూ పుట్టినంతగా నాటకాలూ, నాటికలూ పుట్టినట్లు కనబడవు. దేశంలోని అన్ని రాష్ట్రాల్లోనూ, రైతుసంఘాలూ, యువజనసంఘాలూ, కమ్యూనిస్టుపార్టీ రాజకీయనేతృత్వం లో పుట్టి, పెరిగి బలపడుతున్నకొద్దీ, ఆ దృక్పధంలోంచి అవి- ప్రపంచ ఫాసిస్టు ప్రమాదాన్ని- పాలకవర్గస్వభావాన్ని, సాహిత్య జానపద కళాప్రక్రియద్వారా ప్రచారం చెయ్యడం ముమ్మరంగా మొదలైంది. ఆంధ్రరాష్ట్రంలో ఆ చైతన్యం ముమ్మరంగా కన్పిస్తుంది.

దేశంలోని ఇతరప్రాంతాల అనుభవాలకి భిన్నమైన అనుభవాలతో జీవన పోరాటం సాగిస్తోందప్పటికే తెలంగాణా రైతాంగం. దానికీ ఓ చారిత్రక పరిణామ వేగంకనిపిస్తుంది.

దేశంలో ఎప్పటినుంచో రాజకీయ, స్వతంత్ర, సంస్కరణ పోరాటోద్యమాలు సాగుతున్నా, నిజాం తెలంగాణాలో 1921 దాకా ఆ వూపందుకున్న జాడలులేవు. అప్పుడు తాత్కాలిక భాషా, ప్రాంతీయ, సంఘర్షణనుంచి పుట్టిన, సంస్కరణ వేదికయిన 'ఆంధ్రజనసంఘం' ఆవిర్భావంతో రాజకీయఉద్యమాల ఊపుమొదలైంది. ఆ తర్వాత గ్రంధాలయోద్యమాలూ, అటుమీదట 1930కి ప్రధమాంధ్ర మహాసభ, అనేక ఆటంకాల్ని చీల్చిదాటి 1940 కి ఆ ఉద్యమచైతన్యం ప్రజల మధ్యకి వచ్చింది 1941లో తలెత్తిన, జాతీయ, అంతర్జాతీయ, దృక్పధాల, విభేదాలు 1945కి పూర్తిగాపెరిగి, ఆంధ్రమహాసభ రెండుగాచీలింది. అలాచీలిన ఆంధ్రమహాసభ (కమ్యూనిస్టు) మార్గదర్శకత్వంలో బందగీనిచంపించి, దొడ్డికొమురయ్యను హత్య చేయించిన, విసునూరి రామచంద్రారెడ్డిలాంటి, భూస్వాముల దౌర్జన్యానికి వ్యతిరేకంగా తెలంగాణా రైతాంగం సాయుధమైంది.

ఇటు రాజకీయచైతన్యం యీ పూర్వరంగానికొచ్చేనాటికి అటు 1943లో బొంబాయిలోజరిగిన అఖిలభారత అభ్యుదయ రచయితలసంఘ మహాసభలకి ప్రతి

నిధులుగా వచ్చిన డా॥ రాజారావు, కె. ఎ. అబ్బాస్, అనిల్‌డిసెల్వా, లాంటి ప్రముఖుల ఆలోచనల్నించి, ఇండియన్ పీపుల్స్ థియేటర్ (I. P. T. A.) ఏర్పాటయింది. అప్పటివరకూ రైతుకూలీ యువజన సంఘాలతో సాగుతున్న కళాకారులంతా, దేశవ్యాపితంగా యీ కేంద్రీకృత సంస్థలోకి వచ్చారు. దానికి ఆంధ్రశాఖగా, ఆంధ్ర ప్రజా నాట్యమండలి ఏర్పడింది. చివరిదాకా, దానికి ప్రధాన కార్యదర్శిగావున్న డా॥ రాజారావుగారు ప్రయోక్తగా రాష్ట్రదళం- కోడూరి అచ్చయ్యగారు ప్రయోక్తగా (కృష్ణా)జిల్లా దళం, ఏర్పడ్డాయి. వీరికృషినుంచి, పూరికోదళం పుట్టివుంది, తెలంగాణా రైతాంగం సాయుధం అయ్యేనాటికి.

ఈ రాజకీయ, సాంస్కృతిక నిర్మాణరంగం నుంచి పుట్టాయి తెలంగాణా పోరాట నాటకాలూ, నాటికలూ, ప్రజల పాటలూ, కవితలూ ముమ్మరంగా వచ్చాయి. ఆ తర్వాత కథలూ, నవలలూ- కథలు 5 సంపుటాలుగా వెలువడ్డాయి. పోరాట చైతన్యంతో ప్రజల్ని ఉర్రూతలూగించినవి 'బుర్రకథలు'. అవి అరు ప్రచురితమయ్యాయి. ఇంత ముమ్మరంగా కాకపోయినా ఇదే వేగంతో వచ్చినవే జానపద దృశ్యరూపకాలూ- నాటకాలూ, నాటికలూ. ఇవి పత్రికల్లోనూ విడివిడిగానూ, ప్రచురితమయ్యాయి. ప్రదర్శన లివ్వాయిగానీ, సంపుటాలుగా యిప్పటిదాకా రాలేదు.

నాటకాలూ, నాటికలు గురించి చెప్పుకుంటూ ఈ వివరం ఎందుకిచ్చానంటే సాహిత్య కళాప్రక్రియల్లో అత్యంత క్లిష్టమైన నాటకాలూ, నాటికలు అంతవేగంగా రాకపోవడానికి, ఆర్థిక పెట్టుబడుల బరువు- ప్రభుత్వ నిర్బంధాలూ ప్రధానకారణంగా కన్పిస్తున్నాయి. ఈ వాస్తవాన్ని భావి ప్రజాకళారూపాల నిర్మాణానికి బాధ్యతవహించే కళాకారులు గుర్తించవల్సివుంది.

తెలంగాణా రైతాంగం సాయుధం కాకముందు జాతియపోరాటంలో భాగంగా, ఆంధ్రలో సాగిన రైతాంగ కదలికకి అద్దంపట్టిన, సుంకర, వాసిరెడ్డిగార్ల 'ముందడుగు' చెప్పుకోవాలి సాయుధ పోరాటానికి సాక్ష్యంగా అదే రచయితలు వ్రాసిన 'మాభూమి' అన్ని విధాలా ఆ ఉద్యమానికి దర్పణం. ఆ తర్వాత ఆ పోరాటం అణచబడి, ఆ చైతన్యం చల్లబడ్డాక వాసిరెడ్డిగారు వ్రాసిన "పోతుగడ్డ" లెక్కతెమ్తుంది. చాలాకాలం జరిగిపోయాక పుట్టింది సుంకరగారు వ్రాసిన 'గెరిల్లా'. ఇక వచ్చిన 12 నాటికలూ, పోరాటంలో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో సంబంధం వున్నవారు రాసినవే. వాటిలో పోరాటప్రాంతంలో పుట్టినవి కొన్ని, దానికి ప్రతిస్పందిస్తూ ఆంధ్రప్రాంతంలో పుట్టినవి కొన్ని, ఈ పోరాటంవల్ల జాగృతం అవుతున్న, ఆంధ్ర ప్రాంతపు రైతాంగ జాగృతిని చిత్రించినవి యింకొన్ని.

పోరాటరంగంలో పుట్టినవి పొట్లపల్లి రామా రావుగారి 'పగ' "న్యాయం" 'సర్బరాహి'. ఈ మూడూ తెలంగాణా పోరాటజీవితాన్ని, దానిసజీవ మాండలిక భాషలో చిత్రించినవి. మెలోడ్రామాకి చోటివ్వకుండా అతిసహజంగా సాగినవి.

పట్వారీ యిచ్చిన ఆచూకీద్వారా పోలీసులకి నరసింహ రావు పట్టుబడ్డం- చిత్రహింసలకు గురికావడం- చివరికి వాళ్ళకళ్ళుకప్పి తప్పించుకోవడం 'పగ' యితివృత్తం- అధికారుల దౌర్జన్యాన్ని, పీడనని చిత్రించినది 'న్యాయం'. దొర దౌర్జన్యాలను ప్రత్యక్షంగా ప్రతిఘటించలేక మాయోపాయంగా తెగించి ఎదిరించిన స్త్రీ జీవితం 'సర్బరాహి'. ఈమూడు ప్రదర్శించిన దాఖలాలు కనబడ్డంలేదు.

పరిస్థితుల పీడననుంచి జాగృతం అవుతున్న తెలంగాణా పోరాట జీవితంలోని కొన్ని కోణాల్ని ఈమూడూ చిత్రించాయి. వాటి తర్వాత ఆ పోరాటాన్ని చిత్రిస్తూ ఆంధ్రప్రాంతంలో పుట్టినవి- తనతోసహా బంధించబడిన సంగం నాయకుల్ని తప్పించాలని, ప్రాణంపోయే పరిస్థితుల్లోకూడా, సమయస్ఫూర్తిగా వ్యవహరించి, తప్పించడంలో 'వీరమరణం' పొందిన స్త్రీ జీవితమే డా॥ రాజారావుగారు రచించిన 'వీరనారి' యితివృత్తం." మెలకువతోకూడిన నైపుణ్యంతో సాగిన, నాటకీయితగల యీ నాటికని, ఆనాటి 'ప్రజానాట్యమండలి' దళాలు ఎక్కువగా ప్రదర్శించాయి. "గెరిల్లాల ప్రతిఘటనలూ- ఆత్మత్యాగాలూ- వీరత్వాలూ, పోరాటంలో స్త్రీల చొరవా తెగింపూ- ప్రధానంగా సాగిన నాటిక సుంకరగారు వ్రాసిన 'వీరకుంకుమ'", "మాచినేని వెంకటేశ్వరరావుగారి 'గెరిల్లా' ప్రతి లభ్యంకాలేదు. భారతీయ భాషల్లోకి అనువదింపబడినట్టు తెలుస్తున్నది.

ఇక తెలంగాణా ప్రాంతాన్ని సమర్థిస్తున్న ఆంధ్రప్రాంతంలోని పరిస్థితులను అద్దంపట్టినవి 'సుంకరగారి' "కాంగ్రెసా ? అంగ్రెజా ?", మహీధర రామ్మోహన రావుగారి 'శాంతి రక్షణకోసం', "రిపబ్లిక్ వెలిసింది". 1961 లో వచ్చిన గొల్లపూడి నారాయణరావుగారి 'అరికట్ట' నాటిక కన్పిస్తోంది. అదిగాక ఆ పోరాటాన్ని సమర్థించే కమ్యూనిస్టు ఉద్యమాన్ని వక్రీకరిస్తున్న కాంగ్రెస్ వర్గస్వభావాన్నీ, పాలకవర్గాల కుతంత్రాల్నీ' పట్టించే మొదటి మూడు నాటికల్లోనూ, దృశ్యంతో విశ్లేషించే నైపుణ్యం కనిపిస్తూంది.

తెలంగాణా పోరాట చైతన్యం నుంచి, ఆంధ్రప్రాంతాల రైతాంగం ఎలా జాగృతం అవుతుందో చూపేనాటిక 'జీతగాడు' ముగింపు కూడా అంతశక్తివంతంగానూ వుంటుంది.

వ్యవసాయకూలీల శ్రమదోపిడీ ఎన్నిరకాల సాగుతుందో విశ్లేషాత్మకంగా చెప్పిన నాటిక, ఇది భూస్వామి గోపాలరావు యింటిముందు, తలసావిడిలో ప్రారంభ

మవుతుంది. మల్లయ్యనే జీతగాడు అప్పుకొస్తాడు. అప్పుఅడక్కుండానే కట్టెలుకొట్ట మంటాడు. తెరవెనుక మల్లయ్య శ్రమ విన్పిస్తుండగా తాగుబోతు కూలిమేస్త్రి గురవయ్యని మచ్చిక చేసుకుంటాడు. ఈ భూస్వామి, అధికారీలు ఆఊరి రైతాంగకూలీల్ని శ్రమని ఎలా దోచుకుంటున్నారో బయటపడ్డం ఇంకో జీతగాడు కోటయ్య కూలిసంగం నాయకుడు రంగదాసు- చిన్నరైతు అప్పయ్య వస్తారు- వారందర్నీ కాలికింద చెప్పులుగా వాడెలా చేసుకున్నది బయట పడ్డంతో చివరకి ఘటన అదుపు తప్పుతుంది.

కోటయ్య :- అందాకవస్తే అప్పుడే తేల్చుకుంటా చావో బ్రతుకో-

గోపాల :- (మండిపడుతూ) పక్కలు విరగతన్నారా గురవాయి ఈ గాడిద కొడుకుని- వీడమ్మ మొగుడు ఎవడడ్డం వస్తాడో చూస్తాను.

గురవయ్య :- ఎంతమందిని చంపుతాఁరా (అంటూ కోటయ్య పైకివెళ్ళిపోతాడు)

కోటయ్య :- (కర్రిసవరించుకుంటూ) రారా, తాగుబోతు గాడిదకొడకా!

రంగదాసు :- (గురవయ్య వైపుతిరిగి) ఖబర్దార్!

గోపాల :- (అప్పయ్య నుద్దేశించి) అట్లాచూస్తావేమయ్య- రైతుపుట్టక పుట్టావా నువ్వు-?

అప్పయ్య :- ఇట్లాగే మొదట్నించి ఘాకొంపలు తీసింది. ఇంకా ఎన్నాళ్ళు, జుట్లు జుట్లు ముడిపెడతావ్-?

రంగ :- ప్రజలు కళ్ళుతెరిచారు. మీయిష్టం వచ్చినట్లు చిందులు తొక్కేరోజులు గతించాయి.

కోటయ్య :- తుమ్మితే ఊడిపోయె ముక్కు ఎన్నాళ్ళదాకా వుంటుంది. అప్పయ్య గారూ రండిపోదాం,

అప్పయ్య :- ఈదెబ్బతో తాడో పేడో తేల్చుకుందాం. పదపోదాం.

(రంగదాసు ముందు నడుస్తుంటాడు. అప్పయ్య. కోటయ్య చెయ్య చెయ్య పట్టుకొని అతన్ని అనుసరిస్తారు. అందరికంటె వెనుక మల్లయ్య నడుస్తుంటాడు).

గోపాల :- అరే ఎల్లాయ్! ('నీకు సలాంబాబూ' అన్నట్టుగా వంగి దణ్ణం పెట్టి వెళ్ళిపోతాడు) పొండి గాడిద కొడుకుల్లారా! (అని వెర్రి వాళ్ళా అటూ యిటూ తిరుగుతుంటాడు- గురవయ్య తెల్లబోయి అతనివంక చూస్తుంటాడు) తెర-

నాటకాల గురించి చర్చించేముందు చిన్నవిషయం గుర్తుచేసుకోవల్సివుంది. పొట్లపల్లి రామారావుగారి తర్వాత, పోరాటరంగం నుంచి కృషిచేసిన తిరునగరి

రామాంజనేయులుగారి 'వెట్టిచాకిరి' నాటిక ఒకటుంది. అది లభ్యంకాక చర్చించలేదు. ఇదిగాకవీరు 'బైరాగులపాట'నే ప్రదర్శన తయారుచేసినట్టు, 'మాభూమి' పక్కిలో 'వీరతెలంగాణా' రాసినట్టు తెలుస్తోంది. పోరాటం రోజుల్లోనే దాన్ని మునగాలలో ప్రదర్శించినట్టుకూడా తెలుస్తోంది. 'వీరకుంకుమ' అన్న నాటకం, 'పటేల్ పెహ్రాల మీద' వీధిభాగవతం కూడా రాసినట్టు తెలుస్తోంది. భావివిమర్శకులు వీరినాటకాల్ని సంపాదించి సమీక్షించాల్సి వుంది.

ఇక నాటకాలు- కొమరయ్య మరణంనుంచి చెలరేగిన జనచైతన్యం- బందగీ పోరాటలక్ష్యాన్ని వారసత్వంగాతీసుకుని, పోరాటాన్ని ప్రారంభించింది మొదలు వాని ధాటికాగలేక దొరలు గడీని విడిచి పోయేదాకా సాగిన పోరాట యితివృత్తాన్ని చిత్రించింది 'మాభూమి' నాటకం.

ఇందులో తెలంగాణా పోరాటం చోటుచేసుకున్నంతగా, తెలంగాణా గ్రామీణ జీవనం, ఆ జీవ మాండలీకం చోటుచేసుకోలేదు. తెలంగాణా వాతావరణం చూచాయగా కనిపిస్తూ, వినిపిస్తుంది. సంభాషణల భాషా నుడికారాలు ఆంధ్రప్రాంతానికే ప్రాతినిధ్యం వహిస్తాయి. పోరాటచైతన్యాన్ని దేశవ్యాపితంగా ప్రజానాట్యమండలి దళాల ద్వారా ప్రచారంచేసిన ఈ నాటకంలో సృజనాత్మకమైన ఈ లోటు లోటుగానే కన్పిస్తుంది. అయినా అప్పటి అగత్యాన్ని నెరవేర్చిన నాటకంగా దానివిశిష్టత దానికుంది. ప్రజల్లో ప్రముఖమైన సంచలనాన్ని సృష్టిస్తూ వీరవిహారంచేసిన ఈ నాటకాన్ని చూసి కన్నీరుకార్చిన మంత్రులు (బెజవాడ గోపాలరెడ్డి- కళా వెంకట్రావు). దాన్ని వెంటనే నిషేధించడం, పాలకవర్గాలని భయపెట్టేంతగా వర్గ (పోరాట) స్వభావాన్ని నింపుకున్న ఆ నాటకానికొచ్చిన నజరానాయే అవుతుంది. "దున్నేవానిదే భూమి" అనే వాస్తవాంశాన్ని ప్రథమాశయంగా దేశంలోప్రచారంచేసి, వారిని ఐక్యంచేయగల్గిన నాటకం, భారత నాటకచరిత్రలోనే పుట్టలేదనడం అతిశయోక్తికాదు. సృజనాత్మక ప్రక్రియగా ఈ నాటకం విషయంలో ఆత్మవిమర్శకూడా అవసరమే- అప్పుడు అభ్యుదయ రచయిత 'అవిసెట్టి' సూచనల్ని పరిగణలోకి తీసుకోవాలని నా ఉద్దేశం. "వీనర్స్" అనే ఉత్తమ జర్మన్ నాటకం ఇది చదువుతున్నప్పుడల్లా నాకు జ్ఞాపకానికొస్తుంది- ఇతివృత్తానికి ఏకాగ్రత కల్గించడంలోనూ, ముఖ్యపాత్రలకు పరిపూర్ణత నివ్వడంలోనూ శ్రద్ధచూపితే ఈ నాటకం ఆంధ్రసాహిత్యంలో శాశ్వతస్థానం సంపాదించుకునేది".

ఈ క్రమంలో పోరాటం అణచివేయబడ్డాక ఆ చైతన్యం పూర్వరంగంగా 1953లో వచ్చింది. వాసిరెడ్డి భాస్కరరావుగారి "పోతుగడ్డ" పోరాటకాలంనాటి చైతన్యం తెరవెనక్కివెళ్ళి, దానిలో భాగమైనపాత్రలు- సంఘాల్ని సమర్థించేవి,

వ్యతిరేకించేవి- వేసుకున్న చదరంగపు ఎత్తులూ, ఘటనలూ, ఘర్షణలూముందుకొచ్చి కనిపిస్తాయి ఈ నాటకంలో. నాటకంలో సహజత్వం మెలోడ్రామాకి లోనవుతున్న సూచనలు కన్పిస్తాయి.

తర్వాత 1973లో సుంకరగారు రాసిన 'గెరిల్లా' పోరాట విరమణకాలంలో 'గెరిల్లా' ల జీవితాన్ని చిత్రించింది- అంతటి పోరాటానుభవమున్న రచయితను కూడా సామ్రాజ్యవాద సంస్కృతి కృత్రిమత్వం తన భల్లూకపుపట్టులోకి ఎలా బిగించుకుంటుందో సాక్ష్యంపలుకుతుంది దీనిరచనా నిర్మాణశిల్పం.

ముఖ్యమైన ఈ నాటకాలలో ఆ పోరాటచైతన్యాన్ని చిత్రించడం వెనక ముఖం పట్టిందిగాని, ఆ పోరాటానికి మూలమైన రైతాంగాన్ని, కార్మికవర్గాన్ని, తట్టిలేపే నాటకాలూ, నాటికలూ ముమ్మరంగానే దేశవ్యాపితంగా పుట్టాయి. తెలంగాణ పోరాటాన్ని సమర్థించి మార్గదర్శకత్వం వహించిన కమ్యూనిస్టు ఉద్యమంలో ఒకరై, 1948 నుంచి 1951 దాకా జైల్లోగడిపిన శ్రీ శీల్ పృధ్వీరాజ్ కపూర్ కి రాసిచ్చిన 'రైతు' నాటకం ఒకటి. అలానే ప్రజాచిత్రకారుడుగా తన జీవితాన్ని అంకితం చేసిన 'చిత్తప్రసాద్' నాటకాలూ, నాటికలూ రాసినట్టు తెలుస్తోంది. వాటినీ సంపాదించి పరిశీలించాలిమరి. సమిష్టి సాంఘిక చైతన్యాన్ని వికృతంగా చిత్రించినవి. వ్యక్తిగత హీరోయిజంని వెర్రితలలు వేయించినవి, 1957 నుంచి 67 దాకా వచ్చిన పరిషత్ నాటకాల్లో, చాలా దొరుకుతాయి. ఏ దౌర్భాగ్యానికి సృజనాత్మక కళాకారులు దూరంగా వుండాలో గుర్తుచేస్తూ, పోరాటానికి దూరం, దగ్గరా అన్నది కేవలం భౌతిక విషయంకాదని రుజువుచేస్తూ, ఈమధ్య కలకత్తాలో "తెలంగాణా" అన్న ప్రయోగం అతిశక్తివంతంగా జరిగిందని చూసిన మిత్రులు చెబుతున్నారు. దాన్ని ప్రదర్శించినది 'లైమ్‌లైట్' బృందం వారు- అదీ పరిశీలించాల్సిందే.

తెలంగాణపోరాట నాటకాలు నాటికలపై పరిశోధన చేసేవారు వెలుగులోకొచ్చిన వాటిని ప్రధానంగా తీసుకునిచేస్తేనే- ఆ పోరాట ఉద్యమ చైతన్యం అందించిన నిఖార్సయిన నేలచూపుని దాని విరమణానంతరం వచ్చిన రచనల్లో ఎలా పక్కదారి పట్టించారో బేరీజువేసి చూపిస్తే, భావి కళాకారులకి సృజనాత్మకంగా కృషి తేలికవుతుందేమో ఆలోచించాలి. అప్పుడు జరిగిన పోరాటానుభవాలు యిప్పుడు బహుముఖాలుగా బయటికొస్తున్నాయి గనుక, అనుభవం, ప్రావీణ్యంవున్న రచయితలూ, ప్రయోక్తలూ తలుచుకుంటే- ఓనాటి సామాజిక సంస్కరణకీ, జీవితవైపరీత్యాలకీ, చారిత్రక పత్రంగా నిలిచే 'కన్యాశుల్కం' వచ్చినట్లు- ఈ పోరాట చైతన్యానికీ, పాలకవర్గాల వైపరీత్యానికీ, చారిత్రక పత్రంగా నిలిచే నాటకమూ వస్తుంది. అప్రస్తుతమో, ప్రస్తుతమో అది నా ఆశ, ఆకాంక్ష.

# ప్రజా రాజకీయ నవలలు

వరవరరావు

భారతదేశంలోనే అపూర్వమైన రైతాంగపోరాటం 1946 నుంచి 1951 వరకు తెలంగాణలో సాగింది. ఈ పోరాటానికి 1930లో ఏర్పడిన ఆంధ్రమహాసభ పూర్వ రంగాన్ని సిద్ధంచేసింది.

సంస్కరణోద్యమంగా ప్రారంభమైన ఈ ఉద్యమం ఇరవయ్యో శతాబ్దపు నాలుగోదశాబ్దంలో క్రమంగా సామాజికమౌలిక సమస్యలు ప్రాతిపదికగా రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక పోరాటంగా అభివృద్ధి చెందింది.

అంతర్జాతీయంగా రెండోప్రపంచయుద్ధంలో ఫాసిస్టుశక్తుల ఓటమి, సోషలిస్టు ప్రజాస్వామ్యశక్తుల విజయం ప్రపంచవ్యాప్తంగా సామ్రాజ్యవాదానికి, వలసవిధానానికి వ్యతిరేకంగానేకాక అన్నిరకాల అణచివేతలకూ వ్యతిరేకంగా తలెత్తిన ప్రజా పోరాటాలకు గొప్పఊపునిచ్చింది. తెలుగు భాషాసంస్కృతుల పరిరక్షణ, గ్రంథాల యోద్యమం వంటి సాంస్కృతిక ఆకాంక్షతో ప్రారంభమైన ఆంధ్రమహాసభ వెట్టి వంటి సాంఘిక దురాచారాల వ్యతిరేక ఆందోళనస్థాయికి ఎదిగి, రానురాను జమీందారీ, జాగీర్దారీ వ్యవస్థరద్దుకావాలని, ఫ్యూడల్‌రాచరికానికి చిహ్నమైన నిజాం గద్దెదిగాలని రాజకీయవినాదం తీసుకున్నది.

1944-45ల నాటికి ఆంధ్రమహాసభలోని కమ్యూనిస్టుపార్టీ ఈ ఉద్యమానికి నాయకత్వం వహించే స్థితికివచ్చి గ్రామీణప్రాంతాల్లో అశేషప్రజానీకం ఎదుర్కొం టున్న సమస్యలు. ఆ సమస్యలన్నిటికీ మూలకారణమైన భూసంబంధాల విషయంలో తీవ్రమైనఆందోళనను, ఉద్యమాన్ని చేపట్టింది. 1946 నాటికి కౌల్దారీవిధానంరద్దయి దున్నేవానికే భూమిదక్కాలనే నినాదం రాజకీయస్వభావంతో ప్రభావితమయింది. ఈ ఫ్యూడల్ జమీందారీ జాగీర్దారీ విధానాన్ని కాపాడుతున్న రాజ్యాంగ యంత్రాన్ని కూల్చందే రైతాంగానికి విముక్తి లేదని చైతన్యవంతమైన ప్రజలు సాయుధపోరాటం చేపట్టారు.

కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంలో 1946 నుంచి 1951 వరకు ఐదు సంవత్సరాల పాటు సాగిన పోరాటకాలంలో ఇదివరకెన్నడూ లేనంతగా, ఏ ఉద్యమ కాలంలోకూడా లేనంతగా సాహిత్య సాంస్కృతిక సంచలనం ప్రజా జీవితాన్ని ప్రభావితం చేసింది. తెలుగుదేశంలో మరుగునపడిపోతున్న, పోయిన ప్రజాకళారూపాలను వెలికితీసి ఆ అన్నింటిని విప్లవోద్యమ ప్రయోజనాలకు విరివిగా వినియోగించుకోవడం జరిగింది.

సుద్దాల హనుమంతు, యాదగిరి, తిరునగరి రామాంజనేయులు, నాజర్ వంటి ప్రజాకవులు, కళాకారులు వందల, వేలసంఖ్యలో పాటలు, కళారూపాలు సృష్టించారు. సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావు ఎన్నో నాటకాలు, నాటికలు, బుర్ర కథలు రచించారు. వాటిలో ముఖ్యంగా పేర్కొనదగినవి 'మాభూమి', 'ముందడుగు', 'వీరకుంకుమ' వంటి నాటకాలు.

జాతీయభావాలుగల కాళోజి, దాశరధి వంటి కవులు 'నాగొడవ', 'అగ్నిధార', 'రుద్రవీణ' వంటి కావ్యాలు రాసారు. ఇవి నిజాం రాచరికాన్ని జమీందారీ, జాగీర్దారీ వ్యవస్థను వ్యతిరేకించిన కావ్యాలు.

ఆంధ్రప్రాంతంలోవున్న సోమసుందర్ 'వజ్రాయుధం', గంగినేని 'ఉదయిని' కుందుర్తి 'తెలంగాణ', ఆరుద్ర 'త్వమేవాహమ్' అనే కావ్యాలు రచించారు.

ఈ నాలుగు కావ్యాలు కూడా తెలంగాణ గ్రామాల్లో "సంగం" పేరుతో కమ్యూనిస్టుపార్టీ నిర్వహించిన రైతాంగ పోరాటాన్ని బలపరిచినవే. వీనిలో 'వజ్రాయుధం' దొడ్డి కొమురయ్య వంటి మృతవీరుని సంస్మరణ కూడా చేసింది. నిజాం రాష్ట్రంలో నిషేధింపబడ్డది. కాని ఈ కవులందరూ నిజాం రాష్ట్రంలో యూనియన్ మిలిటరీ పోలీసుల ప్రవేశాన్ని హర్షించారు.

గంగినేని వెంకటేశ్వరరావు తెలంగాణ పోరాట వాస్తవగాథలను కల్పనకు జోడించి "ఎర్రజండాలు" అనే పేరుతో మూడు సంపుటాలుగా రచించాడు. అవి కూడ ఆకాలంలో నిజాం ప్రభుత్వంచే నిషేధింపబడినయి. వట్టికోట ఆళ్వారుస్వామి పొట్లపల్లి రామారావు, సి. వి. కృష్ణారావు, కాళోజీ మొదలైనవారు ఈ పోరాటానికి సంబంధించి కొన్ని కథలు రాశారు.

ప్రజాకళారూపాల తరువాత, "మాభూమి" వంటి నాటకాల తరువాత, తెలుగు సాహిత్యమే గర్వించదగిన నవలాసాహిత్యాన్ని తెలంగాణ రైతాంగ పోరాటం సృష్టించింది. కావ్యాలకన్నా ఎక్కువగా తెలంగాణ రైతాంగ ఉద్యమాన్ని చిత్రించిన నవలలు వెలువడినయి. అయితే వీనిలో పోరాటం సాగుతూఉండగానే 1947 లో వెలువడిన తొలినవల బొల్లిముంత శివరామకృష్ణగారు రచించిన "మృత్యుంజయులు" అలాగే కమ్యూనిస్టుపార్టీ ఇంకా సాయుధపోరాట విరమణ చేయకపూర్వం నిజాం రాష్ట్రంలో యూనియన్ మిలిటరీ పోలీసులు ప్రవేశించిన తరువాత కూడా కొనసాగుతున్న పోరాటకాలంలో అంటే 1950లో రచింపబడిన నవల లక్ష్మీకాంతమోహన్ గారి "సింహగర్జన".

వట్టికోట ఆళ్వారు స్వామిగారి "ప్రజలమనిషి" 1935-40 ల మధ్య కాలంనాటి తెలంగాణ పరిస్థితులను వివరిస్తుంది. 1946-53 మధ్యకాలంలో మూడు సంవత్సరాలకుపైగా దీర్ఘకాలం జైళ్ళలో ఉన్నకాలంలో ప్రారంభించి 1952 నాటికి పూర్తిచేసిన ఈ నవల 1955 జనవరిలో వెలువడింది. 1940-45 మధ్యకాలపు తెలంగాణ రాజకీయ ప్రజాఉద్యమాలను చిత్రించిన "గంగు" 1961 ఫిబ్రవరిలో ఆళ్వారుస్వామిగారు మరణించేనాటికి అసంపూర్తిగానే ఉండి 1955 జనవరిలో అట్లాగే వెలువడింది.

1947 నాటి తెలంగాణ గురించి మహీధర రామమోహనరావుగారు రచించిన 'ఓనమాలు' 1956 మార్చిలో వెలువడింది. వెనువెంటనే విశాలాంధ్రపత్రికలో సీరియల్‌గా 'దవానలం' పేరుతోవెలువడిన 'మృత్యువునీడల్లో' 1962లో పుస్తకరూపంలో వచ్చింది.

అంటే 'మృత్యుంజయులు' "సింహగర్జన"తప్ప తక్కిన నవలలన్నీ 1951-60 మధ్యకాలంలో రచింపబడినవే. అట్లే "సింహగర్జన"తప్ప తక్కిన అన్నినవలల్లో కూడా కథాకాలం 1947కు పూర్వందే. ప్రధానమైన నవలలు ఉద్యమవిరమణ తర్వాత ఉద్యమంలో పనిజేసిన రచయితలచే కళారూపంలో రికార్డుచేయబడిన స్పందనలనవచ్చు.

తెలంగాణ ప్రజాపోరాటాలపై వచ్చిన పైనపేర్కొన్ననాలుగు కావ్యాలతో పోలిస్తే ఈనవలలన్నికూడ చాలవిశిష్టమైనవి. ఇవన్నీ ఉద్యమవిరమణతర్వాత రచింపబడినప్పటికీ ఆ ఉద్యమ స్వభావాన్ని, ఆశయాన్ని ఉజ్వలంగా చిత్రించినవి. ఆధునిక కాలంలో నవల సహజంగానే సమాజజీవితాన్ని ప్రతిబింబించడానికి అనువైన సమర్థమైన పనిముట్టు. తెలుగు నవలాసాహిత్యంలో ఉద్యమనవలలది ఉజ్వలమైనస్థానం. అటువంటి ఉద్యమనవలల్లో జాతీయోద్యమకాలపు "మాలపల్లి" తర్వాత పేర్కొనదగిన నవలలన్నీ తెలంగాణా విమోచనోద్యమానికి సంబంధించినవే. తెలుగు ప్రజల జీవితాన్ని, తెలుగుదేశపరిస్థితులను సమగ్రంగా. సజీవంగా చిత్రించినవి మాత్రమే కాదు, తెలుగుప్రజలు మౌలికమైన మార్పుకొరకుచేసిన మహత్తరమైన పోరాటం ప్రతిఫలించినవి ఈ నవలలు.

ఈ అపూర్వమైన అవకాశాన్ని ఈ రచయితలకిచ్చింది తెలంగాణ విమోచనోద్యమం. తెలంగాణ రైతాంగ పోరాటం తర్వాతకాలంలో దేశవ్యాప్తంగా అశేష ప్రజానీకం అనుసరించదగిన ఉజ్వల వారసత్వంగా సాహిత్యంలో పదిలపరచిన ఘనతమాత్రం ఈ నవలా రచయితలది. ఆయా ప్రజాకళారూపాలను సమర్థవంతంగా రచించిన రతయితలది, కళాకారులది అనిచెప్పాలి.

1949 నుంచే సాయుధపోరాట నిర్వహణ, విరమణ విషయంలో కమ్యూనిస్టు పార్టీలో తీవ్రమైన చర్చలుసాగి విభేదాలు పొడసూపాయి. 1962 దాకా ఆ విభేదాలు

దాదాపుగా బహిరంగంగా వ్యక్తమవుతూనే పార్టీమాత్రం ఒక్కటిగానే కొనసాగింది. ఈ మధ్యకాలంలో 1956 లో రష్యాలో జరిగిన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20వ కాంగ్రెస్‌లో అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం రెండుగా చీలిపోయింది.

1962 లో భారత - చైనాయుద్ధం భారత కమ్యూనిస్టుపార్టీలోని ఈ చీలికకు ఒకసాకును కల్పించింది. 1964 లో భారత కమ్యూనిస్టుపార్టీ రెండుగా చీలిపోయింది. తెలంగాణ రైతాంగ సాయుధపోరాట విరమణ నిర్వహణ, వాదాలుచేసినవారు సిపిఐగా సిపిఐ(యం)గా విడిపోయినారు. 1948 సెప్టెంబర్‌లో యూనియన్ పోలీసులు, మిలిటరీ ప్రవేశించిన తరువాత సాయుధపోరాట విరమణచేసి ఉండాల్సిందనేవారు ఎక్కువ సంఖ్యలో సిపిఐ లోకి, 1951 దాకా సాయుధపోరాటం కొనసాగింపును (రాజ్యాధికారాన్ని సాధించడానికికాదు పోరాట విజయాలు కాపాడుకోవడానికి మాత్రమే) సమర్థించిన వారిలో ఎక్కువ సంఖ్య సిపిఐ(ఎం) లోకి వెళ్ళిపోయినారు.

1967 లో నక్సల్బరీలో మార్క్సిస్టుపార్టీలోని తిరుగుబాటు వర్గం నాయకత్వంలో సంతాల్ రైతాంగం అక్కడి జోతేదార్లకు వ్యతిరేకంగా సాయుధ ప్రతిఘటన ప్రారంభించింది. అప్పటి నుంచి భారతరైతాంగ ఉద్యమంలో నక్సల్బరీ పోరాటం ప్రారంభమైంది.

ఐతే 1951 లో కూడా సాయుధపోరాటం విరమించి ఉండాల్సింది కాదు దానిని దీర్ఘకాలిక జాతీయ విముక్తి పోరాటంగా కొనసాగించి ఉండాల్సింది అనేవాళ్ళు సిపిఐ (ఎం) నుంచి కూడా విడిపోయి 1967 లో నక్సల్బరీ ఉద్యమంవైపు వచ్చారు.

1957 ఎన్నికల్లో కేరళలో కమ్యూనిస్టుపార్టీ అధికారానికి వచ్చినప్పటినుంచి నక్సల్బరీ రైతాంగపోరాటందాకా ఒకదశాబ్దకాలం తెలంగాణ విమోచనోద్యమంపై కమ్యూనిస్టుపార్టీల్లో చర్చసన్నగిల్లింది.

దాదాపుగా ఒక దశాబ్దకాలం ముఖ్యంగా 1960 నుంచి 67 వరకు తెలంగాణ రైతాంగపోరాటంపై సృజనాత్మక సాహిత్యంకూడా వెలువడలేదు రచనాకాలాన్నిబట్టి చూస్తే 1956 నుంచే తెలంగాణ రైతాంగపోరాటంపై సాహిత్యం వెలువడలేదు.

1956 రష్యా కమ్యూనిస్టుపార్టీ ఇరవయవమహాసభ, 1957 కేరళ ఎన్నికల విజయం భారత కమ్యూనిస్టుపార్టీ దృష్టిని పూర్తిగా పార్లమెంటరీ పంథావైపుకు మళ్ళించడంతో తెలంగాణ విమోచనోద్యమం విస్మృతిపథంలో పడిపోయింది.

నక్సల్బరీతో భూసంస్కరణలు, రాజ్యాంగయంత్రస్వభావం రాజ్యాధికారానికి రావడానికి సాయుధపోరాట ఆవశ్యకత అనే అంశాలపై మార్క్సిస్టుశ్రేణుల్లో వచ్చిన సైద్ధాంతిక విభేదాలు తెలంగాణ విమోచనోద్యమాన్ని మళ్ళీ చర్చల్లోకితెచ్చినవి.

దానితో మళ్ళీ తెలంగాణ విమోచనోద్యమంపై, ఆనాటి సాహిత్యంపైకూడా వివిధకోణాలనుంచి పరిశీలనలు, అధ్యయనం ప్రారంభమైనవి. రాజకీయసిద్ధాంత రంగంలో 1972లో భారతకమ్యూనిస్టుపార్టీ తెలంగాణ సాయుధ రైతాంగపోరాట రజతోత్సవాలు జరిపింది. సందర్భంలోనూ, ఆఅదేకాలంలోనూ రావినారాయణరెడ్డి, చంద్ర రాజేశ్వరరావు, సి ఎచ్ రాజేశ్వరరావు, రాజబహదూర్ గౌడ్, మాకినేని బసవ పున్నయ్య, పుచ్చలపల్లి సుందరయ్యగారలు ఈనాటి తమవైఖరితో ఆనాటి పోరాటం గురించి గ్రంథాలురాశారు. మరొకవైపు నక్సల్బరీ పోరాటాన్ని తెలంగాణకో పరిచయం చేసేక్రమంలో 1968లో చండ్రపుల్లారెడ్డి, 1974లో దేవులపల్లి వెంకటేశ్వరరావు తెలంగాణ రైతాంగ సాయుధపోరాటంపై విప్లవకమ్యూనిస్టుల వైఖరిని వివరించారు. 1979 జూన్‌లో కొండపల్లి సీతారామయ్య, తెలంగాణ రైతాంగపోరాటాన్ని నిర్వహించిన కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం గురించి ఆ పోరాటంగురించి వారికున్న అవగాహనా పరిమితులను గురించి వివరించారు.

ఈ కాలంలోనే గొల్లపూడి నారాయణ(రావు)గారి 'తెలుగుగడ్డ' నవల తెలంగాణ ప్రజల జీవితమూ - పోరాటమూ వస్తువుగా దాశరథి రంగాచార్యగారి నవలలు కొన్ని వెలువడినవి. ఈ నవలలన్నీ కూడా వర్గసామరస్యాన్ని ప్రతిపాదించటానికి చేసిన ప్రయత్నాలే.

తెలంగాణ విమోచనోద్యమం అభ్యుదయ రచయితల సంఘం, ప్రజానాట్య మండలి వంటి సాహిత్య, సాంస్కృతిక సంస్థల పుట్టుకకుకారణమైనట్టుగానే నక్సల్బరీ శ్రీకాకుళాలు విప్లవ రచయితల సంఘం, జననాట్యమండలి వంటి సాహిత్య సాంస్కృతిక సంస్థల ఆవిర్భావానికి కారణమైనవి. తెలంగాణ పోరాటపాటలు సేకరించి విరసం రెండు భాగాలుగా ప్రచురించింది.

తెలంగాణ పోరాట సాహిత్యంపై పరిశోధనాభిలాష కూడ ఈ కాలంలోనే ప్రారంభమైంది. ఐతే ఈపరిశోధన చేయదలుచుకొన్న వారికి మాత్రం నలిగిన దారి లేదు. మనకు సాహిత్యాన్ని ఇతర భాషల ప్రభావాలతో ప్రాచ్యపాశ్చాత్య సాహిత్య సిద్ధాంతాల ప్రభావంతో తులనాత్మకంగా పరిశీలించి చర్చించే అలవాటు ఉన్నంతగా చరిత్రతో, సమాజ పరిణామాలతో వీటికి చోదకశక్తులైన ప్రజలు, వారి పోరాటాలతో - ఒక్కమాటలో ఉత్పత్తి శక్తులకు ఉత్పత్తి సంబంధాలకు మధ్యనున్న వైరుధ్యాలతో అన్వయించి పరిశీలించే శాస్త్రీయదృష్టి తక్కువ.

తెలంగాణ విమోచనోద్యమ నవలల గురించి ఈ నేపథ్యంలో ఇక్కడ పరిశీలిస్తాము.

తెలంగాణ విమోచనోద్యమంపై 1960 కి పూర్వం వచ్చిన నవలలన్నీ కమ్యూనిస్టుపార్టీ సభ్యులుగానో కమ్యూనిస్టుపార్టీ సానుభూతిపరులుగానో, సన్నిహితులుగానో ఉన్నవారు రచించినవే. తెలంగాణ విమోచనోద్యమానికి నాయకత్వం వహించింది కమ్యూనిస్టుపార్టీయే కావడంవల్ల ఈ ఉద్యమనవలలన్నీ ఆ పార్టీపాత్రనే ప్రముఖంగా చిత్రించడం సహజం.

పైనవివరించిన కారణాలవల్ల తెలంగాణ విమోచనోద్యమానికి న్యాయం కలిగించే అవకాశం ఉన్నంతలో ఎక్కువగా ఉన్న 1956 కు పూర్వం రచింపబడిన, వాటి కొనసాగింపేఅయి 1962 దాకా రచింపబడిన నవలలను మాత్రమే ఇక్కడ చర్చిస్తాను.

నిజాం నిరంకుశ పరిపాలనకు, జమీందారీ జాగీర్దారీ వ్యవస్థకు వ్యతిరేకంగా ప్రజలు చేపట్టినపోరాటాన్ని విమోచనోద్యమ దిశగా నడిపించింది కమ్యూనిస్టుపార్టీయే. అందువల్లనే యూనియన్ పోలీసు మిలిటరీ జోక్యం తరువాత కూడా ఈ విమోచనోద్యమం ముగిసినట్టుగా కమ్యూనిస్టుపార్టీ భావించలేదు. ఆ విషయమే మనం 'సింహగర్జన' నవలలో గమనించగలం. కాబట్టి తెలంగాణ విమోచనోద్యమాన్ని ప్రతిఫలించిన నవలలు ఇందులో పరిశీలించబడిన ఆరు మాత్రమే.

తెలంగాణ విమోచనోద్యమకాలంలో ఆ ప్రభావం అంతగాలేని ఆదిలాబాదు, కరీంనగర్ జిల్లాల్లో రైతాంగపోరాటమూ, పోరాటసాహిత్యమూ మూడు దశాబ్దాల క్రితం ఉద్యమాన్ని తలపించేరీతిలో ఈనాడు తలఎత్తాయి.

శ్రీకాకుళం, కరీంనగర్ పోరాటాలు, ఈ పోరాటాలు సృష్టించిన ప్రజల నూతన సాహితీ సంస్కృతుల ప్రభావము గమనించిన తరువాత తెలుగు సాహిత్యం మేరకే చూసినప్పటికీ ప్రజా ఉద్యమాల కాలంలో ఉత్తమసాహిత్యం వెలువడడానికి ఉన్న చారిత్రక, సాంస్కృతిక కారణాలు విశ్లేషించడానికి ఏదో ఒక ప్రక్రియను ఎంచుకొని ఐనా ప్రారంభం చేయడం మంచిదనే ప్రేరణయే ఈ పరిశీలనకు ప్రోద్బలం, సమాజంలోని గతిశీలాన్ని అన్ని ప్రక్రియలకన్నా సజీవంగా వైవిధ్యంతో ప్రతిబింబించగల నవలా ప్రక్రియను ఎంచుకోవడం సముచితంగా ఉండగలదని భావిస్తున్నాను.

2

ఈ ఆరునవలల్లోను కొన్ని సాధారణ లక్షణాలు కొన్ని ప్రత్యేక లక్షణాలు ఉన్నాయి. ఇవన్నీ తెలంగాణా ప్రజాజీవితాన్ని, అప్పటి ఫ్యూడల్ రాచరికవ్యవస్థను, ఆ వ్యవస్థకు వ్యతిరేకంగా ప్రజల పోరాటాన్ని చిత్రించిన నవలలు కావడంవల్ల చాలా అంశాల్లో పోలికలుండడం సహజమే.

ఎంచుకున్న వస్తువులోనే కాకుండా ఈ నలుగురు రచయితల దృక్పథంలోకూడా ఆయానవలల రచనాకాలంలో ఏకీభావం ఉన్నది. తెలంగాణాను, తెలంగాణా ప్రజా జీవితాన్ని, ప్రజలు ఎదుర్కొన్న సమస్యలను, వారుఆలోచించి అమలుచేసిన పరిష్కారాలను ఈ రచయితలందరూ ఒకే దృక్పథంతో పరిశీలించి మనముందుంచారు. విశ్లేషణలో, సూక్ష్మపరిశీలనలో మనం ఏకీభవించజాలని అంశాలుండవచ్చుగాని స్థూలంగా ఈ నలుగురు రచయితలదికూడా ఆనాటి ఆంధ్రమహాసభలో కమ్యూనిస్టు పార్టీలక్ష్యం.

'ప్రజలమనిషి'లో కంఠీరవాన్ని మినహాయిస్తే మిగతా ఐదునవలల్లోకూడా నాయకుడు, ఇతర ప్రధానపాత్రలు కమ్యూనిస్టులు. కంఠీరవం 1938లో స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహంలో చేరినప్పటికీ అప్పటికే అతనిది లౌకిక (సెక్యులర్) ప్రజా తంత్ర దృక్పథం. నిర్మాణరీత్యామాత్రమే అతడు కమ్యూనిస్టుకాదు. అయితే కంఠీరవంలో రూపొందుతున్న మార్క్సిస్టు ఉన్నాడు. ప్రజలమనిషి రచనాకాలంనాటికి వట్టికోట ఆళ్వారుస్వామిగారు కమ్యూనిస్టు పార్టీసభ్యుడు. 1938లో అతడు స్టేట్ కాంగ్రెస్, 1944 భువనగిరి ఆంధ్రమహాసభలో రావినారాయణరెడ్డి అధ్యక్షతన ఏర్పడిన ఆంధ్రమహాసభను సమర్థించిన కమ్యూనిస్టేతరులలో అతడొకడు. కాబట్టి వస్తుతహ ఆంధ్రమహాసభలోని అతివాదులను బలపరుస్తూ క్రమంగా కమ్యూనిస్టుపార్టీలోకి వచ్చినవాడు ఆళ్వారుస్వామి. 'ప్రజల మనిషి'లో స్టేట్ కాంగ్రెస్ కార్యకర్త అయిన కంఠీరవమే 'గంగు'లో కమ్యూనిస్టుగా పరిణతి చెందాడు, ఈ పరిణామానికి ప్రజా ఉద్యమ పునాదిఉంది. ఆళ్వారుస్వామిగారు తలపెట్టిన మూడునవలల్లో రెండవదయిన 'గంగు' ఆయనమరణంతో అసంపూర్తిగానే వుండిపోయింది 'గంగు'లో కథానాయకగా ప్రభవించి మూడవనవలలో ఎదగవలసిన 'గంగు' తెలంగాణ జానపద బాణీలలో ప్రజాపోరాటాలను కావ్యంగా పాడి ఆంధ్రమహాసభ ద్వారా ప్రజల నాకర్షించడం ప్రారంభమైంది. గ్రంథాలయోద్యమపు లిఖిత సంప్రదాయం నుంచి రైతాంగ పోరాటపు మౌఖిక సంప్రదాయానికి ప్రజాచైతన్యంతోపాటు పదనెక్కిన ఆంధ్ర మహాసభ పరిణతియే ఆళ్వారుస్వామిగారి నవలా పథకం,

ఈ రచయితలందరు ప్యూడలిజాన్ని, రాచరిక నిరంకుశత్వాన్ని, రాజవంశ పరిపాలనా ఫలితంగానో, పరమతప్రభు పరిపాలనా ఫలితంగానో మాత్రమే చూడ లేదు, దానిమూలమైన భూసంబంధాల పరిణామంగానే చూసారు. అందువల్లనే అసఫ్షాహి వంశపురాజు గద్దెదిగడంమాత్రమేకాదు జమిందారీ, జాగిర్దారీవిధానం రద్దయిపోయి "దున్నేవాడికేభూమి" దక్కాలనే ఆకాంక్ష, అందుకోసం ప్రజలుచేసిన పోరా

టాలు అన్నినవల్లోను వ్యక్తమయ్యాయి. వెట్టి, దండుగలు, దొరలదేశ్‌ముఖ్‌ల జాగి ర్దార్ల, వాళ్ళతాబేదార్ల ఆగడాలు, అత్యాచారాలు అన్నినవలల్లోను తరతమభేదాలతో చిత్రించబడ్డాయి. స్త్రీలపై అత్యాచారాలు "ప్రజలమనిషి" మినహా అన్నినవలల్లోను అత్యంత ప్రాధాన్యంతో చిత్రించబడ్డాయి. మృత్యుంజయుల్లోతప్ప తక్కినఅన్ని నవ లల్లోను కవుల్దారీ భూమిసమస్య దున్నేవానికేభూమి దృక్పథంతో కీలకాంశంగా చిత్రించబడింది. అంతేకాదు దాదాపు అన్నినవలల్లోనూ భూమికొరకు ప్రజలుచేసే పోరాటంలో స్త్రీలు అగ్రభాగాన నిలిచారు. కొన్నినవలల్లో వాళ్ళేముందు చొరవచూపితే ప్రజలు కదిలివచ్చారు. ప్రజాస్వామిక పోరాటాల్లో స్త్రీలు చొరవచూపితే వచ్చిన, రాగలవిస్తృత ప్రజామోదానికి ఇది సాహిత్యస్పందన, సూచన.

అన్నినవలల్లోను లౌకిక దృష్టిఉంది. పాలకవర్గాలు మతభేదాలు సృష్టించడానికి ప్రయత్నించడం, ప్రజలను ఈ సమస్యను మతపరంగా కాకుండా ఆర్థిక అసమాన తల పరంగా అర్థంచేసుకోమని కమ్యూనిస్టులు చైతన్యవంతులను చెయ్యడం మనకు అన్నినవలల్లోను కనిపిస్తుంది.

కమ్యూనిస్టులకున్న ఈ హిందూముస్లిం సామరస్యధోరణి చారిత్రకంగా ఖాద్య తాయుత ప్రభుత్వంలో ముస్లింలకు హిందువులతోపాటు సమాన ప్రాతినిధ్యం ఇవ్వాలని ముస్లింలు పాకిస్తాన్‌ను కోరడం జాతీయ ఆకాంక్ష అని భావించే ధోరణికి కూడా దారి తీసింది. ఈ ధోరణిని కూడా 'గంగు' నవలలో ఆళ్వారుస్వామిగారు రికార్డుచేసారు. ఏమైనా, తక్షణ ప్రయోజనాలకోసమైనాసరే, కమ్యూనిస్టులు సెక్యులర్ స్వభావాన్ని విడనాడలేదనడానికి, మతసామరస్యం కోసం చాలా కృషిచేసారనడానికి ఈనవలలన్నీ సాక్షులే.

ఈ అన్నినవలల్లోను బలంగా ప్రతిపాదింపబడిన అంశం ప్రజలపై యుగ యుగాల నుంచి దోపిడీవర్గాలు, అవి సృష్టించిన రాజ్యాంగ యంత్రమూ సంస్కృతి అణచివేతను హింసను అమలుచేస్తున్నాయనే విషయం. తెలంగాణా ప్రజలు ఎంతో కాలం సహించి, భరించి కళ్ళుతెరచి ఇకవీనిని సాగనివ్వమని ప్రకటించారు. అప్పుడు మాత్రమే ప్రతిఘటనా క్రమంలో ప్రతిహింస వ్యక్తమయిందనడానికి ఇవి కల్పనా రూపకమైన చారిత్రక నిదర్శనాలు.

"ప్రజల మనిషి"లో మొట్టమొదట దొర కొమురయ్యను కొట్టాడు. అతని భూమిని ఆక్రమించుకున్నాడు. పోలీసులు కంఠీరవాన్ని కొమురయ్యను అరెస్టుచేసి జైల్లోపెట్టారు. కోర్టు శిక్షవేసింది. ఆ తరువాత చెరువు హరాజు సమయంలో కూడా

దొర తరఫుకొరకే పోలీసులు, మెజిస్ట్రేటు వచ్చారు. స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహ కాలంలో కార్యకర్తలు అరెస్టయారు. దొర ఊళ్లో పోలీసు నాక పెట్టించాడు

'గంగు' నవలలో అంతమ్మ అనే కంసాలిస్త్రీపై భూస్వామి తలపెట్టిన అత్యాచారం ఆమెభర్త నాగభూషణం ఆలోచనల్లో స్త్రీలపై అగ్రిమపెత్తందార్లు అమలుచేసిన అవమానాలు, స్త్రీల ఆత్మహత్యలు చెప్పబడ్డాయి. అమీనుతంతే వెట్టిమీ దిగవాడు చచ్చిపోయాడు. తాము వేసుకున్న పాకలకు తామే నిప్పంటించుకొని దొరలు పోలీసులను పిలిపించారు.

ఈ రెండు నవలల్లో కూడా పాలకవర్గాలు వాటికి వత్తాసుగా పోలీసులు కోర్టులు జైళ్ళు- ఒక్కమాటలో రాజ్యాంగయంత్రం హింసను ఆచరించడం దాన్ని బలపరచి అమోదించడమే ఉన్నది. ప్రజలు దీన్ని బహిర్గతంచేసారు ప్రతిఘటించారు. విరోధించారు. అంతేకాని ప్రజలు చిన్నవిధ్వంసానికి కూడా పూనుకోలేదు.

'ఓనమాలు' నవలలో చాకలి పద్దాలు అనే 'సంగం' కార్యకర్త హత్య అతని భార్య మంగమ్మపై సర్కిల్ ఇన్ స్పెక్టర్ రమణారెడ్డి దుర్మార్గం మొదలుకంటే నవలంతా ప్రజలపై భూస్వాముల, వారిబంట్ల పోలీసులు రజాకార్ల హింస అణచివేతలే కనిపిస్తాయి. తెలంగాణా రైతాంగ పోరాటం సాయుధ ప్రతిఘటనకు చేరుకుంటున్న దశ అది. కనుక నవల ముగింపులో మాత్రం భూస్వామ్యవర్గానికి, ఆవర్గానికే కంచెగా ఉపయోగపడుతున్న పోలీసు యంత్రాంగానికి ప్రతినిధి అయిన రమణారెడ్డి మరణిస్తాడు. అక్కడకూడా తన భార్యను రక్షించుకోవడానికి స్వయంగా అతనిబావ రాజిరెడ్డి రమణారెడ్డిని తన్నవలసివచ్చింది.

'మృత్యుఛ్ఛనీడల్లో' నవలలో ఎందరో దళసభ్యులు, ప్రజలు రాఘవరెడ్డి దేశ్ ముఖ్, అతని గూండాలచేతుల్లో, వెంకయ్యవంటి భూస్వామిచేతుల్లో రజాకార్లచేతుల్లో పోలీసులచేతుల్లో మరణించారు. వడ్డీవ్యాపారానికి ఒక వడ్డెరవాణ్ణి బుడన్అనే గూండా చంపాడు. తరువాత రజాకార్లలోచేరాడు. అతడే ముగ్గురు కమ్యూనిస్టు కార్యకర్తలను చంపాడు. ప్రజలు వెంకయ్యనుచంపి ప్రతీకారం తీర్చుకున్నారు. పోలీస్ స్టేషన్ పై దాడిచేసారు.

'మృత్యుంజయులు' నవలలో మల్లారెడ్డి అనేరైతుతో మొదలయి ఒక్కఅతని కుటుంబంలోనే భార్య రాములమ్మ, కొడుకు ఎల్లారెడ్డితప్ప అందరూ భూస్వాములు, వాళ్ళరౌడీలు, పోలీసులచేతుల్లో మరణించారు. రచయితే స్వయంగాచెప్పినట్టు యుగయుగాల హింసకు ప్రతీకారంగా షబాన్అనే 'సంగం' కార్యకర్త పటేల్ నుచంపాడు.

అక్కడకూడా పటేల్‌చేతినుంచి రాములమ్మను రక్షించే ఆత్మరక్షణ ప్రయత్నమే ఉంది.

'సింహగర్జన' నవలలో జాగీర్దార్ తలపెట్టిన గుర్రపుశాల నిర్మాణంలో ఒక కూలి మరణిస్తాడు. అక్కడనుంచి ప్రారంభించి ఈ నవలలో ప్రజలు, ప్రజాకార్య కర్తలు ఎందరో భూస్వాముల, పోలీసులహింసకు ఆహుతిఅవుతారు. కూలిపనికివచ్చిన గంగి కుటుంబంపై జరిగిన దారుణానికి ప్రతీకారంగా కమ్యూనిస్టులు పటేలును వధిస్తారు.

ఇదిచరిత్ర. ఆయా నవలల్లోని పాత్రలు కల్పితమయినవేకావచ్చు. కాని ఇది తెలంగాణా చరిత్ర ఇది ప్రపంచచరిత్రకూడా. యుగయుగాలుగా ప్రజలు దోపిడీ వర్గాల చేతుల్లో హింసకు, అణచివేతకు గురవుతున్నారు.

ఒకసారి తెలంగాణ విమోచనోద్యమ చరిత్రవైపుచూస్తే విసునూరి దేశ్‌ముఖ్ గూండా దొడ్డికొమురయ్యను చంపివేసిన తరువాతనే తెలంగాణాలో కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంలో ప్రజల సాయుధప్రతిఘటన ప్రారంభమయిందని మనకు కనిపిస్తూనే వున్నది.

చరిత్రలోగాని ఈ చరిత్రనేదాని సజీవసంచలన మార్పురూపంలో ప్రతిఫలించిన ఈ నవలల్లోగాని ప్రజలు హింసకుపూనుకున్న ఘట్టం ఒక్కటీలేదు. అయితే తెలంగాణ విమోచనోద్యమం విశిష్టత ఏమిటంటే ప్రజలు తమప్రతిఘటనను సాయుధంగా వ్యక్తపరిచారు.

ఒక్క 'ప్రజలమనిషి'తప్ప తక్కిన అన్నినవలల్లోను భూస్వామ్య వ్యతిరేక పోరాటంలోకి, కమ్యూనిస్టుపార్టీలోకి భూస్వాముల, పెత్తందారుల కుటుంబాలనుంచి వచ్చినపాత్ర ఒక్కటయినా ఉంది.

'గంగు'లో భూస్వామి వెంకటాద్రిపుకూతురు సుజాత 'ఓనమాలు'లో భూస్వామి శివరామిరెడ్డి అల్లుడు, రాజిరెడ్డి (ఓనమాలు కొనసాగింపుఅయిన 'మృత్యువునీడల్లో' మాత్రం మళ్ళీ రాజిరెడ్డి కనిపించడు) 'మృత్యుంజయులు'లో పటేలుతమ్ముడు మురహరి, 'సింహగర్జన'లో జాగీర్దారుకొడుకు నర్సిరెడ్డి ఇందుకు ఉదాహరణలు.

బ్రిటిష్ వలసవిధానానికి నిజాం నిరంకుశవిధానానికి వ్యతిరేకంగాసాగిన ఉద్యమాల్లోకి రాజకీయ స్వాతంత్రం కోరుకున్న సంపన్నవర్గాలవాళ్ళు రావడం చారిత్రక వాస్తవం, పారిశ్రామిక విప్లవంతరువాత, ముఖ్యంగా మొదటి ప్రపంచయుద్ధం తరువాత సోవియట్ రష్యాలో బోల్షివిక్ విప్లవ విజయప్రభావంతో ప్రపంచవ్యాప్తంగా

ప్రజలు, యువతరం వలసవిధానానికి వ్యతిరేకంగా మనోభావాలు రూపొందించు కున్నారు. భారతదేశంలోకూడా దాదాపు అన్ని వర్గాలనుంచివచ్చిన ప్రజలపై కొత్త చదువులవల్ల, కొత్త పరిస్థితులవల్ల ఈ ప్రభావం కనిపిస్తుంది. ముఖ్యంగా పాశ్చాత్య విద్యావిధానం యువతరంలో స్వేచ్ఛ, సమానత, స్వాతంత్ర్యంగురించి నూతనవికాసాన్ని కలిగించింది. యువతరంలో ఆదర్శవాదం (Idealism), ఉదారవాదం(liberalism) చోటుచేసుకున్నవి.

ఈ వలసవ్యతిరేక, రాచరిక వ్యతిరేక పోరాటాలు వర్గస్వభావాన్ని పొందని మేరకు భూస్వామ్యవర్గాన్నించి వచ్చిన వాళ్ళుకూడా చాలామంది ఈ ఉద్యమాల్లో పాల్గొన్నారు.

అయితే ఈ నవలల్లో కొత్త పరిసరాలవల్ల ప్రభావాలవల్ల చైతన్యాన్ని పొంది వచ్చిన పాత్రలేకాని ఇవన్నీ, తమవర్గ ప్రయోజనాలు ఈ పోరాటంలో చేరడం ద్వారా నిలుపుకోవాలని వచ్చినవికావు.

'గంగు'లో సుజాత కాలేజీ చదువులవల్ల, ఇంటిదగ్గర తండ్రి ప్రోత్సాహంతో వీరలింగయ్య అనే గాంధేయవాది శిష్యరికంవల్ల జాతీయోద్యమ ప్రభావంలోకివచ్చింది ఆవిధంగా కళ్ళుతెరిచిన ఆమె చైతన్యం ముందు కనిపించిన. భూస్వామ్య దౌష్ట్యాల వల్లనే క్రమంగా సహజంగా ఆమె కమ్యూనిస్టుపార్టీలో చేరింది ఈ నవలలో భూస్వామి వెంకటాద్రిపు మాత్రం తన వర్గప్రయోజనాలు కాపాడుకోవడానికే స్టేట్ కాంగ్రెస్‌ను ప్రోత్సహించాడు, బలపరిచాడు.

'ఓనమాలు' నవలలోని రాజిరెడ్డి కూడా కాలేజీ చదువులవల్ల నూతన చైతన్యాన్ని పొందాడు. ఆ చైతన్యంతో ప్రపంచ పరిస్థితుల్లో వస్తున్న మార్పును అర్థంచేసుకున్నాడు. మార్పును ఆహ్వానించాడు. మార్క్సిస్టు దృక్పథం కలవాడుగా చిత్రించబడిన ఈపాత్ర 'ఓనమాలు'లో రమణారెడ్డి మరణం తరువాత ఇంక గడీ నుంచి బయటపడినప్పటికీ 'మృత్యువునీడల్లో' మాత్రం మళ్ళీ కనిపించదు. 'మృత్యువు నీడల్లో' నవలలో ప్రతినాయకుడు, ఒకచారిత్రక ప్రాతినిధ్యపాత్ర (విసునూరి దేశముఖ్ కొడుకు 'బాబుదొర') అయికూడ రాఘవరెడ్డి తన వర్గస్వభావంవల్లకాక 'ఫాసిస్టు' గా మారినందువల్ల ప్రజలపై దారుణమారణకాండ అమలుచేస్తాడు. తాను ప్రేమించిన స్త్రీని తండ్రి గడీలోకి ఎత్తుకొచ్చి వివాహంచేసుకుంటే పిన్నమ్మ, ప్రేయసిభావాల మధ్యన నలిగిపోయి ఇతడు రాక్షసకృత్యాలు చేసినట్లు రచయిత చిత్రించాడు.

'మృత్యుంజయులు' నవలలో పటేలు తమ్ముడు మురహరి పట్టణంలో కాలేజీలో చదువుతూ జాతీయోద్యమ ప్రభావంలో 'సహాయనిరాకరణ'లో పాల్గొని

ఇంటికి తిరిగివచ్చి గ్రామ పరిస్థితుల ప్రభావంవల్ల కమ్యూనిస్టుపార్టీలో చేరిపోతాడు. అతనికి దళాలలో సభ్యులను చేర్చుకొనేపని అప్పగించబడింది.

సుజాత, రాజిరెడ్డి, మురహరిలకు దోపిడీగురించి, పెత్తందారీ విధానం గురించి తాము చదువుతున్న దానికి దాఖలాలు తమ కళ్ళముందే కనిపించాయి. ఒకరి తండ్రి, ఒకరి మామ, ఒకరిఅన్న వాళ్ళకళ్ళముందే చేసిన అన్యాయాలు వాళ్ళ ప్రపంచ చరిత్రలో విన్నదానికి చదివినదానికి ప్రత్యక్షనిదర్శనాలుగా ఉన్నాయి. ఈ అన్యాయాల గురించి వాళ్ళు ఆలోచించడం మధనపడడం, ప్రశ్నించడం కూడా కనిపిస్తుంది.

ఆవేవీ లేకుండా 'అమ్మ' నవల చదవడంవల్లనే కమ్యూనిస్టుపార్టీలోచేరి రహస్య జీవితానికివెళ్ళి పోరాటంలో మరణిస్తాడు 'సింహగర్జన' నవలలో జాగీర్దారు కొడుకు నర్సి రెడ్డి. ఇదికూడా నైజాం వ్యతిరేకపోరాటంలో కాదు, యూనియన్ మిలిటరీ పోలీసులు జాగీర్దారు భూముల్లోని పంటను ప్రజలు కోసుకోకుండా అడ్డగించ దానికి వచ్చినప్పుడు. ఇది అసహజంగా వున్నది.

యూనియన్ మిలిటరీ పోలీసులు నిజాం రాష్ట్రంలో ప్రవేశించిన తరువాత సాయుధపోరాటం కొనసాగింపు విషయంలో కమ్యూనిస్టుపార్టీలోనే రెండు ధోరణులు వ్యక్తమయ్యాయి. భూస్వామ్యవర్గాల నుంచి, ధనికరైతుల నుంచి వచ్చిన నాయ కత్వం దీర్ఘకాలపోరాటానికి సిద్ధపడిలేదు, అది నిజాంవ్యతిరేక, జమీందారీ, జాగీర్దారీ వ్యతిరేక పోరాటం మేరకే నిర్వహించడానికి సంసిద్ధంగా వున్నది కాని దీర్ఘకాలిక సాయుధ వ్యవసాయ విప్లవాన్ని నిర్వహించడానికి మానసికంగా సంసిద్ధంగాలేదని ఒక విమర్శఉన్నది. తెలంగాణలో ఏర్పడిన కమ్యూనిస్టుపార్టీలోని నాయకత్వస్థాయిలో అత్య ధిక సంఖ్యాకులు భూస్వామ్య కుటుంబాల నుంచి, ధనికరైతులనుంచి వచ్చినవాళ్ళున్నా రని, వీళ్ళు దీర్ఘకాలికమైన వర్గపోరాటాన్ని నిర్వహించలేక పోవడం పార్టీ స్థాపన కాలపు నిర్మాణంలోనే బీజప్రాయంగా కనిపిస్తుందని ఒక విమర్శ ఉంది అట్లాగే వీళ్ళందరికీ కేంద్రంలో ఏర్పడిన కాంగ్రెస్ ప్రభుత్వ స్వభావం గురించి కూడా స్పష్ట మైన అవగాహనలేదు.

ఏమైనా విప్లవంలోకి భూస్వామ్యవర్గాల నుంచి కాని, ధనికరైతుల నుంచి కాని వ్యక్తులుగా కొందరు రావడంలో లోపంలేదు. పైగా పుట్టుకమాత్రమే వర్గస్వభావాన్ని నిర్ణయించదు. చైతన్యం వర్గస్వభావాన్ని నిర్ణయిస్తుంది. నూతన ప్రజాతంత్ర విప్లవంలో, జాతీయ విముక్తి పోరాటంలో వర్గాలుగానే జాతీయ బూర్జువావర్గం ధనిక రైతులు పాల్గొనడంలో తప్పులేదు. అవసరం కూడా. కాని ఈ పోరాటాలు దృఢ మయిన కార్మికకర్షక పునాదిపై కార్మికవర్గ నాయకత్వంలో కొనసాగినప్పుడు మాత్రమే ఆశించిన ఫలితాలను సాధిస్తాయి.

కాబట్టి ఈ పాత్రలన్నీ చారిత్రికంగా వాస్తవాలు. ప్రాతినిధ్య స్వభావంకలవి కూడా, ఇట్లా ఉండడం సరిఅయిందా కాదా అనే ప్రశ్నకు రచయితలకన్న అధ్యయనం జవాబుదారీ అవుతుంది.

ఈ నవలలను చారిత్రిక నవలలుగానో, రాజకీయ నవలలుగానో వర్గీకరిస్తూ కొందరు సాహిత్య విమర్శకులు ఇదివరకు రాసి ఉన్నారు.

నవల "గ్రామీణ జీవితాన్ని, రాజకీయపార్టీలతో కలుషితమైనవాతావరణాన్ని చిత్రిస్తోంది"

అనిరాస్తూ ఈధోరణికి "ఎన్నదగిన నవల"ల్లో 'ప్రజలమనిషి' చేర్చారు ఆర్.ఎస్. సుదర్శనం గారు.

అంతేకాదు 1950 తరువాత తెలుగునవల 1) సంఘసంస్కరణ ప్రబోధం' 2) భావాత్మక ప్రేమ' ) ఆర్థికరాజకీయవ్యవస్థల్లో మార్పుఅనేమూడింటిమీద గట్టిగ అవిశ్వాసాన్ని ప్రకటిస్తున్నదని కూడ ప్రతిపాదించారు.

గ్రామీణ జీవితం ప్రజారాజకీయ చైతన్యంతో నూతన వికాసాన్ని పొందడం మనం 'ప్రజలమనిషి'లో చూస్తాం. రచయిత స్వయంగా రెండుమూడుచోట్ల దిమ్మగూడెం గ్రామంలో వచ్చిన నూతన చైతన్యం గురించి ప్రస్తావించారు. దీనిని బట్టి ఆర్. ఎస్. సుదర్శనంగారు 'ప్రజల మనిషి' నవల చదివారా అని సందేహం కలుగుతున్నది. ఇకపోతే ఈ ఆరునవలలు కూడా ఆర్థికరాజకీయ వ్యవస్థలో మార్పును ఆహ్వానించినవే మార్పునుకోరి చావోబతుకో అన్నట్లు పోరాడిన ప్రజల మనుషుల చైతన్యాన్ని చిత్రించినవే. వీనిలో 'మృత్యుంజయులు' తప్ప తక్కినవన్నీ 1950 తరువాత వెలువడినవే. కాబట్టి సుదర్శనంగారి నవలా పరిశీలన నిరాధారమైన స్వకీయ ఆలోచనలతో కూడిందేకాని శాస్త్రీయమైంది కాదు.

తెలంగాణ పోరాట నవలల గురించి రాస్తూ మహీధర రామ్మోహనరావుగారు ఈ ఆరునవలలను రాజకీయ నవలలుగా పేర్కొన్నారు. ఆళ్వారుస్వామిగారి 'ప్రజల మనిషి' "1936 నుంచి నిజాం ప్రభుత్వాధికారంలోని తెలంగాణా భూభాగంలో తల ఎత్తి విస్తరించిన ప్రజావిమోచనోద్యమ నవల"గా ప్రత్యేకంగా పేర్కొంటూ 'గంగు'ను మాత్రం "1942 క్విట్ ఇండియా ఉద్యమాన్ని" చిత్రించిన నవలగా పేర్కొన్నారు.

'గంగు'లో "క్విట్ ఇండియా" ఉద్యమ ప్రస్తావన ఆయాపాత్రల చర్చల్లో తెలంగాణ విమోచనోద్యమం, సామ్రాజ్యవాద వ్యతిరేకోద్యమం, ఫాసిస్టు వ్యతిరేక యుద్ధంలో భాగమనే కమ్యూనిస్టుల అవగాహనకు సంబంధించిన చర్చగా వస్తుందేకాని కథలో భాగంకాదు. నవలలో వస్తువు ముందుసాగిన తెలంగాణ విమోచనోద్యమమే.

రామమోహనరావుగారు 'గంగు' గురించి వెలిబుచ్చిన అభిప్రాయం సరియైందికాదు అంతకన్న చారిత్రిక నవల, రాజకీయనవలగురించి ఆయన చేసిన విశ్లేషణ విచిత్రంగా ఉన్నది.

ఘటనలు పోరాటాలు వచ్చిఆరకముందే రాస్తే అవి రాజకీయాలనీ, వచ్చిఆరాక రాస్తే అవి చారిత్రికాలనీ, ఈనాటి రాజకీయపార్టీల చరిత్రను రాజకీయంగా, శివాజీ, ఔరంగజేబుల యుద్ధాన్ని చరిత్రగా ఉదహరించారు.

"రాజకీయ పరిస్థితులప్రభావం సమాజగతిమీద, సమాజప్రగతి ప్రభావం రాజకీయ పరిస్థితుల మీద ఈరెంటి ప్రభావం మనిషి జీవితం, భావాలమీద పరస్పర ప్రభావం కలిగిస్తున్న విధానాన్ని చిత్రించే నవలను రాజకీయ నవల అనవచ్చును" అంటారు రామమోహనరావుగారు.

ఈ నిర్వచనం ఉత్పత్తి సంబంధాల గురించి, వర్గపోరాటం గురించి స్పష్టంగా ప్రస్తావించకపోవడంవల్ల పైగా పోరాటాలకు తడిఆరడము, ఆరకపోవడము చారిత్రిక రాజకీయ నవలా స్వభావాలుగా ఒక అశాస్త్రీయమైన విభజనరేఖ గీయడంవల్ల ఈ నిర్వచనం తెలంగాణ విమోచనోద్యమం నవలలకు వర్తించదు.

"చారిత్రిక నవలలకుండవలసిన చారిత్రికత, దేశకాల నిర్దిష్టత అనే లక్షణాలే కాదు చారిత్రిక నవలల్లోని పాత్రలు చారిత్రిక శక్తులు సామాజిక ధర్మాలకు ప్రతినిధులుగా, వాటిమధ్య ఘర్షణలకు ప్రాతినిధ్యం వహించేవిగా కూడా ఉండాలంటూ రాచమల్లు రామచంద్రారెడ్డిగారు గత చరిత్రకు వర్తమానచరిత్రకు గల కార్యకారణ సంబంధం పాఠకుడికి బోధపడాలన్నది అన్నిటికన్నా ముఖ్యమని చారిత్రిక నవలల గురించి చెప్పారు.

కాని ఈ నిర్వచనం కూడా చరిత్రచోదక శక్తులు ప్రజలు అనే విషయాన్నికానీ చరిత్ర నిర్మాణంలో ఉత్పత్తి సంబంధాలు, వర్గపోరాటం కీలకాంశాలనే విషయాన్ని గానీ నొక్కిచెప్పదు.

సంఘటనలు, పోరాటం ఆవెప్పుడు జరిగినా వాటి ఆరంభవికాసాలు, వాటి చరిత్ర, అవిజరిగినప్పటి సమాజంలోని ఆర్థిక వ్యవస్థను కాపాడే రాజకీయ శక్తులను తోసి రాజనగలస్థాయి ఎంతగా ఆయా సంఘటనల్లో, పోరాటాల్లో ఉంటుందో అంతగా అవి రాజకీయ స్వభావాన్ని కలిగిఉంటాయి. ఆ విధంగా చరిత్రలో రాజకీయాలు ఉండే ఉంటాయి.

ముఖ్యంగా వర్తమాన చరిత్ర గత చరిత్రను స్పృహలోకి తేవడమే కాదు భవిష్యత్తు చరిత్రను కూడా గతితార్కికంగా ఊహించుకోవడానికి దోహదంగా ఉండాలి, మనకు తెలంగాణ విమోచనోద్యమ నవలల్లో భవిష్యత్తు ఊహకందుతుంది.

ఈ నవలల్లో ప్రజాఉద్యమం ఎల్లప్పుడు ఒకేదశలో లేదు. చలనంలో, పురోగమనంలో ఉంది. నడకల్లోనూ ఉంది. పరుగుల్లోనూ ఉంది. ఆ ఉద్యమంపై ప్రపంచయుద్ధ ప్రభావం ఉంది. జాతీయోద్యమ ప్రభావం ఉంది. ఆంధ్రమహాసభ సంఘసంస్కరణ స్వభావాన్నుంచి మొదలుకొని, ప్రజాసమీకరణ, ఆర్థిక రాజకీయ స్థాయి పోరాటాల వరకు దాని చలనరూపాన్ని ఈ నవలలు ప్రతిఫలించాయి.

ఈ మార్పు రావడంలో ఉన్న ఘర్షణను ఈ మార్పులో ఇమిడిఉన్న ఘర్షణను కూడా ఈ నవలలు చిత్రించాయి. అంటే ఒక్కమాటలో బానిసలుగా బతుకుతున్న ప్రజలు తమ బతుకులకు తామే నిర్దేశకులు నిర్మాతలు కాదలుచుకున్న దశవరకు-అందుకొరకు వాళ్ళు సాగించిన విప్లవ పోరాట స్థాయివరకు ప్రతిఫలించిన నవలలివి.

అందువల్ల ఈ ఆరునవలలను "ప్రజా రాజకీయ నవల"లు అనడం సమంజసంగా వుంటుంది.

ప్రజారాజకీయాలన్నప్పుడు ప్రజల పరిస్థితుల్లో మార్పు, ప్రజలచే చైతన్యవంతంగా నిర్ణయింపబడి పరిమాణాత్మక దశనుంచి గుణాత్మక దశవరకు మారడమనే భావం ఇమిడిఉన్నది. అశేషప్రజానీకం తమను అణచిఉంచిన భూస్వామ్యవ్యవస్థకు దానిని కాపాడుతున్న రాజ్యాంగ యంత్రానికి వ్యతిరేకంగా సంఘటనగా తిరగబడడం ఉన్నది. ఈ తిరుగుబాటు ప్రజాస్వామిక విప్లవ స్వభావాన్ని సంతరించుకున్న అవగాహన ఉన్నది, ఇది రైతాంగ సాయుధ పోరాటంగా సాగిందన్న అపూర్వమైన విషయాన్ని గుర్తించడం ఉన్నది. భూమిపై అధికారం రాజకీయాధికారంతో ముడిపడి ఉందని ప్రజలు పోరాటక్రమంలో గ్రహించిన అనుభవాన్ని ఈ నవలలు ప్రతిఫలించాయనే విశ్లేషణ ఇమిడి ఉన్నది.

నిర్దిష్టదేశకాలాల్లోని ఒక సమాజంలోని ఉత్పత్తి సంబంధాలే నిజానికి దాని సహజ చరిత్ర. ఆ చరిత్రలోని సహజత్వాన్ని తొలగించి చరిత్రను రూపుకట్టించిన కారణంగా చరిత్రనుంచి రాజకీయం, రాజకీయం నుంచి ఆర్థికం వేర్పడిపోయి ప్రత్యేక విధినిర్వహణ విభాగాలనే అభిప్రాయం కలిగిస్తున్నాయి. ఇందువల్ల మానవ కథా వికాస విజ్ఞానానికి మానవుడు దూరమవుతున్నాడు.

ఈ పరస్పర సంబంధాన్ని గుర్తించి, ఈ అన్ని అంశాలను ఒక సమగ్రమైన మొత్తంగా భావించి ఆయానిర్దిష్ట దేశకాలపరిస్థితుల్లో అనుభవానుగుణమైన ప్రజా చైతన్యం రాజకీయ వ్యవస్థను మార్చడానికి చేసిన పోరాటాల తీవ్రతను ప్రతిఫలించాయికనుక ఇవన్నీ ప్రజారాజకీయ నవలలు.

ఈ నవలలన్నీ సామాజిక అసమానతలు నగ్నంగా అమలయిన భూస్వామ్య వ్యవస్థ స్వరూప స్వభావాలను వెలికితీసాయి. అన్నిరకాల అసమానతలకు మూల మయిన ఆర్థిక అసమానత లక్షణాన్ని, దాన్ని కాపాడడానికి ఉన్న రాజకీయ వ్యవస్థను ఎరిగి ఎరిగి మార్పులనుకోరి తిరుగుబాటుచేయక తప్పని పరిస్థితులు, ఈ భౌతిక పరిస్థితులు పదనుపెట్టిన ప్రజాచైతన్యం. ఈ చైతన్యం ఒక మహత్తర భౌతిక శక్తిగామారిన గుణాత్మక పరిణామం ప్రతిఫలించాయి గనక ఇవి ప్రజారాజకీయనవలలు.

ఈ నవలలన్నీ 20వ శతాబ్దం పూర్వార్థంలో ముఖ్యంగా మొదటి ప్రపంచ యుద్ధం, అక్టోబరు విప్లవం తరువాత, రెండవ ప్రపంచయుద్ధం, చైనా నూతనప్రజా స్వామిక విప్లవకాలం దాకా ప్రపంచ వ్యాప్తంగా ప్రజల్లో పెల్లుబికిన నియంతృత్వ (అది ఒకచోట ఫాసిజం రూపంలో ఒకచోట వలసవిధానంగా, మరొకచోట రాచరికంగా అమలు జరుగవచ్చు) వ్యతిరేక ప్రజాస్వామిక స్వభావాన్ని చిత్రించాయి.

అన్ని నవలల్లోను అప్పటి ఉత్పత్తి సంబంధాలు, విధానాలు, సాధనాలు- ఈ మొదలయిన మౌలికాంశాలను చుట్టుకొనే కథావస్తువు నడుస్తుంది. ఇటువంటివాస్తవ చారిత్రిక మూలకాలమీద నిర్మాణమైన నవలలు గనుక ఇందులో పాత్రలన్నీ వాళ్ళ జీవిత నాటకానికి వాళ్ళే రచయితలుగా, వాళ్ళే నటులుగా ఉండి వాస్తవికతకు నిదర్శ నంగా ఉన్నాయి.

నిజమైన చరిత్ర అంటే ఆయాదేశకాలాల్లోని సమాజం యొక్క రాజకీయ ఆర్థిక చరిత్రే. అది ఎప్పుడూ సజీవంగా ఉంటుంది గనుక మార్పులకు, పురోగమనా నికి అనుకూలంగా ఉంటుంది. సామాజిక సంబంధాలన్ని చారిత్రిక పరిణామ ఫలి తాలే. చరిత్ర నిర్మాతలయిన ప్రజలు మార్పులకు అభిముఖంగా ప్రవర్తించడానికి దోహదం చేసిన భౌతిక పరిస్థితులు, ప్రజల చైతన్యం కళారూపాల్లో ప్రదర్శించినవి ఈ ప్రజారాజకీయ నవలలు.

ప్రజల వర్గపోరాటాలను ఆయాదశల్లో ఆయాస్థాయిల్లో యథోచితంగా చిత్రించి ప్రజారాజకీయ స్వభావాన్ని న్యాయంగా సమర్థించాయి ఈ నవలలు. అందువల్లనే ఇవి ప్రజారాజకీయ నవలలని ప్రత్యేకంగా చెప్పవచ్చు.

తెలుగు నవలా సాహిత్యంలో ఈ నవలలకున్న ఈ ప్రజాస్వభావాన్ని ప్రజా రాజకీయానుకూలతను గుర్తించకుండా రాజకీయ నవలలనో, చారిత్రిక నవలలనో స్థూలమైన, సాధారణమైన వర్గీకరణచేస్తూ ఇంతవరకు సాహిత్య విమర్శకులు ప్రస్తా విస్తూవస్తున్నందున ఇంత వివరంగా ఈ నవలలకున్న ప్రజారాజకీయ చైతన్య స్వభావాన్ని వివరించవలసి వచ్చింది.

1922 మే 4 ఉద్యమం చైనాలో ప్రజాస్వామిక విప్లవానికి దారులువేసినట్లుగా ఆంధ్రమహాసభ తెలంగాణాలో ప్రజాతంత్ర ఉద్యమానికి మార్గదర్శకమైన మహత్తర చరిత్ర ఈ నవలల్లో సృజనాత్మకంగా చోటుచేసుకున్నది.

తెలంగాణ విమోచనోద్యమం గురించి పాఠకులు, వివరాలు తెలుసుకోవడానికి ఈ నవలలు ఉపయోగపడకపోవచ్చు. కాని తెలంగాణవిమోచనోద్యమం ప్రజల చైతన్యంలో తెచ్చినమార్పు మనకేచరిత్రగ్రంథంలోను ఈ నవలల్లోవలె ఒక గాఢమైన ప్రభావంగా కన్పించేఆస్కారంలేదు.

పునాది ఉపరితలంపై, ఉపరితలం పునాదిపై ఎంతటిప్రభావాన్ని చూపాయో ఉద్యమచరిత్రకన్నా ఈ నవలలు ఎంతోవైవిధ్యంతో ఆవిష్కరించాయి.

అట్లే విమోచనోద్యమం తెలంగాణ ప్రజల్లో ఆవిష్కరించిన నూతన సాంస్కృతిక విలువలు, భావపరిధిలోవచ్చిన వినూత్నమైన మార్పులు సృజనాత్మకమైన స్వభావం కలవి. వాటిని కళమాత్రమే కళ్ళకుకట్టినట్లు ప్రతిఫలించగలదు.

అయితే సమాజం సాహిత్యంమీద ప్రభావంవేస్తుందని చెప్పుతున్నప్పుడు సమాజంలోవచ్చిన ప్రతిమార్పు సాహిత్యంలో అట్లాగే ప్రతిఫలిస్తుందని అర్థంకాదు. సాహిత్యంలో చిత్రించబడిన ప్రతివిషయానికి యాంత్రికంగా సమాజంలోని పరిణామాలతో ముడివేయలేం. సాహిత్యంలో రచయిత భావజాలం ఆయనతీసుకున్న భౌతిక జీవితవాస్తవికతతో కలగలసిపోతుంది. ఈ భావాలు భౌతిక పునాదిగలవైనప్పుడే సమాజంలోదానికి సాదృశ్యాలుచూపవచ్చు. అలాకానప్పుడు ఆ ధోరణి ఉపరితలంలో ఉన్న సైద్ధాంతికధోరణికి, చైతన్యస్థాయికి చెందుతుందికాని భౌతిక వాస్తవికతకు ప్రత్యక్ష నిదర్శనంకాజాలదు.

పునాదిలోవచ్చే మార్పులను మాత్రమే ప్రకృతిశాస్త్రమంత స్పష్టంగా, ఖచ్చితంగా అంచనావేయవచ్చునంటాడు మార్క్స్.

మార్క్సిస్టు దృక్పథంలో యాంత్రికధోరణి (economic determinism) ని విమర్శిస్తూ కళాకారులు అనుద్దేశ్యపూర్వకం (unconscious) గానే సమాజ వైరుధ్యాన్ని ఎట్లా ప్రతిఫలిస్తారో సాంఘిక శాస్త్రవేత్తలకన్నా వాళ్ళకున్న ఈ సౌలభ్యం (Advantage) గురించి ఏంగిల్సు వివరించాడు. ఈ అంశాన్ని చెప్పడానికే ఉద్దేశించిన ఈ విశ్లేషణను ఏంగిల్సు మాటలవెలుగులోనే అవగాహనకు తెచ్చుకుందాం:

"I think, however, that the purpose (the purpose of the novel) must become manifest from the situation and the action themselves without being expressly pointed out and that the author does not have to serve the reader on a platter the future historical resolution of the social conflicts which he describes".

మెట్టు మెట్టుగా ఉద్యమచరిత్రను చిత్రించిన

# తెలంగాణ పోరాట కథలు

కె. రాంమోహన్‌రాజు

తెలంగాణా ప్రజాజీవితాన్ని, అక్కడ ప్రవేశించి, ప్రజల్ని చైతన్యవంతుల్ని చేసి రాచరికవ్యవస్థనూ, భూస్వామ్య నిర్మూలననూ కృషిచేసిన 'సంఘం' చరిత్రని తెలంగాణా పోరాట కథలు చిత్రించాయి.

చరిత్ర చదివి తెలంగాణను అర్థంచేసుకోని వాళ్ళుగూడ ఈ కథలవల్ల తెలంగాణ చరిత్రను మొత్తం అర్థంచేసుకోవచ్చు 1920 నుంచి రైతాంగ పోరాట పూర్వ రంగాన్ని, 1946 నుంచి రైతాంగ సాయుధ పోరాటాన్ని 1948లో యూనియన్ సైన్యాల ప్రవేశం తర్వాత కూడ పోరాటం కొనసాగింపునూ ఏ ఒక్క ముఖ్య సంఘటనను గూడా విడనకుండా చిత్రిస్తున్నవి ఈ కథలు.

'రహీంబాయి' అన్న కథలో వి. వెంకటేశ్వరరావు అకాలపు తెలంగాణ గ్రామ జీవితపు విషపు నీడలు చూపాడు. దొరల ఇళ్ళలో పెళ్ళిళ్ళయితే ఊరంతటికీ పెళ్ళి పనే. తన అధికారంసాగే గ్రామాల్లో ఆ దొర 'షాదీపట్టీ' అనేపేర డబ్బు వసూలు చేస్తాడు. తలాకొంత చొప్పున వంతువేసుకుని ఊరిప్రజలందరూ ఆ మొత్తాన్ని కూర్చాలి ఎంతవసూలయితే అంత దొరకు ఇవ్వటమనేది కాదు ఈ షాదీపట్టీ. ఎంత వసూలుకావాలో ముందే దొర నిర్ణయిస్తాడు. అది పదివేలుకావచ్చు యాభైవేలు కావచ్చు. ఈ మొత్తాన్ని ఊళ్ళోవుండే కారణాలు, పటేళ్ళు వసూలుచేస్తారు ఊరిప్రజల గోడుగొట్టి। ఈ కథలో గూడ అలాంటి సన్నివేశం వుంది. తన కిందవున్న 'ఆజాద్‌ఫౌజ్' అనే గూండా దళానికి దొర షాదీపట్టీ వసూలుకు అనుమతి ఇచ్చాడు. చూసిరమ్మంటే కాల్చివచ్చే ఆ ఫౌజు డబ్బుఇవ్వలేని రైతులఎడ్లు, బర్రెలు, గొర్రెల్ని జప్తుచేసి షాదీపట్టీ పూర్తిచేశారు.

ఈ అన్యాయానికి రహీం ఎదురుతిరిగాడు. దొర ఇంట్లో పెళ్ళయితే మా కొంప కూల్చడందేనికని అడిగాడు. ప్రాణాలుపోయినా తన పశువుల్ని తోలుకపోనివ్వనని అనే సరికి దొర ఫౌజు వెనక్కితిరిగింది. ఊళ్ళోవుండే దొర ఏజంటుగూడా తానతన్ని ఏమీచెయ్యలేనని ఒప్పుకోవటంతో దొర అతడిమీద దొంగకేసుపెట్టించి కోర్టుచుట్టూ పన్నెండేళ్లపాటు తిప్పాడు. అప్పటికీ తీర్పు రహీంకి అనుకూలంగానే రావటంతో దొర అతన్ని గూండాలతో హత్యచేయించాడు. ప్రజలదృష్టిలో రహీం అమరుడిగా నిలిచాడు, దొర క్రూరుడిగా నిలిచాడు.

ఐతే రహీం దొరకెందుకు ఎదురుతిరిగినట్టు? రహీం ముందునించీ స్వతంత్రుడు. ఎవరిదగ్గరా నౌకరీచేసిఎరుగడు. కలోగంజో తాగి తనఇంట్లోతానుండే మర్యా

దస్తాడు. ఊరిలో అందరిపేర్లీషుకీపాత్రుడు. ముస్లిమే ఐనా ఇంట్లోగూడా తెలుగే మాట్లాడుతాడు. కేవలం తనపశువుల్ని రక్షించుకోవడానికే అతనెదురుతిరగాడనటం గూడ నిజంకాదు. అతనికళ్ళముందు ఒక సంఘటన జరిగింది.

ఒక రైతుభార్యను అతనికళ్ళముందే ఇంట్లోనించి బయటికి వెళ్ళగొట్టించాడు దొర. తర్వాత ఆమెని చెరిచాడు. ఆమె తర్వాత పదిన ఇబ్బందులు రహీంచూశాడు. తనకర్తవ్యం ఏమిటో నిశ్చయించుకుని ఎప్పటికైనా మనమంతా ఏకంకావాలని రైతులతో అంటూవుండేవాడు. హిందువేమిటి ముస్లిమేమిటి అందరంఒకటే అనేదిగూడ అతనిదృక్పథం. అలాంటిసమయంలోనే షాదీ పట్టీరావటం జరిగింది. అతనుచెప్పింది రైతులువిన్నారు. తాను ఇవ్వకపోవటమేగాక ఇతర్లనిగూడా షాదీపట్టీ ఇవ్వవద్దని చెప్పాడు. ఫలితమే కోర్టుకేసు - హత్య।

1920లో విసునూరుదొర గూండాలతో చంపబడ్డ బందగీకథే 'రహీంబాయి' కథ. తెలంగాణాగ్రామాల్లో చైతన్యానికి ఇదిమొదలు.

ఆనాటి తెలంగాణా ప్రజలు నిరక్షరాస్యులు. పైగా భూస్వామ్యపాలనలో వున్నారు. వారిలో వుండే అజ్ఞానమూ, మూఢవిశ్వాసాలు వ్యవస్థనుబట్టే వచ్చాయి. అలాంటి ప్రజలకు అధికార్లపట్ల భయం, వారి పదవులపైనా, వారి కార్యాలయాల పైనా, వారిపక్కన బీరువాల్లోవుండే బైండుపుస్తకాల మీదా గురివుండటం సహజమే. తమ గురించి తమకంటే అట్టబైండు పుస్తకాలో, అధికార్లో ఎక్కువ ఆలోచిస్తారనీ, తమకేదన్నా కష్టంవస్తే తీర్చగలరనీ నమ్ముతారు. ఆ పుస్తకాలన్నీ తమను దోపిడీ చేసేవర్గాల న్యాయమనీ అధికార్లు పాలకుల ఏజెంట్లనీ వారు గ్రహించలేదు.

అలాంటి అధికార్లు ఏదైనా వూరికి వచ్చినప్పుడు వారికి కావాల్సిన ఏర్పాట్లు చూడటానికి కొంతముందుగానే జవాను ఒకడు పల్లెకివచ్చి సమాచారం అందజేస్తాడు. అధికారి వచ్చేసరికి వేణ్ణీళ్ళు, కోడికూరా, మంచిభోజనం సిద్ధంచేసి వుంచాలి. వీటన్నిటికీ ఊళ్ళోవుండే కోమట్లదగ్గర వంతులవారీగా సరుకులు తెప్పిస్తాడు కరణం. వంతు అంటే ఊళ్ళోఉన్న కోమట్లంతా ఒక్కోసారి ఒక్కరు చొప్పున సరుకులు సప్లయి చెయ్యాలి. అలాగే కోళ్ళు, గుడ్లు ఇతరకులాలవారు వంతులవారీగా సప్లయిచెయ్యాలి. అది వారి కర్తవ్యం। దానికి ప్రతిఫలంవుండదు. అధికారి గుర్రానికి గూడా శనగల దాణా ఏర్పాటు చెయ్యాలి.

ఈ పరిస్థితిని ఆసరాచేసుకుని జవాను గూడా యథాశక్తి తమదాష్టీకం తామూ చెలాయిస్తారు. దానిక్కారణం తాము పీడితప్రజల వర్గానికి చెందిన వాళ్ళమని కాక పాలకవర్గానికి చెందినవాళ్ళమని భ్రమపడటం. అందుకే అధికారిదగ్గరి జవాను గ్రామ

కరణాన్ని సైతం దబాయించి వసూలు చేయించగలడు. వంతునరుకు లివ్వకపోతే దొంగతూనికరాళ్ళు, తక్కువ కొలతలు పట్టుకుంటానని కోమటిని బెదిరించగలడు. ఇవాళ అధికారిది గుర్రం కనక దాణా, రేపుకారయితే పెట్రోలుకూడా కొనిపెట్టాలని స్పష్టం చెయ్యగలడు. దీనిక్కారణం ప్రజలే ప్రభువులకి అన్నీసమకూర్చి పెట్టాలన్న రాచరికన్యాయం, దాన్ని ఆశ్రయించి జీవిస్తున్న అందరూ అలాగే ప్రవర్తిస్తారు.

'న్యాయం' అనే కథ జవాను కోమటిని నరుకులివ్వమంటే ఎన్నిరోజులు ఇంకా ఇలా తింటారని కోమటి అంటాడు, లేకపోతే దావాచెయ్యమంటాడు జవాను. "చీటీలు ఇవ్వటంతో సామానుదొరికినట్టు, దావాచెయ్యగానే న్యాయం దొరుకుతుంది?" అంటాడు కోమటి. ఈ అనటంలో తిరుగుబాటువుంది. ఇది అప్పటికే తెలంగాణ గ్రామ జీవితంలో సంగం ప్రవేశించిన ఫలితం.

దొరలు విర్వీచారజీవులు. వారికి ఏకష్టమూలేకుండా అన్నిపనులు చెయ్యటానికి వెట్టివాడు, ఎలోడు, నీరడికాడు, పాయకానాలు తవ్వటానికీ శుభ్రంచెయ్యటానికీ బేగరివాడు, దీపాలుతుడిచి నూనెపోసి ముట్టించి అన్నిగదుల్లోనూ వుంచడానికి మంగలి, చాకలితెచ్చిన అతుల్ని విస్తర్లుగా కుట్టిపెట్టడానికి సాతానివాడూ, ఇంటిపనులు చెయ్యటానికి ఆడబాపలూ- ఇలావుండేది దొరలజీవితం. నీరడికాళ్ళలో రెండురకాలు. ఒకడేమో ఇంటికిఅవసరమయే నీటిసరఫరాకీ, మరొకడు దొరపొలాలకి అవసరమయే నీటిసరఫరాకీ। (చెరువునీరడికాడు)

ఇలా జీవించేదొరలకి ఇల్లుకదలాల్సిన పనిలేదు. కానీ వూరికే పల్లెలోవుండటం విసుగుకదా। అందువల్ల దొరలకి పేకాటఆడ్డానికో, అధికార్ల దర్శనానికో అప్పుడప్పుడూ పట్నం వెళ్లకతప్పదు. పట్నంవెళ్ళేటప్పుడు సవారీకచ్చరంమీద ప్రయాణం. చక్కని గూడుఅల్లిన రంగులబండిలో పరుపూ మెత్తలమధ్య దొర సౌఖ్యంగా ప్రయాణం చేస్తుంటే బండిముందు మంగలో చాకలో పరిగెడుతుంటాడు ఇలా పరిగెత్తడం హోదాకి చిహ్నమేకాక బండికి ఎవడూ అడ్డంరాకుండా చూడటానిక్కూడా. బండి మెల్లిగాపోవటం దొరతనానికి నామోషీ, కదిలాయంటే ఎడ్లుపరిగెత్తడమేతప్ప నడవ గూడదు. ఇక దారిపొడుగునా ఎవరూ బండికి అడ్డంరాగూడదు. ఎదురువచ్చేవాళ్ళు తొలిగి దారిఇవ్వాలి. బండికి వెనకాముందూ పరిగెత్తేవాళ్ళ పరిస్థితి ఎలావుంటుందో మనం ఊహించవలసిందేగానీ చెప్పటానికి వీలులేదు.

'మనవూళ్లోకూడానా....?!' అన్నకథలో కాంచనపల్లి చినవెంకట రామారావు ఈ విషయాన్ని చిత్రించాడు. దొర సవారీబండికి సైకిలిస్టు ఒకడు తగిలాడు. ఇక

ఆ సైకిల్‌వాలా సైకిల్‌దిగి నడవాల్సిందేగాని బండివెనకనైనా సైకిలెక్కి రాగూడదు, బండిని దాటిపోగూడదు.

దొర బండితో సామాన్లుమోస్తూ వచ్చిన సర్వయ్య ఆ అలుపుతీరక ముందే మళ్ళీ వెళ్ళాల్సవచ్చింది పనిమీద. పిలువవచ్చిన కాశింతో రానుపొమ్మంటాడు సర్వయ్య. అందుకు పట్వారీ సర్వయ్యను చావగొడితే షేక్‌సింది కాశిం సాయెబు అడ్డు పోతాడు. తనని ఆపినందుకు పట్వారీ షేక్‌సిందు యీనాం జప్తుచేయిస్తానంటాడు. ఐనా కాశిం లెక్కచెయ్యడు. రెక్కలు చల్లగావుంటే నల్లగొండలో ఒంటెద్దు బండి నడుపుకుని బతుకుతానంటాడు. ఈ అనటం కూడ మాటవరసకి కాదు. తనతోటి వాడికష్టాల పట్ల తనకీ అవగాహనా సానుభూతీవుంది. ఎందుకంటే అతనూ దొరకు కాకుంటే చిన దొరకో, ఈ ఇద్దరు కాకుంటే పటేలు పట్వారీలకో, లేకపోతే అమీన్ గిర్దావర్లకో సేవచెయ్యాల్సిందే. వెట్టివాడిలాగే, గవర్నమెంటు ఉద్యోగిఐన షేక్‌సిందీకి కూడ తీరికలేదు. అందుకే అతడు గ్రామ ప్రజలతో కలిశాడు. అతడిలాగే బాధలుపడుతున్న అందరూ వెట్టి నశించాలని తీర్మానించుకుని 'సంగం'గా కదిలారు.

నిమ్మకాయలు నిలబడే మీసాలు కిందికి వాలిపోతుంటగా దొర ఈ చిచ్చు మన వూళ్లో కూడానా అనటం ఆ ఒక్కవూరికే, ఒక్కసంఘటనకే చెందిందికాదు. ఈ కథ రచనాకాలం 1945. అప్పుడు ప్రజల్లో ప్రజల సమస్యలమీద సంగం పనిచేస్తున్నందున ఈ తిరుగుబాటు గ్రామాల్లో రగిలింది. ఇలాంటి నేపథ్యంవున్నజాతి జీవితంలో ఏ మాత్రం చైతన్యం కలిగించబడ్డా పోరాటం అనివార్యం.

తెలంగాణ గ్రామజీవితంలో సంఘం ప్రవేశించిన తర్వాత వారిజీవితాల్లోమార్పు మొదలైంది. సంఘపోళ్లు ఊళ్లల్లోకివెళ్ళి "ముచ్చట్లు" చెప్పడం ప్రారంభించారు, దొరలదగ్గిరా, జాగిర్దార్ల దగ్గిరా వెట్టిచేసే వాండ్లు అందరూ ఈ ముచ్చట్లని ఆసక్తిగా విన్నారు దొర పనికోసం తీసుకువెళ్లాలని పేగేదార్లు వచ్చినప్పుడు వారికి కనబడకుండా అందరూ తప్పుకుని పనులు "ఎగగొట్టారు."

సంఘంలో అణాచెల్లించి సభ్యత్వంపొంది చిట్టీలుతీసుకున్నారు. సంఘనాయకులు చెప్పింది జాగ్రత్తగా విన్నారు, అందరూ ఒక్కమాటమీద ఉండాలనీ, ఒకర్నొకరు ఆదుకోవాలనీ చెప్పిన మాటలు వారిమనసుకుబాగాపట్టాయి. వెట్టిచాకిరీ బంద్ చేయాలనుకున్నారు.

అమీన్‌సాబ్ దొరాకువస్తే దొర ఊరివాండ్లమీద షికాయత్ చేశాడు. అమీన్ వాళ్ళని పిలిపించి పనులు ఎందుకు చెయ్యటం లేదంటే వెట్టి చెయ్యమని చెప్పారు,

ఎందుకు చెయ్యరంటే తాము సంగంలో చేరామని సంఘంచిట్టీలు చూపారు. దాంతో అమీన్ నోరుమెదపలేదు.

సంఘం చిట్టీకివున్న విలువ అలాంటిది. సంఘం అంటే పోరాట ప్రజలశక్తిగా రూపొందిన కాలం అది. సంఘాన్ని వ్యతిరేకించటం అంటే కొరివితో తలగోక్కోవటమే అని అమీన్‌లకు సైతం తెలుసు. అందుకే తోకముడిచారు.

తెలంగాణాగ్రామాల్లో 'గడీ'లనేవి పీడకలల్లాంటివి, ఇవి దొరలనివాసాలు. వాటిలో వారికొకావల్సిన అన్నిసౌఖ్యాలూ, వాటినికాపాడే గూండాబలాలు వుండేవి.

ప్రజలు ఎదురుతిరగటం అనేది ప్రారంభమయాక అది మరింత విస్తరించిందే గానీ తగ్గలేదు. గడీలనుసైతం ప్రజలు చుట్టుముట్టసాగారు. అందువల్ల వడిసెలలు, కర్రలుతప్ప మరేమీలేని ప్రజలమీద గూండాలు తుపాకులు ప్రయోగించారు. కొందరు మరణించారు కాని దానివల్ల ఎందరో చైతన్యంపొందారు.

అవుల పిచ్చయ్యగారి 'వూరేగింపు' కథలో దొడ్డికొమురయ్య వీరమరణం తర్వాత అతని స్మారకంగాజరిపిన 'కడవెండిదినం' చిత్రించబడింది. విసునూరి దొర తల్లి కడవెండిదొరసాని. ఆమె ఆజ్ఞమేరకు గూండాలు మిష్కీనీఅలీ నాయకత్వంలో ప్రజలపై కాల్పులుజరిపారు. ఆకాల్పుల్లో దొడ్డికొమురయ్య మరణించాడు, ఈ విషయం తెలిసినప్రజలు బెదిరిపోక సంఘటితంగానిలిచి గూండాలని తరిమికొట్టారు. దీనివల్ల ప్రజలకి పోరాట చైతన్యంవచ్చిందని అర్థమవుతుంది. తమజీవితాలచుట్టూ పరుచుకుని వున్న చీకటిని తెలంగాణలోని పిల్లలుకూడ చిన్నప్పుడే గ్రహించారు. దొర తమమీద చేస్తున్నఅగడాలకి అర్థమూ, కారణమూలేదనిగూడ వారికర్థమయింది. అందుకే ఆళ్వారు స్వామి 'చిన్నప్పుడే' అన్నకథలో 'పాపం। చిన్నప్పుడే కుటుంబ ఇబ్బందులన్నీ ఈ పిల్లలు తెలుసుకోవాల్సినగతిబట్టిందంటే ఎంతఅధ్వాన్నంగా ఉన్నాయో తెలుస్తుంది' అంటాడు.

నిజాం ఏదైనా ఆజ్ఞను జారీచేసినప్పుడు నిజాం పాలితప్రాంతాల్లో ఆ ఆజ్ఞను మాదిగవాడు డప్పుతోదండోరావేసి వినిపిస్తాడు ఊరంతటికీ. సాధారణంగా ఆ ఆజ్ఞలన్నీ ప్రజల్నిపీడించేవే గనక ఆ దండోరా విన్పించిందంటేనే ప్రజలు భయంతో వణికిపోయేవారు మళ్ళీ ఏంమునిగిందోనని।

ఆ ఆజ్ఞని కాగితంమీద ముద్రించి కచేరీముందుసావడిలో అంటించేవారు. చదువు వచ్చినవాళ్లు ఆ ఫర్మానాని చదువుకునేవారు. సంఘం ప్రజాసమస్యల్ని తీసుకుని ప్రజల్లోకి చొచ్చుకుపోయాక దానికి నిజాంకన్న ఎక్కువ పలుకుబడే వచ్చింది ప్రజల్ని

పీడించే అధికార్లని హెచ్చరించటంకోసం ఒక ఫర్మానాను జారీచేసి ఒక గ్రామంలో షావుకారు దుకాణం పక్కకి అంటేశారుసంగం వాళ్ళు. దాన్నిచించిన వాండ్లకు తగిన శిక్షపడుతుందని గూడా వాండ్లు దాన్లో హెచ్చరించారు.

దాన్ని గ్రామస్థులందరూ చదివారు. ఆ ఫర్మానావల్ల ప్రజలెవరికీ బాధకలగ లేదు. చివరికి అమీన్‌గూడ వచ్చిచదివాడు. అతనికి ఆ ఫర్మానాని చింపటానికి ధైర్యంలేక ప్రజల్లో ఎవరైనా చింపమంటాడు. ఎవరూచింపరు. చివరకు అమీనూ, కలెక్టరూ ఇద్దరూకల్పి ఆలోచించి వరంగల్‌నించి రజాకార్ ఒకణ్ని సామాన్య ప్రజల వేషంలో పిలిపించి ఆ ఫర్మానాని చింపించుదామని తీర్మానిస్తారు.

ప్రజలు సంగంమీదవున్న ప్రేమతో, విశ్వాసంతో దాన్నిచింపటానికి నిరాక రిస్తే పోలీసులు సంగమంటే వున్నభయంవల్ల చింపలేకపోయారు. ఎందుకంటే సంగం అన్నంతవనీ చేస్తుందని వారికితెలుసు.

నిజాం అధికార్లు చీటీరాస్తే సరుకులు దొరికినట్టుగా సంగం గ్రామాల్లోకి ప్రవే శించాక ప్రజలకి న్యాయంఅనేదిగూడా సంగంచీటీవల్ల దొరికింది. మొదటిది భయమూ నిర్బంధంవల్ల జరిగితే, రెండోది ప్రేమా అభిమానాలవల్ల జరిగింది.

దోపిడి పాలకవర్గాలకి కాలంలోనిమార్పులు పట్టవు. ఒకవేళపట్టినా వాటిని గుర్తించనిరాకరిస్తారు. అందువల్లనే జరిగేపోరాటాలమీదికి తమ కిరాయిమూకల్ని పంపి వాటిని అణచబోతారు. కానీ పోరాడుతున్నప్రజలు శత్రువు ఆధునికాయుధాలతో వున్నప్పటికీ వాణ్ని జయించగలరు. ఉపాయంతో అపాయాన్నిజయించే విధానంవారికి జీవితమేనేర్పుతుంది. శత్రువుచేతిలో స్టెన్‌గన్‌కన్న ప్రజలచేతివడిసెల శక్తిమంత మైంది.

గ్రామాన్ని దోపిడీ చెయ్యటానికి వచ్చిన రజాకార్ ముఠాని ఉపాయంగా ఒక ఇంట్లోకి రానిచ్చి ఆ ఇంట్లోకి అందరూపోగానే ఇంటితలుపుల్నిమూసి నిప్పంటించి సజీవదహనం చేశారు ఒక గ్రామ ప్రజలు. ఎనభైమంది సైనికుల్లో 20 మంది మాత్రం ప్రజలకోపాగ్ని నుంచి బయటపడి కొరిప్రాణాలతో బయటపడ్డారు.

అలా మిగిలిన వాళ్లు మళ్ళీ కొత్త నాయకుడితో అదేగ్రామంమీద కక్షతీర్చుకో టానికి బయల్దేరారు. ఈసారి సైన్యం తమ కొత్తసర్దార్‌నిచంపి గెరిల్లాలతో కలిసి పోయారు. ముప్పై హాలీ రూపాయల జీతంకోసం గ్రామాల్ని తగలెట్టడం, ముస్లిం నాగరికత నిలపడటం కోసం జనాన్ని చంపటంపట్ల వాండ్లు విముఖులవడమే కాదు, సంఘ నాయకత్వం కిందవున్న ప్రజల్ని జయించటం అసాధ్యమని గ్రహించారు.

శారద 'కొత్తవార్త' అన్న కథ ఈ అంశాన్ని చిత్రించిన కథ. ఇత్తెహాదుల్ గూండా మొహిద్దీన్ ప్రజల ప్రతిఘటనను భరించలేక తన సైన్యాన్నే తన్నటం, గ్రామ పటేల్ని తిట్టడం, పిచ్చికుక్క లక్షణాలే. 1930 కీ 1948 కీ గల కాలవ్యత్యాసాన్ని పాలకులు గమనించలేదన్న శారదగారి మాటే నిజమైతే దానికి ఫలితం పాలకులు ఎందరో అనుభవించారు, ఇకముందుగూడా అనుభవిస్తారు.

తమనిపీడిస్తున్న నిజాంకు పన్నులుఇవ్వటం మానెయ్యాలని ప్రజలు నిర్ణయించుకున్నారు. పోలీసులువచ్చి హింసించినా, బాధించినా వాండ్లు పన్నులుమాత్రం ఇవ్వలేదు. ఇన్నాళ్ళనుంచీ ఇస్తున్న పన్నులు అధికార్లజీతాలకి ఖర్చయాయా అనివాండ్లడగటం పన్నులు ఏమవుతున్నాయో అర్థంచేసుకునేస్థితికి ఎదగటమే.

ప్రజలమీద దౌర్జన్యంచేసి పన్నులు వసూలుచెయ్యబోతే ప్రజలు రాళ్ళురువ్వి అధికార్లనీ, పోలీసులనీ తరిమారు. మర్నాడు మిలిటరీవచ్చినా వందలాదిమందిని అరెస్టుచేసినా పన్ను వసూలుమాత్రం కాలేదు.

పార్టీ, ప్రజలకి పన్నుచెల్లిచంవద్దనీ, లెవీగల్లా ఇవ్వవద్దనీ ఇచ్చినపిలుపుకి ఫలితంఇది. ఈ విషయం ఆధారంగా పర్చా దుర్గాప్రసాదరావు 'పన్నులుఇవ్వం'అనే కథరాశాడు.

దెబ్బయిమంది రాజబంధువుల శరీరాలు నేలమీదపరిచిన రేనుకుంట రామిరెడ్డి తనశరీరాన్ని చివరి రక్తపుబొట్టుదాకా రజాకార్ వ్యతిరేకపోరాటానికి వినియోగించాడు. దళంలోవున్న సీతమ్మగూడా శత్రువుచేతిలో అవమానంపొందినా సంగంకోసం నిబ్బరంగా చావునేకోరింది. శత్రువుచేతి అవమానంకన్న స్వేచ్ఛకోసం మరణాన్ని ఆహ్వానించింది. ఇక వీరప్ప ఐతే తానుమరణిస్తూగూడ పక్కనున్న సార్జంటుమీదికిదూకి తనవూపిరి ఆగేంతలోపల వాడివూపిరిగూడ ఆగేట్టు గొంతుపిసికి చంపాడు.

గోపాలరావూ మిగతాగెరిల్లాలు రజాకార్లచేతిలోని తుపాకులులాక్కొని మదమలతో మోదిచంపారు. కారణం వారికి తుపాకీకాల్చటంరాదు. ఇలాంటి ఘట్టాలు అనేకం అనుభవించిన రజాకార్లు పిక్కబలం చూపారు. బయొనెట్ పీపులోదిగిన గోపాలరావు రక్తజిహ్వకతో దళనాయకునికీ, పార్టీకి తుది అభివందనాలుతెలిపి మరణించాడు.

ప్రయాగ 'నవజాగృతి' కథలో రేనుకుంట రామిరెడ్డి కథనిచిత్రించాడు. రామిరెడ్డి ధనికరైతు. తోటి ధనికరైతుల్ని మూటకోడూరులో రజాకార్లు చంపటంచూసి రజాకార్ సైన్యంతో పోరాటం ప్రారంభించాడు. గెరిల్లాదళాన్ని తయారుచేసి తానే నాయకత్వం వహించాడు. అతనిలాంటి ధనికరైతులు సైతం పేదలపోరాటంలో పాల్గొ

నక తప్పలేదంటే జాగీర్దారీ వ్యవస్థలో ధనికరైతులుగూడ పీడింపబడేవారనేఅర్థం. అందువల్లే వారుగూడ ఒకమేరకు ప్రజలతో కలిసిపోకతప్పలేదు.

'గెరిల్లా' గోవిందుకథలో చిత్రితమైన విషయం ఊహాపోహకాదు గెరిల్లాలు రజాకార్ నాయకునివేషంలోవచ్చి రజాకార్లని ఖంగుతినిప్పించటం ఉత్సాహాన్ని కలిగించే విషయం. జానపదకథల్లో నాయకులు ఇలాగే ప్రవర్తిస్తారు.

తెలంగాణ పోరాటకాలంలో గెరిల్లాలు శత్రువును యుక్తితో మోసగించటం మనం అనేక సందర్భాల్లో చూస్తాం. రజాకార్లు, సైన్యం వచ్చేతోవలో రోడ్డుకు అడ్డంగా గోతులుతీసి ట్రక్కులు నడవకుండా చెయ్యటం, అవి ఆ గోతిదాకావచ్చి ఆగిపోగానే గెరిల్లాలు వాటిమీద దాడిచెయ్యటం జరిగిన విషయాలే. ఇలాంటి సంఘటనలు ప్రజలు ఉత్సాహాన్ని పొందటానికి తోడ్పడుతాయి.

తెన్నేటిసూరి 'సంధిలేదు' అనే కథలో రుద్రి అనే రెడ్డివారింటి ఆడపడుచు రజాకార్లవల్ల నడివీధిలో మానభంగం చేయబడి ఆ అవమానకారంవల్ల కుపితురాలై గెరిల్లాగా మారుతుంది. ఐతే ఆమెకీ పార్టీకి సంబంధంవున్నట్లు కథలో ఎక్కడాలేదు.

ఆమెను వెతుకుతూ ఆమెభర్త వచ్చినప్పుడు ఇతరులు ఎంగిలిచేసిన ఈ పాడు శరీరం నీకెందుకు అనటంచూస్తే ఆమెలో కొన్ని సాంప్రదాయిక విశ్వాసాలు వున్నట్టు తోస్తుంది. అయితే ఒక స్త్రీ బలవంతంగా చెరచబడటంలో ఆమె బాధ్యత ఎంత వరకుంటుంది?

స్త్రీని దారుణంగా అవమానించటంకోసం మానభంగం చేసేదీ భూస్వామ్య వ్యవస్థే, మళ్ళీ తాను అవమానించిన స్త్రీని అందరూ అవమానించాలని శాసించేదిగూడ ఆ భూస్వామ్యవ్యవస్థే.

ఉప్పల లక్ష్మణరావుగారి 'గెరిల్లా' కథకీ, ఈ కథకీ చాలాతేడావుంది. 'గెరిల్లా'లో వున్న అనేక జీవితాంశాలు ఈ కథలోలేవు. రెండూ పూర్తిగా పోరాట జీవితానికి చెందిన కథలే. పోతే ఈ రెంటికీవున్న ముఖ్యమైనతేడా 'గెరిల్లా'లో వున్న పార్టీ, ప్రజల ప్రమేయం 'సంధిలేదు'లో లేవు.

భూస్వామ్య కుటుంబంనించే వచ్చిన ఇద్దరుస్త్రీలు ఈ కథల్లో నాయికలు. ఐతే 'గెరిల్లా' పార్వతి అవగాహన ఆలోచనలవల్ల పోరాటంలోకి వచ్చింది. ఆమె జీవితం లోని 'చల్లనివెన్నెల విరులు.... చలవపలుకులు.... వేడికావలింపులు' అన్నీ వ్యవస్థ కిరాతకత్వం మింగేసింది. ఆమె ఆ వ్యవస్థమీద పగబూనిందంటే దానిక్కారణం పార్టీ మార్గదర్శకత్వం. అందువల్ల పార్వతి సామాజిక శక్తిలో భాగం కాగలిగింది

రుద్రి అలాకాదు. ఆమె తనకు జరిగిన అవమానాన్ని వ్యక్తిగతంగా తీసుకుని ప్రతీకారంగూడ వ్యక్తిగతంగా తీర్చుకుంది.

ఒకరు వ్యష్టివాదంనుంచీ మరొకరు సమిష్టివాదంనుంచీ ఎదిగారు. తెలంగాణ పోరాటకథల్లో ఈ కథఉండటం ఆ సంఘటనను రికార్డుచెయ్యటానికైతే ఫర్వాలేదుగాని చారిత్రిక అవగాహనా దృష్టితో మాత్రం లోపం.

గెరిల్లాలకి మద్దతుగా వడిసెలతో సైతం పోరాడి ప్రాణాలర్పించిన స్త్రీలెందరో ఆ పోరాటంలో వున్నారు. ప్రజలు ఇలా కార్యకర్తల్ని కంటికిరెప్పలా కాపాడుకున్నారంటే ఆ పోరాటం ఎవరి ప్రయోజనాలకు వ్యతిరేకంగా సాగిందో, ప్రజలు పార్టీని ఎలాకాపాడుకున్నారో తెలుస్తుంది.

మిలిటరీరాకను గమనించడానికి దళం 'వేగు'లను కూడా నియమించింది. మిలిటరీ గనకవస్తే ఊరిబయటనుంచి వేగులు కొమ్ముబూరావూదటం, గ్రామస్తులూ, గ్రామంలోనిదళం పోరాటానికి సిద్ధంకావటం జరిగేది. వేగుపని వార్త అందించటంతోనే ముగిసేదికాదు. వేగుగా వ్యవహరించే స్త్రీయైనా పురుషుడైనా పోరాటం సాగుతుంటే తామూ పోరాటంలోకి దూకేవారు. అందుకని దగ్గర గంపెడుగులకరాళ్ళు, వడిసెలా సిద్ధంగావుండేవి.

పోరాటంలో భాగంగానే గ్రామాల్లో భూమిపంపకం జరిగేది. ఆ భూమికోసం తనవాళ్ళప్రాణాలు కళ్ళముందేపోతున్నా మొండిగాజీవిస్తున్న వాండ్లూ, పోరాటంమీద విశ్వాసంతో జీవిస్తున్నవాండ్లూ భూపంపకంతో కొత్తఆశలు పెంచుకున్నారు. కర్రావులూ, కోడెదూడలు, కొండ్రలు కోల్పోయినవారి జీవితాల్లో పోరాట వసంతం తొంగి చూసింది.

ప్రజలకోసం పనిచేస్తున్న కార్యకర్తలమీద భూస్వాములు గూండాలని ప్రయోగించటంగూడావుంది. కార్యకర్తల్ని హత్యచెయ్యటానికి గూండాలకి ఆయుధాలూ డబ్బూ ఇవ్వబడేవి. పోలీసులూ గూండాలుకలిసి ఉమ్మడిగా గ్రామాలమీద దాడిచేసి పురుషుల్ని హింసించటం స్త్రీలనిచెరచటం మాత్రమేకాక కొరడాల్తోబాదటం, చివరికి చంపటం చేసేవారు.

పోరాటం ఉధృతంగా సాగేదశలో పిరికితనం ఆవరించిన శత్రువు దాన్నిదాచుకోవటానికి క్రూరత్వమెక్కువచూపేవాడు. ఎంత ఏంచేసినా శత్రువు సాధించిందేమీ లేదు ప్రజల ద్వేషంతప్ప।

రజాకార్లసాయంతో అధికారాన్ని నిలుపుకోవటానికి భూస్వాముల ఏజెంట్లు పనిచేసేవిధం 'మత్తానయ్య మరణం'లో వర్ణించబడింది. ప్రజావ్యతిరేకి కావటంవల్ల

మస్తాన్‌ని ప్రజలు నిలదీశారు. పార్టీమాత్రం అతణ్ని క్షమించి వదిలేసింది. దానిక్కారణం అతను భూస్వామిఏజెంటయినప్పటికీ పేదవర్గంనించే వచ్చాడుగనక ప్రజల వైపు రాకపోతాడా అనిభావించటం. కానీ మస్తానయ్య మాత్రం తనమఏపార్టీ, ఏ ప్రజలు క్షమించారో వారిమీదనే కత్తిగట్టి రజాకార్లసాయంతో గ్రామాన్ని హింసించటం ప్రారంభించాడు. వర్గస్వభావాన్ని అర్థంచేసుకునే అవకాశం పార్టీఇచ్చినా అభివృద్ధి నిరోధకుల ఏజెంట్లు కొందరు దాన్నర్థంచేసుకోలేక ప్రజలచేతుల్లో హతమైపోతారు.

మస్తానయ్య దురాగతాలకి తోటికులస్తురైన సుభానుగూడ గురికావటం చూస్తే దోపిడీకి కులమతభేదాలులేవన్నది అర్థమవుతుంది. చివరికి తనని ఉరిదీసే సమయంలో గూడ కమలను గుర్తుపట్టి 'మదమెక్కి ఎడుస్తుంది' అనుకోవటం వాడింకా ప్రజలకి వ్యతిరేకంగానే వున్నాడనటానికి గుర్తు. వాడి ముఖంమీద ప్రజలు ఉమ్మి వాడిపీడ విరగడ చేసినవారిని తలుచుకున్నారు.

తెలంగాణ పోరాటకాలంలో అనేక సంఘటనలు ఇలావున్నాయి. ప్రజాద్రోహుల మీద ప్రజలు కసితీర్చుకున్న అనేక సంఘటనలకు ఇది రూపకల్పన.

'మాభూమి' నాటకంలోగూడ మస్తానయ్య మరణంలోవున్న పాత్రలే వస్తాయి. దానికిగూడ ఈ కథే భూమిక అయివుంటుంది.

తమకు ఇంత అండదండగా నిలుస్తున్న సంగాన్ని ప్రజలు ఎంతో ప్రేమించేవారు. సంఘనాయకులు వూళ్లోకివస్తే ఇంటిపనులన్నీ పెండలాడే తీర్చుకుని నాయకుల మాటలు వినటానికి కూడేవారు.

భూమి సమస్యను చిత్రించిన 'ఆయువుపట్టు' కథ సంగం తన ప్రజలకు భూమిని ఎలాస్వాధీనం చేసిందో చూపుతుంది. ప్రజలకు ఉండే ఉత్సాహమూ, సహజమైన అనుమానాలు ఆ కథలో చిత్రితమయాయి.

ఒక్క రాంరెడ్డివచ్చి చెప్పగానే సాగుతుందా అని ఒకడనటం, మనవెనక పెద్ద కమ్యూనిస్టుపార్టీవుంది అని జవాబుగా ఇంకొకడనటం ప్రజల్లో సంగంపట్ల నెలకొన్న విశ్వాసానికి గుర్తు.

భర్త కాలంలో తాను కోల్పోయిన భూమిని కొడుకుల కాలంలో సంగంవల్ల పొందింది ఒక్క లచ్చమ్మేకాదు. అలాంటి వారెందరో వున్నారు. ఈ పాత్ర రూపకల్పనకి పాలకుర్తి ఐలమ్మ ప్రేరణకావచ్చు.

ఇలాసాగే పోరాట క్రమంలో గాలి వాలునుబట్టి వంగేవాళ్లూ వుంటారు. సంగం బలంగా వున్నప్పుడు ప్రజలతోవుండి తమ ప్రయోజనాలు నెరవేర్చుకుని, వారిమీద

తెలంగాణా పోరాటకాలంనాటి

# మధ్యతరగతి కవిత్వం - ఒక పరిశీలన

ఎస్, కె.

1946 జులై 4 నదొడ్డి కొమురయ్య విస్నూరు దేశ్‌ముఖ్‌చే హత్యచేయబడ డంతో తెలంగాణాలో సాయుధ పోరాటం ప్రారంభమయింది. తెలంగాణాలో సాయుధ పోరాటం మొదలయ్యేనాటికి దేశంలో నెలకొనివున్నదిఒకపరిస్థితిఅయితే తెలంగాణాలోవున్న పరిస్థితి ఒక ప్రత్యేకమైంది. విశిష్టమైంది. చారిత్రికంగానే అది ఆ గుణాలు సంతరించుకున్నది.

కాంగ్రెస్ నాయకత్వంలో బ్రిటిష్ వలసవిధానానికి వ్యతిరేకంగా దేశాన్ని స్వతంత్రం చేసేందుకు సమ్మెలూ సత్యాగ్రహాలు జరుగుతూవుంటే తెలంగాణాలో నిజాంపాలనకు వ్యతిరేకంగా భూస్వామ్యానికి వ్యతిరేకంగా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంలో ప్రజలు తెలంగాణాను విముక్తంచేసేందుకు సాయుధంగా భూమి భుక్తి పోరాటం చేశారు.

దేశవ్యాప్తంగా జరిగిన స్వాతంత్ర్యపోరాటం వలెకాకుండా తెలంగాణాలో జరిగిన పోరాటం భూస్వామ్యవర్గ ప్రయోజనాలకే గొడ్డలిపెట్టు. అందుకే బ్రిటిష్‌పాల

---

రాజ్యాంగయంత్రం హింస అమలుకాగానే మళ్ళీ భూస్వాముల చంకనెక్కిన వాళ్ళు తక్కువేమి కాదు. వీండ్లకు వాస్తవం కన్పించదు. అందుకే యూనియన్ మిలిటరీని టాంకుల్ని సైనికుల్ని చూసి అవి అజేయాలనుకున్నారు. జీవితం ఇచ్చిన ఉదాహరణల్ని గ్రహించలేకపోయారు. ప్రజాజీవితం నుంచి వేరైనవారి చర్యలు ఇలాగేవుంటాయి. వాండ్లకు కళ్ళున్నా గుడ్డితనం తప్పదు.

భారతదేశ చరిత్రలో తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం అపూర్వమైనది. స్వాతంత్ర్యసాధనకు అడ్డంకి పరమత పాలనలోగాక వ్యవస్థలో ఉన్నదని గుర్తించారు తెలంగాణా ప్రజలు. కనుకనే తమను పట్టిపల్లారుస్తున్న భూస్వామ్యం మీదికి తుపాకి పేల్చారు.

ఈ పోరాటాన్ని చిత్రిస్తున్న కథలన్నిటికీ, జీవితానికీ విడదీయరాని సంబంధం వుంది. తెలంగాణా పోరాట కథలు తెలంగాణా పోరాట చరిత్రే తప్ప వేరుకాదు.

అలాగే ఇప్పుడు వస్తున్న ఆదిలాబాద్ కరీంనగర్ పోరాట కథలు ఒకరకంగా తెలంగాణా పోరాట కథల వారసత్వాన్ని అందిపుచ్చుకున్నాయి. అవి అక్కడి ప్రజా జీవితాన్నీ పోరాటాన్నీ చిత్రిస్తున్నాయి.

ఆనాటి తెలంగాణా పోరాటంవలెనే సాహిత్యాన్ని గూడ గతితార్కిక భౌతిక వాద చారిత్రిక దృష్టితో పరిశీలించి ప్రజా సాహిత్యోద్యమాన్ని ప్రజా పోరాటాలకు బాసటగా పరిపుష్టం చెయ్యటమనేది నేటి అవసరం.

నకు మాత్రమే వ్యతిరేకంగా పోరాటంచేసిన, భూస్వామ్య వర్గప్రయోజనాలను కాపాడేనిమిత్తమేవున్న, బూర్జువావర్గ నాయకత్వానికి తెలంగాణాలో చెలరేగిన భూస్వామ్య వ్యతిరేక రైతాంగపోరాటం కన్నెర్రఅయింది. అది పెరిగి పెరిగి దావానలమై ఎక్కడ వ్యాప్తిచెందుతుందోఅన్న ఆందోళన వాళ్ళ వికృతమైన మనస్తత్వాన్ని 'పోలీసు యాక్షన్' పేర బహిర్గతం చేసుకున్నది. నెహ్రూ పటేల్ సైన్యాలు తెలంగాణా గ్రామాల్లో ప్రవేశించి గెరిల్లాలపై, గెరిల్లాదళాలపై, ప్రజలపై పెద్దఎత్తున దాడిచేశాయి. రజాకార్ల ఘాతుకచర్యలను మించిన మరిపించిన మరచిపోలేని దురాగతాలు జరిపినవి. గ్రామదహనాలు సామూహికహత్యలు విచ్చలవిడిగా జరిగినయ్. ఈ కాలంలో తెలంగాణా ప్రజలు చూపినసాహసం చేసినత్యాగం మహోన్నతమైంది. ఈ తరుణంలో పోరాట విరమణపై పార్టీ నాయకత్వంలో పొడసూపిన అభిప్రాయ భేదాలు చల్లగా సాయుధపోరాటాన్ని విరమిస్తున్నట్లు చేసిన పార్టీప్రకటన ప్రజల్ని నిస్పృహాయుల్నిచేస్తే అస్తమిస్తున్న సూర్యుడ్ని సముద్రంకడుపులో దాచుకున్నట్లు ప్రజలు తమ సాయుధపోరాటాన్ని, కడుపుకోతల్ని, రక్తతర్పణాల్ని గుండెల్లో అదుముకున్నారు.

ప్రతిఉద్యమం పునాదిమీదనే కాకుండా ఉపరితల అంశాలమీద ఎట్లా ప్రభావం చూపుతుందో అట్లాగే తెలంగాణా ఉద్యమం సాహిత్యం మీద తన ప్రభావాన్ని వేసింది. ఆ ఉద్యమాన్ని చిత్రిస్తూ అనేకమైన నవలలు, కథలు, నాటికలు, కవితలు, పాటలు వచ్చాయి. తెలంగాణా ఉద్యమకాలంలోనే వచ్చినవి కొన్నైతే తర్వాత ఆఉద్యమాన్ని చిత్రిస్తూ వచ్చినవి యిందులో మరికొన్ని. మళ్ళీ యిందులో రెండువిధాలు. ఒకటి యూనియన్ సైన్యాల ముందు భాగాన్ని మాత్రమే చిత్రిస్తే యూనియన్ సైన్యాల ప్రవేశం తర్వాత కూడా చిత్రించినవి రెండో రకం.

ఈ వ్యాసం పరిధి కేవలం ఆ కాలంనాటి మధ్యతరగతి కవిత్వ పరిశీలన. మధ్యతరగతి నుంచి వచ్చి మధ్యతరగతి భాషలోనే మధ్యతరగతి కొరకు రాసిన లిఖిత సాంప్రదాయానికి చెందినది యీ మధ్యతరగతి కవిత్వం. ఇందులోకి పోయేముందు ఆనాడు జాతీయంగానే కాక అంతర్జాతీయంగావున్న పరిస్థితిని కూడా మనం గుర్తుంచుకోవాలి. రష్యా-విప్లవంవల్ల వచ్చిన సమసమాజభావన, రెండో ప్రపంచ యుద్ధంలో ఫాసిస్టు వ్యతిరేకశక్తుల విజయం, చైనా విప్లవ పోరాటం మధ్యతరగతి కవిత్వంమీద వేసిన ప్రభావం ఆనాటి ఉద్యమాన్ని చిత్రించిన కొన్ని కవితాసంకలనాల్లో మనకు కన్పిస్తుంది.

తెలంగాణా పోరాటం మీద వచ్చిన కవిత్వం ఒకటి ప్రజాకళారూపాల్లో రెండు మధ్యతరగతి కవితారూపాల్లో వచ్చింది.

తెలంగాణా ప్రాంత ప్రజల్నించి వచ్చిన సుద్దాల హనుమంతు, ఆంధ్ర ప్రాంతం నుండి వచ్చిన తిరునగరి రామాంజనేయులు రచనలు ప్రజాకళారూపాలకు ఉదాహరణలుగాచెప్పుకోవచ్చు. అంతేకాకుండా ఆనాడు అనామకమైన ప్రజాకవుల నుండి అసంఖ్యాకమైన ప్రజాకళారూపాలు వచ్చినవి. విరసం ప్రచురించిన తెలంగాణా పోరాట పాటలు మొదటి రెండు సంపుటాల్లో దీన్ని మనం విరివిగా చూడవచ్చు.

కాళోజి నాగొడవ; దాశరది అగ్నిధార, రుద్రవీణ; సోమసుందర్ వజ్రాయుధం; ఆరుద్ర త్వమేవాహం; కుందుర్తి తెలంగాణా; గంగినేని ఉదయిని మొదలైన కవితా సంకలనాలు మధ్యతరగతి కవితారూపాల్లో ప్రధానంగా చెప్పుకోతగ్గవి.

అసలు రహస్యంబొకచోట
కసి బుస రుసరుస లొకచోట

కాళోజీ 'నాగొడవ'

---

అన్యాయ ఆక్రమాలకు, దోపిడీ దౌర్జన్యాలకు వ్యతిరేకంగా వ్యక్తిగా కవిగా కంఠం ఎత్తడంవేరు, వర్గదృక్పథం కలిగివుండడం వేరు. నిజాం నిరంకుశత్వానికి రాచరిక వ్యవస్థకు ఎదురుగానిలిచి జైలుపాలయినా తెలంగాణా కాలంనాటి పైశాచికత్వాన్ని జులుంను తీవ్రంగా నిరసించినా స్పష్టంగా కాళోజికి వర్గరాజకీయాలులేవు, వర్గపోరాట మనస్తత్వంలేదు. అట్లా అవి అతనికున్న ఆవేదనలుగానీ, ఒక ఘోరం జరిగినపుడు అతను విలవిలలాడి పోవడంగానీ తక్కువయినవేమీకావు.

"అవనిపై జరిగేటి అవకతవకలు జూచి
ఎందుకో నామదిని యిన్ని ఆవేదనలు
.... .... .... .... .... ....
అవకతవకలు నేను సవరింపలేనపుడు
'పరుల కష్టాలతో పనియేమిమాక'నెడు
అన్యులగునిదైన హాయిగా మనలేను
ఎందుకో నా హృదిని యిన్ని ఆవేదనలు"- అని కలతపడతాడు.

కంటనీరు పెడతాడు.

"చెమ్మగిలని కనుల బ్రతుకు
కమ్మదనము చాటలేవు
చెమ్మగిలని కనుల బ్రతుకు
కమ్మదనము చూడలేవు

........................

మమతయున్న మనసులోనే

సమతాభావము కలుగును"- అంటాడు. కాని ఎవరికి ఎవరిమీద మమత? బిడ్డకు తల్లిమీదవున్న మమతే ఆర్థికసంబంధాల్లో యింకా అనేకానేకమైన కారణాల్లో వర్గసమాజంలో ఛిన్నాభిన్నమై పోతున్నపుడు

'స్వార్థభావమువీడి సకల మానవసేవ

యొనరించుయోగులే ఉర్వీదేవతలు' అన్న కవితాస్వప్నం ఎట్లా సాధ్యమవుతుంది. అందుకే కాళోజీకి వర్గదృక్పథంలేదు. కాని అతను కాపాడుతున్న కొన్ని నైసర్గిక స్వభావాలవల్ల అతనికి కొన్ని విషయాలు అర్థమయినాయి.

'నర్తకుని నాట్యాలు గాయకుని గానాలు
వాదితుని వాద్యాలు శిల్పకుని శిల్పాలు
చిత్రకుని చిత్రాలు అంగనల అందాలు
కందర్ప కయ్యాలు కవిరాజు కావ్యాలు

కర్షకా! నీ కర్రు కదలినన్నాళ్లె' శ్రమజీవికమమత తను శ్రమజేయడం ఆపేస్తే ఏ ఆనందమూ వుండదంటాడు కాళోజి. అంతేకాదు అతను 1945వ సంవత్సరంలో రాసిన 'కోటగోడలు నేలకూలుతున్నాయి' అన్న కవితలో

'కొరల దెబ్బలుతినుచు గురువు సాపెనవినుచు
బాంచనయ్యా! యనుచు ప్రణమిల్లు ప్రాణాలు
ఇప్పుడిప్పుడె తెప్పరిల్లుచున్నాయి' అంటాడు.

కాని యీ బాంచెన్ బ్రతుకుల తెప్పరింతల్లో వెనుక ఆనాడు సంగం వున్నది. కాని కాళోజి కవితల్లో ఎక్కడా సంగం ప్రసక్తిలేదు. వర్గచైతన్యంతో ప్రజలు చేసిన పోరాటంలేదు. కవిగా స్పందించి ఆనాడు జరిగిన అక్రమాలకు వ్యతిరేకంగా మాత్రం యితని కలం కసిబుసలు కొడుతుంది. 1944లో ఆకునూరు మాచిరెడ్డి పల్లెలో జరిగిన పోలీసుల దౌర్జన్యాలు చూసి

'మాచిరెడ్డిలో ఆకునూరులో
దోచిన మానముచాలింక' అని నిశ్చయం పలుక్తాడు.

కసి కోపం దుఃఖం ఆనందం ఎదురుతిరగడం యివన్నీ మనిషిలో సహజంగా వుంటాయి. అవి ప్రకృతి సహజాలు. మానవుని నైసర్గిక స్వభావాలు, కాని సమాజం కలుషితం అవుతున్నకొద్ది మనిషి నుండి యివన్నీ యిగిరిపోతూవచ్చాయి. మనిషి అన్నిటికి మొద్దుబారుతూ వచ్చాడు. కాని అట్లా కాకుండా యీ నైసర్గిక స్వభావాన్ని కాళోజి కాపాడుకున్నాడు

'మన కొంపలార్చిన మన స్త్రీల చెరచిన
మన పిల్లలను చంపి మనల బంధించిన
మానవాధములను మండలాధీశులను
మరచిపోకుండగా గురుతుంచుకోవాలె
కసి ఆరిపోకుండ బుసకొట్టుచుండాలె
కాలంబురాగానె కాటేసి తీరాలె
'సత్యమ్మహింస'యని సంకోచపడరాదు
'దయయు ధర్మం'బనుచు తడుముకోపనిలేదు
'శాంతి'యని చాటినను శాంతింపగారాదు
క్షమియింప వేడినను క్షమియింపగారాదు
'చాణక్యనీతి' నాచరణలో పెట్టాలె
కాలంబురాగానే కాటేసి తీరాలె
తిట్టినా నాల్కలను చేపట్టికొయ్యాలె
కొంగులాగిన వ్రేళ్ళ కొలిమిలోపెట్టాలె
కన్నుగీటిన కళ్ళ కారాలుచల్లాలె
తన్నిన కాళ్ళను 'దాకలి'గ వాడాలె
కండ కండగ కోసి కాకులకు వెయ్యాలె
కాలంబు రాగానే కాటేసి తీరాలె'- అని 1947 ఆగస్టున నల్లగొండలో

ఐదువందల మందిని నిలువునా కాల్చేసినారని వార్త విని జైలులో రాసిన 'కాటేసితీరాలె' అన్న కవిత. ఇందులో ఆ సంఘటనకు వ్యతిరేకంగా కవి ఎంతకసి ప్రదర్శించాడో మనం గమనించవచ్చు. ఇది కేవలం నైసర్గిక స్వభావ ఫలితమే కాని వర్గచైతన్యంలో భాగంకాదు. ఈ కసిని పోరాట దిశగా మళ్ళించగలిగిన ఆనాటి ప్రధాన ప్రవాహంలో కాళోజీ కలిసి లేకపోవడమే ఇంకా కాలంరాలేదనుకోవడం. చాణక్యనీతిని ఆచరణలో పెట్టాలనడం, ఇది చాలా ప్రధానమైన లోపం.

'నరయుగంబున నాజీవృత్తుల
నగ్ననృత్యమింకెన్నాళ్ళు ?
పోలీసులండను దౌర్జన్యాలు
పోషణబొందే దెన్నాళ్ళు ?' అని ప్రశ్నించిన కవి
'అన్నపురాసులు ఒకచోట
ఆకలిమంటలు ఒకచోట
హంసతూలికలొకచోట

అలసిన దేహాలొకచోట

.......................

అనుభవమంతా ఒకచోట

అధికారంబది ఒకచోట' అన్నంత స్పష్టంగా 'వ్యత్యాసా'న్ని గుర్తించిన మనిషి చరిత్ర గమనాన్ని అందుకోలేదు.

'ప్రపంచ చరిత్రసాంతము
ప్రకటించు నొక్క విషయము
మాంధాతల నాటినుండి
మార్పులేదు యీ జగాన'

తెలంగాణా, దేశం, ప్రపంచం- ప్రాంతీయంగా, దేశీయంగా, అంతర్జాతీయంగా ఆ కాలాల్లో వస్తున్న మార్పు పోరాటాలు త్యాగాలు యివేవీ యితనికి అందనివి. ఒక వైపునుంచే ప్రపంచాన్ని చేసే పరిశీలనయిది. ఒకవైపునుంచేచూసే తనదైన ఓ ప్రపంచం యిది.

'గడియ గడియకు మారుప్రపంచము
గవ్వకూ కొరగాని ప్రపంచము'- ఇది వ్యంగ్యంగా నాణేనికి ఒక ముఖంమీద వచ్చేదమేఅయినా దాని మరోముఖం యీయన కవిత్వం కళ్ళకుకట్టించదు. అయితే అభ్యుదయభావాలు, ప్రగతిశీలభావాలు లేవా అంటే వున్నాయి

'సాగిపోవుటె బ్రతుకు
ఆగిపోవుటె చావు

...........................

తొలగి తోవెవడిచ్చు
త్రోసుకుని పోవలయు

...........................

బ్రతుక దలచిన పోరు
సుతరాం తప్పదు' కానీ యీ ఉత్సాహం యీ చూపు కవికి శాశ్వతమైనవి కావు. ఎందుకంటే ఆ మాటలు ఒక సజీవమైన ఫిలాసఫీ నుంచి వచ్చినవికావు అట్లాగే

'కాలము వ్యర్థముజేయగ కళయవి
వ్రాసే కవితలు చాలింక
కైత చేత మేల్కొల్పకున్న

కాళోజి కాయము చాలింక' అన్నా
'ఉదయం
కావే కాదను కోవటం
నిరాశ
ఉదయించి
అట్లానే వుంటుందనుకోవడం
దురాశ........' అన్నా యివన్నీ వ్యక్తివాద స్వభావ ఫలితాలే కాని వర్గ చైతన్య ప్రతిఫలనలు కావు. అందుకే వాటి ప్రయోజనం చాలా పరిమితమైంది. ఆయన గాంధేయవాది కావటం, ఆయన నిరసన వర్గపోరాట చైతన్యంలో భాగం కాకపోవడం కాళోజి గొడవ.

నిజము నైజాముపై నాడు నిప్పులుమిసి
కాళ్ళ బేరాలతో నేడు కాలమీడ్చు :

## దాశరధి 'అగ్నిధార' 'రుద్రవీణ'

తెలంగాణా పోరాట కాలంలో నిజాంకు వ్యతిరేకంగా బలమైన వాణి విన్పించిన వాడు దాశరధి. భూస్వామ్య వ్యతిరేకత కంటే నిజాం వ్యతిరేకతే యితని తెలంగాణా వస్తువు. అది నిజాంకు వ్యతిరేకంగా

'పేలిన తారా గోళం
రాలిన కన్నీటిచుక్క' అతని అగ్నిధార
'ఓ నిజాము పిశాచమూ కానరాడు
నిన్ను బోలిన రాజు మాకెన్నడేని
తీగలను తెంపి అగ్నిలో దింపినావు
నా తెలంగాణా కోటిరత్నాలవీణ' అని నిజాం పాలనను ముంచెత్తింది. ఆవీణ మీద, ముసలి నక్కకు రాచరికం దక్కదని ఈ తెలంగాణము ఎముకలను నుసి చేసుకుని పొలాలుదున్ని నవాబు ఖోషాణాల్లో బంగారం నింపిన రైతుదని, రాగాలాపన చేస్తాడు దాశరధి. అందుకు ఫలితంగా ఎన్నోమార్లు జైలు పాలయినాడు. ఆ జైలు గోడలమధ్య వాడిపోతున్న పూమొగ్గల మీద పాటలు రాస్తాడు.

తరువాత తరువాతకాలంలో సంక్రాంతులకు దీపావళికి అతని కవిత్వం పూచిన శృంగారపువ్వుకాదు యీ మొగ్గ. అది

'............ సహింపరాని
గ్రీష్మ హేమంతకాల కాళికలెగాని
ఇట ఉషస్సులులేవు. భరింపరాని
అంబువాహ సందోహ వివాశికాని' అన్నట్లువున్న జైలుగోడలమధ్య
గుండె గోడకాకుండా వుండేందుకు గుండెలో పచ్చి ఎండిపోకుండావుండేందుకు 'అట వసంతములేదే' అన్న ఎదురుచూపు మాత్రమే.

వెన్నెలలు లేనపుడు చుక్కలు లేనపుడు ఆకాశశోకవీధి ధూమధామమ్ము దుఃఖ సంగ్రామభూమి అయినపుడు

నీళ్ళలో నిప్పుమాదిరి నిప్పులోన
నీళ్ళమాదిరి. కష్టాలనీడలందు
సుఖము నివసించునట ఉస్సురనువేడి
ఊర్పులోన పరిమళాలున్నవంట' అన్న ఆశ్వాసంలో

ఎండకాలమ్ములో ఎన్నివర్షాలు దాగియున్నవోఅని ఆ యెడారిపొలాలలో యెన్ని గంగలు పొంగునోయని చూడపోయినవాడు, ఆయాసపడు జైలులో యెన్నిప్రజల రాజ్యము లున్నవోయని నిరుపేదవాని నెత్తురుచుక్కలో ఎన్నివిప్లవాలోఅని వెదుక పోయినవాడు దాశరథి.

తెలంగాణాలో స్త్రీల మానాలు రజాకారుగుండాలచే దోచివేయబడ్డవి. నిజాం నవాబుపాలనలో

'....ప్రాక్ పశ్చిమాకాశం ఆవులించి
నెత్తురుకక్కుకున్నది కుత్తుకలకు
కత్తులనుకట్టి వూరేగు కాలరాత్రి
మానభంగాల జెండాలతో నటించె'
'అచట పాపము దౌర్జన్యమావరించి
తెలుగుదేశాన నెత్తురుల్ చిలికివేసె
నా తెలుగు జాతి ప్రాణమానాలుదోచి

ఈ నిజాముపిశాచి కన్నెర్రజేసె' దీనికి వ్యతిరేకంగా నిరసనగా ప్రజలు పోరాటంచేశారు. వాళ్ళు ఎండినడొక్కలవాళ్ళు ఎముకల పోగులవాళ్ళే కావచ్చు. కాని

'గెలిచినది గడ్డిపోచ ముక్కలైపోయి
మన్నుకరచెను గొడ్డలి కన్నులోని

వేడి అభ్రిపు గెలిచెను వాడి కత్తి
వోడిపోయెను..........'

ఇతని కవిత్వంలో సంఘం నిర్వహించిన పాత్రి ప్రిజలు భూమి కోసం భూస్వామ్యానికి వ్యతిరేకంగా చేసిన పోరాటం కన్పించవు. కవిగా మాత్రిమే స్పందిస్తాడు. అందుకే

'ఆకసములోని చుక్కల నాదరించి
ఆకలికి ఏడ్చుదొక్కల నార్పిపిలిచి
తిరుగబడెదను భూమి బొంగరము మీద'

అంటూనే 'ధగ ధగని మండులోక బాంధవునిమీద' గూడా తిరుగబడతానంటాడు. కొన్ని చోట్ల పేదలకు ధనికులకు గీతగీసినట్లు

'అనాదిగా సాగుతోంది
అనంత సంగ్రామం
అనాడిధుకి అగర్బ శ్రీనాధుడికీ మధ్య' అన్నా
'ఒకరాజును గెలిపించుటలో
ఒరిగిన నరకంఠాలెన్నో
శ్రిమజీవుల పచ్చినెత్తురు
తాగని ధనవంతులెందరో' అన్నా ఈ మాటలు వర్గపోరాటచైతన్యం

నుండి వచ్చినవి కావు-

'హిట్లరు, ముసోలినీలు
అట్లీట్రూమన్ల గొంతులలో
ఓట్లడిగి ప్రిభువులై
కోట్లాది పేదలప్రాణాల్తో
చీట్లాడి
మాట్లాడితే, బాయ్
నెట్లా చూపి ఎన్నాళ్ళు' అని ఫాసిజంను ప్రిశ్నించడం గూడా కన్పి

స్తుంది. ఇవన్నీ ఎట్లున్నా అతని కవిత్వం మాత్రిం సూటిగా నిజాంకు వ్యతిరేకంగా

'దిగిపోవోయ్ తెగిపోవోయ్
తెగిపోవోయ్ దిగిపోవోయ్
ఇదేమాట ఇదేమాట
పదే పదే అనేస్తాను' అని ఖదం తొక్కి పదంపాడింది.

'తరతరాల స్వప్నాల సుందర ఫలమ్ము
స్వైరభారత భూమి చూపడెనొలేదొ
విషము గుప్పించినాడు, నొప్పించినాడు
ఈ నిజాంరాజు తరతరాల బూజు' అని రాజరికాన్ని బూజువలె దులిపి పారేసినవాడు దాశరథి.

తెలంగాణా అన్నది దాశరథికి ఒక పోరాటసంకేతం. అందుకే తెలంగాణా దాశరథికి రక్షకవచంకూడా అయింది. లేకుంటే ఇవాళ అగ్నిధారకుముందు

జెండాఒక్కటె మూడువన్నెలది
దేశంబొక్కటె భారతాఖండాసేతు
హిమాచలోర్వర కవిట్కాండమ్ములోనన్
రవీంద్రుడొక్కండె కవీంద్రుడు
ఊర్జిత జగద్యుద్ధాలలో శాంతి
కోదండోద్యమ ద్విజయుండు
గాంధి ఒకడేతల్లి' అని సిగ్గుమాలిన పద్యం పాడగలిగే వాడు కాదు. మావో కవితని అనువాదం చేసినవాడు ఆస్థాన కవిగా మంత్రి ప్రభువుల అడుగులకు మడుగులొత్తేవాడు కాదు. అతని మాటల్లోనే చెప్పాలంటే

'కాలపు కళ్ళెమును లాగి
కదం వెనక్కుతొక్కించే
ఘనులంతా నడుంవిరిగి
కదల్లేక నశించారు' ఇవాళ దాశరధీ అంతే.

పిడుగు నిప్పులు చెరగి
విలువ నీరై పోయె
సోమసుందర్ 'వజ్రాయుధం'

సమధర్మం, బానిసలదండయాత్ర, మలయా ప్రభంజనంపేరిట సోమసుందర్ వజ్రాయుధం. ఇందులో 'బానిసల దండయాత్ర' మాత్రమే తెలంగాణాను ఉద్దేశించి రాసింది, 'మలయా ప్రభంజనం' మలయపోరాటం గురించి, 'సమధర్మం' రష్యావిప్లవం తెచ్చిన నవసమాజభావనను అనుసరించి వచ్చిన కవితా భాగాలు.

సోమసుందర్ మీద రష్యావిప్లవ ప్రభావం ప్రగాఢంగా వుందనడానికి ఉదాహరణ 'సమధర్మం'

'... ఫ్యాక్టరీలుచేసే
గందరగోళంలో
అగణిత కార్మిక హృదయాందోళన' గమనించాడు కవి తన'ఫ్యాక్టరీ' అన్న గేయంలో. అందులోనే

'....దేవుడు ధనస్వామ్య నమ్మినబంటై
పేదల, అన్నార్తుల దీనారావముల
శ్రవణాలకు చేరువకానీయడు,
(దేవుని శ్రవణపుటమ్ముల
కరగించిన సీసం
పోశాడట ధనస్వామి) అనడంలో ధనస్వాములు తమధనంతో దేవుడిని కూడా మాట్లాడకుండా చేశారనిచెప్పడం వుద్దేశమయినా దేవుని అస్తిత్వాన్ని నిరాకరించడంలో మాత్రం రచయిత తప్పుడుఅవగాహన కల్పిస్తుంది.

'చరిత్ర నీకోసం ప్రసవబాధపడుతున్నది
........................
రక్తం అర్పించుము నరుడా
నీ త్యాగం వృధాకాదు'అని 'నవసమాజ వ్యవస్థకు బీజాక్షర నామకరణ మహోత్సవం' చేస్తూ 'ఖరార్‌నామా' ప్రకటిస్తాడు. వర్గరహిత స్వర్గం స్థాపించడమన్నది తన 'లోపలికోరిక'గా తెలియజేస్తాడు.

'సమధర్మం'లో భగత్సింగ్‌మీద, లెనిన్ మీద 'ధృవతార' అన్న పేరుతో కూడుకున్నకొన్ని యితర కవితలున్నాయి. ఆనాడు అంతర్జాతీయంగావున్న రష్యా విప్లవప్రభావం ఈ 'సమధర్మం'

ఈ 'సమధర్మం' ప్రభావమే తెలంగాణాగూర్చి రాసిన 'బానిసల దండయాత్ర' మీద పరచుకున్నది. 'బానిసల దండయాత్ర'లోని మొదటి కవితలో

రెండు ప్రపంచాల మధ్య
రెండు స్వభావాల మధ్య
రెండే వర్గాల మధ్య
సాగుతున్న సంఘర్షణ'గా దీన్ని స్పష్టం చేశాడు

ఆనాటి తెలంగాణాలో రజాకార్లు భూస్వాములు కల్సి హత్యాపాతకాలు చేశారు. గ్రామాలకు గ్రామాల్ని దోచారు.

'రాక్షసులు రాక్షసులు
రాజీలు పడ్డారు
ఘోర హత్యకు మనల గురిచేసినారు
.... .... .... .... ....
దొంగలంతాకల్సి గ్రామాలు దోచారు' అని వీరి మిలాఖత్ గురించి

చెపుతూ

'లేవండి లేవండి
ఆయుధాల్ తీయండి
తీయండి తీయండి
రాక్షసుల ప్రాణాలు' అంటాడు, 'విశాలాంధ్రలో స్వర్గం', విశా

లాంధ్రలో ప్రజాస్వామ్యం' అప్పటి అతని కవితా స్వప్నం.

ఆనాడు తెలంగాణాలో మతరాజకీయాలు వున్నవన్న మాట స్వార్థంతో ప్రచారం చేయబడ్డది. నిజానికి హిందువైనా, ముస్లిమైనా వాళ్ళ మధ్య గీతగీసింది మతం కాదు ఆర్థికం, పేదలైన ముస్లింలంతా పేదలయిన హిందువులంతా ఎప్పుడూ ఒక్కటి, అట్లాగే ఆనాడు కూడా 'సంఘం' నీడలో వాళ్ళు ఒకటిగా వున్నారు.

'బానిసత్వ విముక్తికై
రాక్షసత్వ నాశనంకై
హిందూ ముస్లిం పీడిత శ్రమజీవులు
ఏకమైరి'

కేవలం నైజాం వ్యతిరేకత కాకుండా దేశ్‌ముఖ్‌ల దొరల ప్రతిఘటించి ప్రజా కోటి పోరుతున్నకాలం. ఆ పోరాటంలో ఎందరో అమరులయ్యారు.

'ఒక వీరుడు మరణిస్తే
వేలకొలది ప్రభవింతురు
ఒక నెత్తుటి బొట్టులోనే
ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లు' అని చెప్తూ దొడ్డి కొమురయ్య,

అనంతయ్యల వీరమరణం గూర్చి

'చరిత్రలో చరిత్రలో
చిరస్థాయిగ వసిస్తారని' కీర్తిస్తాడు. ఈ ప్రజాశక్తి ముందు మెషిన్ గనులు, మందుగుండు ఫిరంగులు మట్టికలుస్తాయి.

'మెషిన్‌గన్లు, మరఫిరంగి
తుపాకులూ, విషవాయువు
ప్రజాశక్తి నాపలేవు'

జనగామ పోరాట గ్రామం, గ్రామాన్ని చుట్టుముట్టిన శత్రువులు 'పసిగందు గుండెలవి పిండిపేల్చేస్తే 'మిసిమియువతుల ఉరోజముల చీల్చేస్తే' 'జనగామరక్తమై' 'పైశాచభుక్తమై వున్నస్థితిలో

'అతడెవరు అతడెవరు
జనగామలో జమ్మికొమ్మపై ఎక్కాడు
అతడెవరు అతడెవరు' అతడు తెలంగాణా గెరిల్లాల నాయకుడు.

అది ఇంటికొక మానవుడు యోధుడై నిలిచి జనగామ వీరుల సమూహమై విప్లవ ప్రవాహమై పొంగినకాలం. అపుడు

'పుడమి గర్జించింది
పుడమ గర్జించింది'
జనాలు
'మృత్యువు జయించారు
హత్యను జయించారు'

ఎందరో పోరాటకాలంలో అడవులకు వెళ్ళిపోయారు. గెరిల్లాలుగా దళాల్లో చేరిపోయారు. గుహల్లో కొండల్లో తలదాచుకుని మృత్యువుతో తలపడ్డారు. అసువు లర్పించారు.

'మరణించిన మన తమ్ముల
ఆత్మల ఆనందానికి
పిడికిలిబిగించి నేడే
పోరాటం సాగిద్దాం
నాజీ నైజాం రాక్షస రజాకార్ల
పోలీసుల ద్రోహుల రక్తంతో
మన తమ్ముల ఆత్మశాంతికి
దోసిళ్ళతో తర్పణమిద్దాం'
పురుషులేకాదు స్త్రీలుకూడా సమరభూమిలో నిలిచారు.
'సమరభూమి విజయానందంవలె వనితలు
ఎక్కిడిన ధనస్సులైన వనితలు

రక్కసులకు ప్రళయకాల కాళికలై
భయపెట్టే నారీమతల్లులు' వాళ్ళు.

బానిసల దండయాత్రలో బానిసలు సాధారణమానవులు. దోపిడికి దురాగతాలకు గురైనవాళ్ళు. వీళ్ళంతా రాక్షసరాజ్యంలో నెత్తురు వెచ్చించిన బందీలు. చచ్చిన బందీలవారసులు. వీళ్ళంతా నిరాయుధులు, నిరపరాధులు, వీళ్ళు

'చీకట్లో చీకటివలె మసులుతారు
చీకట్లో ఎర్రవిభూతాలై
దానవులను మాన్రులవలె కూలుస్తారు'
వీళ్ళవల్ల
'తెలుగుతల్లి పసిడికావ్పు
కొత్త పంట ధరిస్తుంది
నవజీవం సుమిస్తుంది

ఈ యాగం ఫలిస్తుంది' ఈ విషయంలో సంఘం నిర్వహించిన పాత్ర ఎనలేనిది. రైతులు పేదలు సంఘంనీడలో సంఘటితమై బంజర్లను బీళ్ళను తమవిగా చేసుకున్నారు. అది

'పుడమితల్లి పసిడిపంట
మానవులంతా కాచుకునే న్యాయం
పుడమితల్లి బంగరు పంటలు
నరులంతా సోదరులై
పంచుకునే ధర్మం' అది
'నల్లగొండలోయల్లో
గుమికూడిన పేదల
కూలిరైతుల సభలో

లక్షమంది వినదించిన కోర్కె' ఈ కోర్కెకు సోమ సుందర్ తన ఏడవ ఖండికలో సజీవరూపమిచ్చాడు. తెలంగాణాలో ఎగిరిన ఎర్రజెండా అతని ఎనిమిదవ ఖండికకాని 'పోలీసు యాక్షన్'ను ఆహ్వానించిన సోమసుందర్ తన జీవితంలో తెల్లజెండాఎత్తాడు. 'ఖరార్ నామా' అన్న తనగేయంలో 'తన చరిత్ర చెరిపేసుక / తన దారినవెళిపోయే మానవుడిక / పుట్టబోడు / సుడిగుండంలోపడి తిరుగడు' అని తను చెప్పుతున్నట్లుగా కాక తన చరిత్ర తను చెరిపేసుక సుడిగుండంలోపడి తిరుగుతున్నాడు సోమ సుందర్.

"నైజాం పైశాచిక నిర్బంధాల నుంచి
తెలుగుజాతిని విముక్తం చేయడానికి
అకుంఠిత దీక్షతో పోరాడి
తమ సర్వస్వాన్ని సమర్పించిన
అమరవీరులందరికీ-
తెలంగాణా పోరాట జ్యోతిగా భాసించిన
శ్రామికజన మహానాయకులు
శ్రీరావి నారాయణరెడ్డి గారికి
హృదయనీరాజనంగా" వజ్రాయుధాన్ని అంకితమిస్తూ అమరవీరు లందరినీ ఒకఎత్తు అమరవీరుల ఆశయానికి ఆకాంక్షకు ద్రోహంచేసిన రావినారాయణ రెడ్డిని ఒక ఎత్తు చేయడం తెలంగాణా పోరాట చరిత్రకు సోమ సుందర్ చేసిన విద్రోహం.

సూదెక్కని వెయిన్
అయినవ్
నువ్వేనేనవ్
బ్రెయిన్:

## ఆరుద్ర 'త్వమేవాహం'

ఆరుద్ర త్వమేవాహానికి 'ఒక లఘుటిప్పణి' రాస్తూ శ్రీశ్రీ 'త్వమేవాహం కావ్యానికి కాలమే ప్రధానవస్తువు. తెలంగాణా అప్పుడు ఒక అల్పక్షణంగా మారిపోతుంది' అని 'సమకాలిక సంక్షోభంతో కవి అవినాభావసంబంధం మృత్యువునుకూడా అధిగమించి కాలంతో తన ఏకత్వాన్ని స్థాపించుకుంటుంది' అని చెప్పినదృష్టి ఎట్లావున్నా ఈ అనంతమైన కాలంలో జరిగిన చరిత్రల్లో తెలంగాణామాత్రం కవికి ఒక స్వల్పక్షణం హృదయావేదనను అనుభూతిని కలిగించి కదిలించి త్వమేవాహం కావ్యంరాయించింది.

దాశరథికి 'కవిహృదయం' అన్నలేఖలో ఆరుద్ర రాసిందానిప్రకారం 1948 వ సంవత్సరం జూలై 10న కృష్ణాపత్రికలో 'నాకాసిగ్గు నాస్త్రీత్వం ఎప్పుడోపోయింది' అనే పతాకతో రజాకార్లచే చెరచబడ్డ స్త్రీ కదనం ఒకటి అచ్చయింది. రైల్లోజరిగిన ఒక దుర్భర యదార్థదృశ్యాన్ని కళ్ళారా చూసిన ఒక ప్రయాణీకుడుపంపిన రిపోర్టది. ఈ రిపోర్టు అర్థాన్ని

'ఆలోచన్ల ట్రెయిన్లో, ట్రెయిన్లో
పురుషుల III క్లాస్ బోగీలో, చెట్లను గురించి

ఛిద్రపెలుకల గురించి, చెదపురుగుల గురించి
చిన్న చిన్న చీమల గురించి, సంభాషణ
రెయిన్లో, రెయిల్లో, వెయిన్నులేని మగాళ్ళముందు
చెదపురుగులుకాని మగాళ్ళముందు
నిటారుగా నుంచొని తన బట్టలు నింపాదిగా
తాపీగా ఒలచుకునే నిటారుగా విస్సిగ్గుగా

నించొనే నీతిమంతురాలు' అని త్వమేవాహం కావ్యంలో చిత్రించి నట్లు 'కవి హృదయం'లో కవే చెప్పుకున్నాడు. అట్లాగే ఈ వార్త చదివాక త్వమేవాహం మొదలుపెట్టినట్లుగా కూడా చెప్పుకున్నాడు. అయితే ఈ వార్తే మరి చదివి వుండకపోతే ఆరుద్ర త్వమేవాహం రాసివుండకపోయేవాడా ! అన్న ప్రశ్నకంటే ఒక వార్తే త్వమేవాహం కావ్యం రాయిస్తుందా అన్నది ప్రధానమైంది. ఎందుకంటే దేశ వ్యాప్తంగా తనవైపు దృష్టిని తిప్పుకునేట్టు రగిలి రగిలి ఒక్కసారి బద్దలైన తెలంగాణా ఒక సంఘటనని కాదు అనేకానేకమైన సంఘటనల్ని, దుర్భర దుఃఖాల్ని, దుస్సహ వేదనల్ని, అపూర్వమైన పోరాటాల్ని, త్యాగాల్ని కలిగివున్నది. కనుక మద్రాసులో వున్నా దేశంలో మరింకే మూలున్నా దీని గురించిన ఏదో ఓవార్త అందకుండాపోదు ముఖ్యంగా కవి అన్నవాడ్ని కదిలించకుండాపోదు. అట్లాగే ఆరుద్రను కృష్ణాపత్రికలో వార్త కాకుంటే మరింకేదో వార్త ఏదో ఓ విధంగా చేరివుండేది. త్వమేవాహం రాయించి వుండేది. కాని అంతపెద్ద తెలంగాణా పోరాట జీవితగాధను ఒక్క సంఘటన, విన్నసంఘటనో, చదివిన సంఘటనో, చిత్రించేందుకు నేపథ్యం కాగలదా ! అని ప్రశ్నించుకుంటే కాగలదనే సమాధానం చెప్పుకోవచ్చు. కాని ఆ సంఘటన అంత పోరాట చరిత్రను ప్రతిబింబించేది అయివుండాలి అట్లాగే ఆ సంఘటనకు చలించి పోయిన రచయితక్కూడా అది అతని రక్తంలో ప్రవహించినంత యదార్ధంగా శక్తివంతంగా చిత్రించగల సమర్థతవుండాలి. ఈ రెండూ, త్వమేవాహం రాయించడానికి కారణమైన సంఘటనకుగాని దాన్ని చిత్రీకరించిన రచయితకుగానీ లేవు. రచయిత ఎంచుకున్న రచనాపద్ధతే యిందుకు రుజువు. తనలో తెలంగాణా విషయంలోవున్న అసమగ్రతను డొల్లతనాన్ని కప్పిపెట్టుకునే ప్రయాసే యిందులోని గారడీ అంతా.

'స్పేనిష్ సివిల్ వార్' యూరప్‌లోని మేధావులను కదిలించినట్లు తెలంగాణా భారత కవులని కదిలించగల్గిందని ఆరుద్ర చెప్పినా త్వమేవాహం రాసేప్పుడు ఆరుద్ర 'స్పైనల్ కార్డులో' 'స్పెయిన్' కదిలినా బాగుండేది.

'ఇది తెలంగాణామీది కావ్యం అని రచయిత ఎక్కడా చెప్పలేదు, కాని కావ్యం నిండా ఈ విషయం తెల్పుకోవడానికి ఎన్నో అవకాశాలుయిచ్చాడు' అంటూ

'ఈ కాంతను చెరపట్టగ రాకాసులు తలపెట్టిరి'

'నక్కలు తిరిగేతోటలో........ రాకాసిరాజొకడుండెరా' అన్నవి తెలంగాణా గురించి త్వమేవాహం ఆరుద్ర రాశాడని చెప్పడానికి ఉదాహరణలని శ్రీశ్రీ 'ఒక లఘుటిప్పణి'లో రాశాడు. కాని ఆరుద్ర త్వమేవాహానికి మొదలు పెట్టిన పేరు 'తెలంగాణా'నే దీన్ని త్వమేవాహంగా మార్పించింది శ్రీశ్రీ. ఇట్లా పూర్వమని తానేసలహా యిచ్చినట్లు శ్రీశ్రీయే చెప్పుకున్నాడు. ఇట్లాంటి ఉదాహరణలు వున్నమాట నిజమేకాని ఏ లఘుటిప్పణులు, కవిహృదయాలు, వ్యాఖ్యలులేకుండా చదివితే మామూలు పాఠకుని మాట అటుంచి కొంతఎదిగిన పాఠకునికైనా ఇది అర్థంకాదు. 'నీ కొన్ని పద్యాలని, బైరాగిని, త్వమేవాహాన్ని ప్రజలు ఎందుకు అర్థంచేసుకోరో నాకిమధ్యబాగా ఆలోచించాక తెలిసింది....' అని దాశరధికి లేఖరాశాడు ఆరుద్ర. ఇది ఆరుద్ర ప్రజల గురించి రాసిందా? లేసి ప్రజలకోసం రాసిందా? అట్లా అని ఆరుద్రకు ప్రజలకు బోధపడ్డానికి 'శిల్పాన్ని విసర్జించి సులభగ్రాహ్యంగా రాయాలి' అని అన్పించక పోలేదు. అట్లాగే '....ప్రజాకవిత్వానికీ, అభ్యుదయ కవిత్వానికి తేడావుంది' అనికూడా తెలియక పోలేదు. 'నెరా నెరా నెరబండి' అనేపాట సులువుగా ప్రజలకు అర్థమవుతుంది కాని ఇది అభ్యుదయ కవిత్వమా!' అని ప్రశ్నించుకుని 'కాదు' అని తనే జవాబు చెప్తాడు అట్లాగే కాళహస్తీశ్వర శతకం ప్రజాకవిత్వం కాకపోవచ్చుకాని కొట్టిపారేయడానికి వీలులేదంటాడు. 'ప్రజాకవిత్వానికీ, అభ్యుదయకవిత్వానికి తేడావుంది. ప్రజాకవిత్వం అయిన్నీ అభ్యుదయ కవిత్వం కాకపోవచ్చు. అభ్యుదయకవిత్వం అయిన్నీ ప్రజాకవిత్వం కాకపోవచ్చు' అంటాడు అంటే "నెరా నెరా నెరబండి" అన్నది అభ్యుదయ కవిత్వం కాకపోవడానికి కారణం అందులో విషయమని, ధూర్జటి కాళహస్తీశ్వర శతకం రూపంఏమయినా కొట్టిపారేయడానికి వీలులేదన్న కారణం అందులో వున్న భావమనిఅర్థం. అంటే రూపంఎట్లున్నా త్వమేవాహం విషయందృష్ట్యా తోసిపారెయ్యడానికి వీలులేనిది. మంచిదే, కానీ యింతవివరంగాదీన్ని ఎందుకు చెప్పాల్సి వచ్చిందీ అంటే ఆరుద్ర విషయాన్ని అనుసరించే రూపంవుంటుంది అన్న విషయాన్ని గాని విప్లవ వస్తువు జాతీయరూపం అన్న విషయాన్ని గానీ దృష్టిలో వుంచుకోకపోవడం వల్లనే 'జీర్ణమంగే సుభాషితం' అనిగాని, ఎవరూ తనకావ్యాన్ని అర్థంచేసుకోవడం లేదేఅనీ వాపోవడానికిగాని, "మాధవా మరలనిమ్ము అని రథాన్ని తిప్పేద్దామనుకుంటానుగాని నీలాంటివాళ్ళు సాయపడతానంటే వేరేం కావాలి?" అని దాశరథి "వ్యాఖ్య" మీద ఆధారపడడానికిగాని కారణమైంది. నిజానికి అభ్యుదయ కవిత్వానికి ప్రజాకవిత్వానికీవున్న తేడా ఆరుద్ర చెప్పినట్లు వైరుధ్యానికి సంబంధించిందికాదు స్థాయికి సంబంధించింది, అభ్యుదయాంశ అనివార్యంగా ప్రజా

పరం కావాల్సి వుంటుంది. అభ్యుదయ భావన ప్రజాచైతన్యంలో భాగం కావాలంటే ప్రజా కళారూపాన్ని తీసుకువేస్తాయికి ఎదగాలి. అభ్యుదయకవిత్వమంటే అభ్యుదయ భావాలుకల మేధావులదని ప్రజాకవిత్వమంటే వస్తువుతో నిమిత్తంలేకుండా ప్రజలకు సులభంగా అర్థమయేదని ఒక్కమాటలో జానపదకవిత్వమని ఆరుద్ర అపోహ పడుతున్నాడు. అభ్యుదయ, ప్రజా అనేమాటలు వస్తుపరమైనవే. రూపాన్నిబట్టి అభ్యుదయాంశ ప్రజలను సమీపిస్తుంది.

'Genunine poetry can Communicate before it is understood· అన్న యిలియట్ మాటతో పూర్తిగా ఏకీభవిస్తాను అని చెప్పినట్లుగా త్వమేవాహంలో తెలంగాణాను కవిత్వపరం చేసినా బాగుండేది. అందులో అనుభూతికంటే ఎక్కువగా మెదడుతో చేయించిన సర్కస్‌వున్నది తనశ్రోత ఎవరన్నది అరుద్రే చెప్పాలి, 'కవికి నిజమైనశ్రోత మరొక కవి. కొందరుకవులు తమరచనలకి తామేశ్రోతలై ఏ యిబ్బంది లేకుండావున్నారు' అన్న శ్రీశ్రీ మాటల్ని 'కొట్టిపారెయ్యలేకపోయినా పూర్తిగా నమ్మలేను" అన్న ఆరుద్ర తనకావ్యానికి తానో లేదా దాశరథిలాంటి కవో శ్రోత అయితే త్వమేవాహం గొప్పదేకావచ్చు.

త్వమేవాహంలో కవి కావ్యాన్ని ప్రవాహంగా వూహించాడు. అందులో కాలం ప్రవాహానికి పర్యాయపదం. గడియారం కాలానికి సంకేతం. గడియారం మన సంఘం. గంటలు శ్రీమంతులకు, చిన్నముల్లు వాళ్ళ మనస్తత్వానికి సూచి. నిమిషాలు మధ్యతరగతి వాళ్ళు. పెద్దముల్లు వాళ్ళ భావాలకి బరామీటరు. సెకండ్లు అలగా జనం సెకండ్లముల్లు శ్రామికజన ఫిలాసఫీకి కొలబద్ద. ఇసుక గడియారం నీటి గడియారం పాతకాలపు సంఘాలకు సంకేతాలు. ఇవన్నీ 'కవిహృదయం'లో ఆరుద్ర తెలియజేసినవే. కాకున్నా కొంత ఎదిగిన మనిషి కష్టపడి వాట్ని గుర్తించవచ్చుకూడా. కాని అందరి అనుభూతికి రావాల్సిన తెలంగాణా పోరాట చరిత్రని యింత క్లిష్టం చేయడం వల్ల కావ్యమౌలిక ప్రయోజనం దెబ్బతినిపోయింది. సామాన్యజనాలకి యిది అర్థమవదు.

కాని యీ త్వమేవాహం నాల్గవముద్రణలో హరీంద్రనాథ చటోపాధ్యాయ రచించిన 'వీరతెలంగాణా' గీతానికి "సాగర సంగమం" పేరుతో ఆరుద్ర చేసిన ఆంధ్రానువాదం తెలంగాణాను రూపుకడుతుంది.

సంఘోదయం రగిలించిన ఆరని పోరాట త్యాగాలచితి
యూనియన్ పోలీసుల "ధర్మస్థాపన"కు పట్టిన వచనాల హారతి :

## కుందుర్తి 'తెలంగాణా'

తెలంగాణాలో భూమి సమస్య ప్రధానమైంది. దొరలు భూస్వాములు రకరకాల దోపిడీలతో అమాయకులైన ప్రజల నుండి భూమిని కాజేసి వాళ్ళ జీవితాలను దరిద్రమయం చేశారు.

'అవి పావన గోదావరి జలాలు
అభిషేకించిన కమ్మని పొలాలు కాదు
అవి నిరంతర దరిద్ర జీవితాలు
వలయించిన అమాయకుల నిలయాలు' అటువంటి యీ దరిద్ర జీవితాల్లోకి ఓ కొత్తవెలుగు ఈ అమాయకుల నిలయాలైన పొలాల్లోకి ఓకొత్త వెల్లువ వచ్చింది.

"ఒక పారిన నీటి కణం
ఒక రాజిన నిప్పు కణం
ఇది సమరం తొలిరోజు
బుగ్గలు బుగ్గలుగా పొంగిన ఒక మహానగం
కరుళ్ళు కరుళ్ళుగా లేచిన ఒక అగ్నిపథం" ఇది
"పరమాణువు కడుపుపగిలి
మహాశక్తి జనించిన కాలం"

ఇట్లా రగిలిన పోరాటం భవిష్యత్తు గురించి కుందుర్తికి ఒక ఆశావహ దృష్టి వున్నది

"ఈ పోరాటం భవిష్యత్తు
మానవ సౌభాగ్యం తరులకు విత్తు"
.... .... .... ....
తుది సత్యధర్మ విజయప్రాప్తికి హేతువు"

అనాడు పోరాటంచేసిన ప్రజలు ఒంటరివాళ్ళు కాదు. వాళ్ళవెనుక వాళ్ళను సంఘటితంచేసిన, వాళ్ళకు వర్గ పోరాటచైతన్యంకలిగించిన సంఘంవున్నది. అంతకు ముందు దొరలదగ్గర, దేశ్‌ముఖ్‌లదగ్గర

"వంతుల వరసప్రకారం వెట్టిచేయడం
ఎందుకో ఎవరికీతెలియదు
పండిన పంట మొత్తం పన్నుగాయివ్వడం
ఎందుకో ఎవరికీ తెలియదు
గ్రామాల శీలవతుల్ని చెరిచేహక్కు దేశ్‌ముఖ్‌లకు
ఎక్కడిదో ఎవరికీ తెలియదు
..........................
నంగం వంగిన అన్యాయం పాతమేడ పడిపోకుండా

పోటీపెట్టిన తుపాకులు
ఎవరివో ఎవరికీ తెలియదు
సామాన్యమానవుడు సగర్వంగా
ఫిర్యాదు చేసుకునేదిక్కు ఎక్కడో ఎవరికీ తెలియదు"

అయితే వారి జీవితాల్లోకి సంఘం వచ్చిన తరువాత పరిస్థితి తారుమారైంది. భూస్వాముల నైజం బట్టబయలయింది. వాళ్ళ ప్రజల మీద చేసిన దురాగతాలను దోపిడీని వీలైనన్ని రకాలుగా బహిర్గతం చేసేందుకు సంఘం పూనుకున్నది. ప్రచారదళాలుగా ప్రజలకు తమ జీవన స్థితిగతులను తెలిపింది. అది మారాలంటే ఏంచేయాలో చెప్పింది. ఒక కథకుడు పాడినపాట కుందుర్తి యిట్లా రికార్డు చేశాడు.

"బతుకు పువ్వులో తేనె యేదయా? తుమ్మెద తాగింది
ఆకాశంలో తారలేవయా? మబ్బులు మింగాయి
ఎంత చేసినా వెట్టిచాకిరీ పొట్టనిండదేలా
పండిన గింజలు పన్నుకుపోతే పస్తులు మనకేలా
అరుగాలము కష్టపడిన మన మూపురమని ఏడ్చి
పొలమే దిక్కో తెలియని దొరల గాదెలు నింపేసి
చేవలేని యీ బ్రతుకుపుట్ట చలిచీమలు చేసినకూర్పు
బలవంతపు సర్పాన్నిపట్టుకుని బంధించుటెమనవేర్పు"

దీనితో సంస్థానం అట్టుడికినట్టువుడికిపోయించి. భూస్వాములకు రక్షణగా రజాకారు పోలీసులువచ్చారు. నవాబు ప్రభుత్వం సంఘంమీద ఆంక్షపెట్టింది. చాలామంది అజ్ఞాత వాసంలోకి వెళ్ళిపోయారు. ప్రభుత్వం, భూస్వాములు బైటవున్న ప్రజలమీద పాశవికమైన దౌర్జన్యకాండ చెప్పలేని దురాగతాలు చేశారు.

".... .... .... .... ....
పోలీసు గుడిసెలోకి దూరాడు
గుడిసెముందు అధికారి యువతిని చెరిచాడు
.... .... .... ....
ఆ అమ్మాయి అవమానంతో గుడిసెలోకి పోయింది
ఉదయం ఆరుగంటలకు చచ్చిపోయింది"
జరిగిన గృహదహనాలకు హత్యలకు లెక్కలేదు.
"నిద్రించే నిండుచూలాలు చూచేసరికి
గదితలుపు బయట గడవేసివుంది

ఉయ్యాల్లో పసిపాప లేచేసరికి
మంటలు తాళ్ళను కొరికేశాయి
.... .... .... .... ....
బయటకు పరుగెత్తుకపోయిన యువకుల్ని
కర్ఫ్యూ కాల్చేసింది
.... .... .... .... ....
నట్టనడిరాత్రిలో సంఘం సూర్యున్ని పట్టుకోను
ప్లాను వేసిన పోలీసులకు
ఎంతకూ దర్శనం దొరకలేదు"

ఎన్ని ఆగడాలు జరిగినా ఎన్నిమానాలుపోయినా ఎందరి ప్రాణాలుపోయినా ప్రజలు సంఘాన్ని కడుపులోపెట్టి దాచుకున్నారు. వాళ్ళమీద జరిగిన తరాల అణచివేతకు బానిసత్వానికి పరిష్కారమార్గం పోరాటమని పోరాటాన్ని కాపాడుకుంటేనే తమకు బతుకన్న చైతన్యం వాళ్ళకు కలిగింది. అది ఒక్కరోజుతో వచ్చిందికాదు. ఒక్కరి సుఖంకోసం వచ్చింది కాదు.

"క్రమక్రమాగత ధనుష్పాణులు ప్రజలు నేడు
సమాజ సమిష్టి ప్రయోజన విశితబాణులు ప్రజలు నేడు"

వాళ్ళు రజాకార్లను ప్రతిఘటించారు. భూస్వాములను ప్రతిఘటించారు. దిగ్విజయం సాధించారు.

"ఈ నేల ఎవ్వరిది
కోటి ప్రజల సొత్తుగదా!" అని భూస్వాముల నుండి తమ భూముల్ని తాము లాగేసుకుని పంచుకున్నారు. మూడువేల గ్రామాలు విముక్తం అయినవి. ఇటువంటి తరుణంలో ప్రజలకు ద్రోహంచేసి కమ్యూనిస్టుపార్టీ పోరాట విరమణ చేసింది. యూనియన్ సైన్యాలు తెలంగాణాలో ప్రవేశించి పోరాటం వదలని ప్రజల్ని జంతువుల్ని వేటాడినట్లు వేటాడింది. 'తెలంగాణా'లో కుందుర్తి కూడా

"అధర్మం తుంచేసి
ధర్మప్రతిష్ఠాపన" కోసం జరిగిన చర్యగా దీన్ని ఆహ్వానించాడు. "తెలంగాణా"కు జరిగిన ద్రోహమిది.

ఏం చెప్పేదినాయనా
ఉద్విగ్నహృదయంలో పోరాటం చిరునామా పోగొట్టుకుని....

## గంగినేని "ఉదయిని"

గంగినేని "ఉదయిని" అరణ్యపర్వం, యుద్ధపర్వం, శాంతిపర్వం అని మూడు భాగాలుగా సాగింది. మహాభారత కావ్యంలోని పర్వానుక్రమణ ఈ విభాగాల వెనుక వున్నదని వేరే చెప్పనవసరంలేదు. ధర్మానికి, అధర్మానికి మధ్య జరిగిన పోరాటమే తెలంగాణా అని కవిస్ఫురింపజేసే ప్రయత్న మనుకుంటానుయిది. నైజాం నిరంకుశ పాలనతో, యూనియన్ మిల్ట్రీ సైన్యాలతో ప్రజలు జరిపిన ధర్మయుద్ధం.

నిజాం పాలనలో ప్రజలు పడ్డ అవస్థలు అరణ్యపర్వంగా, ఆతర్వాత నిజాంను యూనియన్ మిల్ట్రీని ఎదురించడం యుద్ధపర్వంగా కవి రాశాడని అనుకున్నా యీ శాంతి పర్వం ఏమిటో మాత్రం అర్థంకాలేదు. భారతంలోనైతే యుద్ధంలో జరిగిన రక్తపాతానికి రోసి ధర్మరాజు అన్వేషణలో మహాప్రస్థానం చేశాడని చెప్తారు. అయితే చైనా గురించి, గేయం ఈ భాగంలో వుండడంవల్ల శ్రామిక రాజ్యస్థాపనే "శాంతి" అన్నది కవి అభిప్రాయంకావచ్చు.

'మూడునేత్రాలు' అన్నకవితలో

"చీకటి లోతుల్లో లోయల్లో
పుట్టినమేం
ఆకలిగుండెల్లో చాకిరికోరల్లో
పెరిగిన మేం
రాక్షసలోకంలో, రావణరాజ్యంలో
పెరుగుతున్నమేం

చీకటికీ, ఆకలికి ఏలికలకి ఆహూతియా' అని విన్న ప్రశ్నించుకొని 'ఎత్తండ్రి ప్రతీకార సంకల్పంతో ఎర్రబడ్డహస్తాలు'.... అంటూ వేదులో లక్ష చేతులెత్తి ప్రకృతిచేతుల్తో ప్రళయాలు విలయాలు శత్రువులపై కుమ్మరించిన అరణ్య పర్వం "వెళ్లిపోదాం వర్గరహిత భూస్వర్గంలోకి" అంటూ రేపుమఅహ్వానిస్తుంది. ఈ గేయంలో దరిద్రులపై ధనవంతులస్వారీ, దరిద్రుల స్వేదం పారినపంటలపై, దరిద్రుల ఎముకలు నమిలిన ఫ్యాక్టరీలపై, దరిద్రునికండతో ఎదిగిన మేడలపై, దరిద్రుని నెత్తురుగ్రోలిన సౌందర్యంపై వాళ్ళ అధిపత్యం ప్రశ్నించబడుతుంది.

అట్లాగే మృత్యువులా బ్రతుకుచుట్టూ నిలిచిన తుపాకులతో జీవించలేమని, భూదేవి వైశాల్యమంత ఆకలితో, అన్యాయంతో అడుగయినా వేయలేమని నిశ్చయం

ప్రకటిస్తుంది. అయితే అరణ్యపర్వంమొత్తం, అరణ్యపర్వమనేగాదు దాదాపు 'ఉద యిని'లోవున్న కవితలన్నీ భావుకతతో నిండివున్నవి. ప్రియుడు ప్రియురాలికి' అన్న కవితయినా, 'తల్లి తనయునికి' అన్న కవితయినా యిలాంటిదే.

ఆనాటి తెలంగాణా పరిస్థితి హృదయ విదారకమైంది. నిజాం నిరంకుశ పాలన ఒకవైపు, భూస్వాముల దురాగతాలు ఒకవైపు ప్రజల రక్తమాంసాల్ని, మానప్రాణాల్ని దోచుకుంది. వెట్టి, భూముల్ని స్వాహాచేయడం, మానభంగాలు, యివన్నీ అప్పటి దొరల, దేశ్‌ముఖ్‌ల, రజాకార్ల నిత్యకృత్యాలు.

తల్లి తనయునికి రాసిన లేఖలో ఆమె యిట్లాఅంటుంది.

'ఒకరోజు పొద్దుగూకగానే 'వాళ్లొ'చ్చి యింటి మీదపడి
కోడల్ని ఎక్కడికో యీడ్చుకెళ్లారు
గజ గజవణుకుతున్న నేను పొద్దున్నే
వూరంతా కుత కుత లాడేవార్తలు పిచ్చెక్కిస్తే
తల నేలకేసి బాదుకున్నా'

పోరాటంలో పోయిన కొడుక్కి తల్లి రాసిన పుత్తరం ఇది. యిట్లా స్వంత యింటి గురించీ, అనుభవం గురించీ, మాత్రమే కాకుండా, కవిత మొత్తం గ్రామంమీద, గ్రామగ్రామం మీద జరిగిన దురాగతాలు చిత్రిస్తే బావుండేది. పోరాట ప్రాంతాలకు వెళ్ళి పరిశీలించి, పోరాటంతో అవినాభావ సంబంధంవున్న వాడు గంగినేని. కాని కవితావేశం, భావుకత, దీన్నించి అతన్ని దూరంచేసినై. అట్లాగే మొత్తం కావ్యం అంతా గూడా ఎక్కువగా గెరిల్లాల గురించీ, దళాలుగా అరణ్యాలకు వెళ్ళిన వాళ్ళను గురించి వాళ్ళు వీళ్ళకు అనుభవాలను వార్తలుగా పంపడమో, వీళ్ళు వాళ్ళను గురించి ఆరాటాన్ని వ్యక్తంచేయడమో వుంటుంది గానీ భూమి సంబంధాలను గురించి ప్రజలు చేసిన పోరాట ప్రతిఫలన ఈ కావ్యంలో లేదు.

ఈ కావ్యంలోవున్న ఒక గొప్పవిషయం ఏమిటంటే ఈ కావ్యం యూనియన్ సైన్యాలు పోలీస్ యాక్షన్‌పేర నైజాంలో జొరబడడాన్ని పూర్తిగా వ్యతిరేకించింది. యూనియన్ సైన్యాలు చేసిన దాడులను గెరిల్లాదళాలు ఎదుర్కోవడం ఈ కావ్యంలో మనకు కన్పిస్తుంది. 'గెరిల్లాలతో ఒకనిముషం' అన్న గేయంలో

"అంతా క్షేమంగా కులాసాగా వున్నారా ?
ప్రాణమిత్రులారా !
ఎప్పుడూ జాగ్రత్తపై ప్రయాణంచేయండి
నా పంచప్రాణాల్లారా" అనిపిరివి పరామర్శిస్తూ....

"అలజడి, అశాంతి, అన్యాయం ఆక్రందన
పరిపాలనలో మాతృదేవి బందీఅయింది" అనిచెపుతూ........
'మీరుతరచూ చిల్లరవెచ్చాలకువెళ్లే
అడవిపాలెంలో ఎమ్. ఎస్. పి. మాటుబెట్టింది
మీరు రాత్రిలు సంచరిస్తారని తెల్పిన 'జ'
ప్రదేశంచుట్టూ గట్టి పోలీస్‌నిఘావుంది
క్యాంపులో తెల్లజెండాఎత్తిన నాయకుడు
పత్రికలలో విద్రోహప్రకటనలకు ఉపక్రమించాడు.' అని చరిత్రను బట్టబయలు చేస్తాడు. అట్లాగే 'అరచేతిలో మృత్యువన్నది'గూడా గెరిల్లాలమీద రాసిన గేయమే. 'బహిరంగలేఖII' గూడా అజ్ఞాతవాసంచేస్తున్న మిత్రున్నిగురించిరాసిందే.

యుద్ధపర్వంలో 'సిరిమంటలు' కవితలో నిర్దిష్టమయిన స్థితిగతుల్ని ప్రజల యదార్థ జీవిత వ్యధార్థగాధల్నివదిలి, పోరాటంగురించి, భావోద్వేగంతో కవులుచేసే పలవరింపులమీద, ఒకరకంగా తనమీదతనే చేసుకున్నట్లుగావున్న విమర్శకన్పిస్తుంది.

'నేనువాక్కును కొత్తకాంతిని
కొత్తశక్తిని సకలప్రజల కంఠంనేను
సమస్తదీనుల, హీనుల ఒకేగొంతును
దరిద్రం నాకన్నతల్లి
తిరుగుబాటు నా తోబుట్టువు
ఉదయించే మరోజగతి నా తపఃఫలప్రపంచం
నా అక్షర లక్షలు కష్టాల కాష్టంపై
నడిచే పరాధీనులు
విడిచే నిశ్వాస బాధలచితిపై బ్రతుకుతోన్న
బానిసలువ్రాసే వీలునామాలు........
అని కవి తన భావప్రవాహంలో కొట్టుకుపోతూ........

"క్రాంతినివరిస్తాను శాంతినివచిస్తాను" అని మాట్లాడుతోంటే ఒక అపశ్రుతి వినదీసి........

'నావాళ్లొలిచిన, కళ్ళుతోడిన
లోకంకథ చెప్పకవి !
నా మేధస్సు నెమరేసిన
నా ఎముకలుకొరికిన

నర రాబందుల గోరీ త్రవ్వుకవీ!" అంటే మరో అప్రశ్రుతి....
'నరరక్తం బ్రాందీగా, నరచర్మం తివాసీగా
చేసి జల్సాచేసే కిరాతకుల మృత్యు
గాధలు చెప్పుకవీ' అవి పల్కరిస్తుంది. కవి కర్తవ్యం బోధ పరుస్తుంది. తన కళ్ళముందర జీవన్మరణ పోరాటం పర్చుతున్నప్పుడు కవి అను భూతిలో, ఆలాపనలో కళ్ళకు కట్టేట్లుగా అది మొత్తం కాగితం మీదికెక్కాలి. అప్పుడే ఆ కవి కృతకృతుడవుతాడు.

మిగతా ఏ సంకలనాల్లో లేని చైనా గురించి ప్రస్తావన ఈ సంకలనంలో ఉండ డం ప్రత్యేకించి చెప్పుకోవాల్సిన విషయం. తెలంగాణాలో యూనియన్ సైన్యాల ప్రవేశాన్ని ప్రజల మీద జరిపిన అమానుషత్వాన్ని నిర్ద్వంద్వంగా ఖండించినవాడు గంగినేని.

## వ్యక్తీకరణ :

మార్క్సిజం ప్రభావంతో వచ్చిన వాళ్ళు కనుక గంగినేని, కుందుర్తి, ఆరుద్ర, సోమ సుందర్‌లకు ఒక రచనా ప్రణాళిక వున్నది. పూర్తిగా భావవాద ప్రభావం నుంచి బయటపడ్డవాళ్ళు కానందున కుందుర్తి గంగినేనిలపై ప్రాచీన సాంప్రదాయ ప్రభావం, ఆరుద్రపై మన ప్రజాసాంప్రదాయానికి విహితమైన బూర్జువా ప్రభావం కన్పిస్తాయి. కుందుర్తి తన కావ్యాన్ని ప్రస్తావన మొదలుకొని ఉపసంహారం వరకు పర్వాలుగా విభజించాడు. గంగినేనిలో కూడా అరణ్యయుద్ధ శాంతి పర్వాలే కన్పిస్తాయి కాని ప్రజాపర్వం కన్పించదు. ఆరుద్ర సంక్లిష్టమైన గంటల పద్ధతి ఎంచుకున్నాడు.

పద్యాలు, మాత్రాఛందస్సు దాశరథి ఎంచుకున్నరూపం. కాళోజీ నా గొడవ అంతా మాత్రాఛందస్సు. కుందుర్తి తన కావ్యాన్ని మొత్తం వచనంలో రాశాడు. గంగినేని కవితలు కొన్ని వచనంలో కొన్ని మాత్రాఛందస్సులో నడుస్తాయి. ఆరుద్ర త్వమేవాహం కూడా అంతే. సోమ సుందర్ వజ్రాయుధం దాదాపు మొత్తం మాత్రా ఛందస్సుతో కూడివున్నది. కాళోజీలో తక్కువగా కనిపిస్తుండవచ్చుగాని దాదాపు వీళ్ళంతా సంస్కృత సమాసాలు విరివిగా వాడారు. వీళ్ళ భాష ప్రజల భాష కాదు. ఒక్క కవితాసంపుటి కూడా తెలంగాణా మాండలికాన్ని వుపయోగించలేదు. దాశరథిది, సోమసుందర్‌ది, గంగినేనిది బలమైనగొంతు, కుందుర్తి కావ్యమంతా వచనంలో రాయడం ఒక ప్రత్యేకత. కాళోజీలో అనుభూతి తక్కువవుండి స్పష్టత సూటిదనం ఎక్కువగా వుంది. ఆరుద్రది దేశవాళీసరుకుకాదు. ఆరుద్ర మీద బూర్జువా సాహిత్య రీతుల ప్రభావం చూడవచ్చు. గంగినేనిలో భావకవుల ముద్రలెక్కువ. కుందుర్తిలో

అంత్యప్రాసవుంది చాలాచోట్ల అతని వచన కవిత్వంలో కవిత్వం కరువయింది. దాశరథి మాత్రాఛందస్సు కవితల మీద శ్రీశ్రీ ప్రభావం వుంది.

'poetry is the genre easiest to Commit to memory అని ఎక్కడో చదివాను. అది నిజమే అగ్నిధార రుద్రవీణలోని చాలా పద్యాలు జైళ్ళలో అల్లుకుని ఆ తరువాత చాలా కాలానికి నెమరువేసుకుని రాసుకున్నవే అనేముందు 'ఛందస్సువల్ల అవికొన్ని నెలల తరువాత కూడా జ్ఞాపకం వున్నాయి' అని 'అగ్నిధార'కు ముందు దాశరథి రాశాడు.

అతను సాంప్రదాయ ప్రభావంకలిగి విద్యావంతుడు కావడంవల్ల అతనికి జ్ఞాపకానికి రూపం పద్యమయింది. ప్రజలనుండి వాళ్ళ సంస్కృతినుండి వచ్చిన వాళ్ళకు ఆ జ్ఞాపకం పాటగా అల్లుకుంటుంది. పద్యంమీదకాని మాత్రాఛందస్సుమీద కాని మౌఖిక సాంప్రదాయానికి సంబంధించిన ఒక లయ వ్యాపుండడంవల్ల అవి జ్ఞాపకంలో నిలవడానికి కారణమనుకుంటాను.

గీటురాయి:

ప్రజలవిజయంవైపు నడిచినపుడు ప్రజలతో నడిచిన కవులు ప్రజల అపజయాల్లో వెనుకబాటులో ఆటుపోటుల్లో నిరాశా నిస్పృహలకు గురికావడం మధ్య తరగతి స్వభావమే. కమ్యూనిస్టుపార్టీ నాయకత్వ వైఖరిని అవలంబించిన వాళ్ళయినందున గంగినేని, సోమసుందర్, ఆరుద్ర, కుందుర్తి ప్రజల ఆకాంక్షలను ప్రతిఫలించే అర్హతను తర్వాతకాలంలో కోల్పోయారు.

నక్సల్బరీ శ్రీకాకుళ రైతాంగపోరాటాలతో ప్రభావితులై ఉత్తేజాన్ని పొంది ఎందరోకవులు విద్యావంతులు మేధావులు గత దశాబ్దంపైగా విప్లవ సాహిత్య సాంస్కృతికోద్యమాల్లోకివచ్చి తమ కలాలు పదును పెట్టుకుంటున్నారు. మహాప్రస్థానం శ్రీశ్రీ అయినా భువనఘోష రమణారెడ్డి అయినా తిరిగి తెలంగాణా వారసత్వమైన నక్సల్బరీ శ్రీకాకుళాలను స్వీకరించినందువల్లే యీ నాటికీ నిలిచివున్నారు. దిగంబర కవుల్లో ఒక బలమైన గొంతుగా ప్రవేశించి తన పునర్జన్మవంటి కవితతో చెరబండ రాజు చిరస్థాయినందాడు. నక్సల్బరీ శ్రీకాకుళఅనుభవాలతో మధ్యతరగతి కవులు ఉద్యమంలో భాగమై క్రమంగా ప్రజలతో మమేకం అయ్యేస్థాయికి ఎదుగుతున్నారు. ఎదగలేని కొందరు కాలప్రవాహంలో కొట్టుకపోవడం చూస్తూనేవున్నాం. కనుకతెలంగాణైనా నక్సల్బరీ శ్రీకాకుళాలైనా నాయకులే కాదు కవులు కూడా ప్రజలతో నిలువనపుడు బతికుండికూడా అనామకులవుతారని, ద్రోహంచేస్తే ప్రజాశత్రువులు కూడా అవుతారని ప్రజలతో నిలిచినపుడు అతిసామాన్యులు కూడా అసామాన్యులవుతారని రుజువు చేస్తున్నవి.

# తెలంగాణాసాయుధపోరాటం - స్త్రీలు

ఎమ్. రత్నమాల

విలేఖించనిందు నన్ను - తెలంగాణ వీరగాధ
వ్యధలతోనిండిననూ - వ్యాకులత్యాగాలతో
అమాయకులహత్యలతో - సతుల మానభంగాలతో
బరువుతాళలేని జనత - తిరిగి చిందునెత్తురుతో
తడిసిన ఈ అమరగాధ - తడియక ప్రకటించునొకటి
ఇది అంతిమపోరాటం - ఇది సంకులసంగ్రామం

(హరీంద్రనాధ ఛటోపాధ్యాయ)

మూడువేల గ్రామాలను విముక్తంచేసి గ్రామరాజ్యాలు నెలకొల్పి 10 లక్షల ఎకరాలభూమి పంపకంచేసిన ఈ తెలంగాణా సాయుధ ప్రజాపోరాటంలో స్త్రీలు ప్రముఖపాత్ర నిర్వహించారు. 1946 నుంచి 51వరకు జరిగిన ప్రజల సాయుధ ప్రతిఘటనా పోరాటంలోనూ అంతకుముందు 41 నుంచి 46 వరకు జరుగుతున్న ప్రజాపోరాటాల్లోనూ స్త్రీలు పాల్గొన్నారు. పోరాటంలో స్త్రీలు అత్యంత ధైర్యసాహసాలు ప్రదర్శించారు. ఎనలేని త్యాగాలు చేసారు. ముఖ్యంగా 1946 నుంచి 1948 వరకు నైజాం పోలీసులతో జరిపిన పోరాటంలోనూ 1948 నుంచి 51 యూనియన్ సైన్యాలతో జరిపిన పోరాటంలోను స్త్రీలు కీలకమైనపాత్ర నిర్వహించారు, జనాభాలో సగం, పీడితవర్గంలో సగానికిమించిన ఈ స్త్రీలపాత్ర లేకపోతే 46 నుంచి 51 వరకు సాగిన పోరాటం ఇన్నాళ్ళు నిలవగలిగేదికాదు, నైజాంపోలీసులు, రజాకార్లు, దేశ్‌ముఖ్‌ల గూండాలు, యూనియన్‌సైన్యాలు, కాంగ్రెస్‌గూండాలు వేలాదిమంది స్త్రీలనుచెరిచారు. కాన్‌సెంట్రేషన్ క్యాంపుల్లో చిత్రహింసలు పెట్టారు, జైళ్ళలోనిర్బంధించారు. తల్లుల కళ్ళముందే పిల్లలని చంపారు. అయినా పోరాటంలో స్త్రీలు ముందడుగేతప్ప వెనుకడుగు వేయలేదు. పురుషుడి ఆస్తిగా, భోగ్యవస్తువుగా పితృస్వామిక విలువలు తమకు నిర్దేశించినపాత్రని తిరస్కరించి సామాజిక సంబంధాలమార్పుకోసం జరిగిన పోరాటంలో ప్రధానపాత్ర వహించారు. సమాన ప్రతిపత్తికోసం, విలువలూ. సంబంధాలకోసం తమలోతాము పెనుగులాడారు. సమాజాన్ని, కుటుంబాన్ని ధిక్కరించారు. చివరికి పోరాటంలోనూ స్త్రీలపట్ల పాతదృక్పథాన్ని ప్రశ్నించారు.

సామాజిక ఆటుపోట్లు (యుద్ధాలు, తిరుగుబాట్లు) తమ మీద పడవేసిన ప్రభావాన్ని, నిర్బంధాలని, బాధలని, అత్యాచారాలని నిశ్శబ్దంగా భరించిన స్త్రీ సామాజిక మార్పుకోసం పోరాటశక్తిగా, సామాజికశక్తిగా చైతన్యమూర్తిగా ఎదిగిన చరిత్ర గురించి నలభై, నలభై అయిదువేల సభ్యత్వాన్ని కలిగిన మహిళా సంఘాన్ని

నిర్మించిన అనుభవాల గురించి తెలుసుకోవడం ఈ తరానికి చాలా అవసరం. మధ్య లోనే విలిపివేయబడిన ఈ పోరాటం వీరోచిత త్యాగాల పోరాటం మాత్రమే కాదు ఈదేశ ప్రజల విముక్తి పంథాని నిర్దేశించిన ప్రజాపోరాటం. ఆనాటి ప్రజాసంఘాల అనుభవాలు, గుణపాఠాలు నేటి ప్రజా సంఘాలకి ముఖ్యంగా మహిళా ఉద్యమానికి చాలా అవసరం. కానీ ఆనాడు పోరాటంలో పాల్గొన్న స్త్రీలు ఎవరూ తమ అనుభవాలనీ పోరాట చరిత్ర రాయకపోవడం పెద్దలోపం. ఇతరత్రా సమాచారం తక్కువే. 'భారత మహిళా ఉద్యమంలో కమ్యూనిస్టులు 1940-50 (రచయిత్రి రేణూచక్రవర్తి) పుస్తకంలో ఒక అధ్యాయం తెలంగాణా పోరాటంలో స్త్రీల గురించి ఉంది. సుందరయ్యగారు రాసిన వీరతెలంగాణా విప్లవ పోరాట గుణపాఠాలు పుస్తకంలో కూడా ఒక అధ్యాయం స్త్రీల గురించి ఉంది. ఆనాటి అనుభవాలు ఈ తరానికి ఉపయోగించాలంటూ రేణూచక్రవర్తి తన ముందు మాటలో "ఈనాడు మహిళా ఉద్యమంలో పని చేస్తున్న యువతరానికి ఆరోజుల్లో ఉద్యమం ఏ విధంగా నిర్మించడం జరిగిందన్న విషయానికి సంబంధించిన పరిజ్ఞానం ఏమీ లేకపోవడం, ఆనాడు మహిళా ఉద్యమం ఎదుర్కొన్న అనుభవాలు ఈ తరానికి ఉపయోగిస్తాయని భావించడం నేనీసాహసం చేయడానికి మరో ముఖ్యకారణం" అన్నారు. కానీ ఇందుకు ఆమె తీసుకొన్న సమాచారం సుందరయ్యగారి గుణపాఠాలు పుస్తకం, రావినారాయణరెడ్డిగారితో చర్చలు మాత్రమే. తెలంగాణా ప్రజాపోరాటంలో పాల్గొన్న స్త్రీల నుంచిగానీ, మహిళా ఉద్యమ బాధ్యతలను నిర్వహించినవారి నుంచిగానీ సేకరించిన సమాచారంపై ఆధారపడి రాసిందికాదు. కాబట్టి ఈ పుస్తకం చెప్పగలిగింది చాలా స్వల్పం. అసలు మొత్తం మీదనే తెలంగాణా పోరాటంలో స్త్రీల పరిస్థితి గురించిన లిఖిత సమాచారం చాలా తక్కువ. ఇక మనం తెలుసుకోగలిగింది పోరాటంలో పాల్గొన్న స్త్రీలనుంచి. చెప్పగలిగింది వాళ్ళే. ఈ విషయంపై పోరాటంలో పాల్గొన్న వాళ్ళు రాస్తేనే బావుండేది కనీసం ఆకాలానికి చెందిన వాళ్ళయినా అయితే బావుండేది. కానీ తెలుసుకోవలసిన అవసరం చాలావుంది. నిజానికి ఈపనికి నాకున్న అర్హతకంటే అవసరమే ఎక్కువ. ఇంతటి విషయాన్ని పరిశీలించి రాయగల విద్యాస్థాయిగానీ, సిద్ధాంతస్థాయిగానీ నాకు లేవు. ఆనాటి పోరాటంలో పాల్గొన్న స్త్రీలనీ, జీవితాలని చిన్నప్పటి నుంచి చూడ్డం, అనుభవాలని తప్ప పెద్దగా నాకేమీతెలియదు. ఇందుకోసం 'స్త్రీ శక్తి సంఘటన' (హైద్రాబాద్) చేస్తున్న ప్రయత్నం ఈమధ్యే మొదలయింది. ప్రారంభదశలోనే ఉన్నాం. ఇందుకోసం ఈమధ్య మేం రికార్డు చేసిన కొందరి అనుభవాలను ఈ వ్యాసంలో (ఇంకా అన్నీ చేయలేదు కనుక) తీసుకోలేదు. అందుకని వ్యాసము సమగ్రమూ, సంపూర్ణమూ కాదు. ఎక్కువగా ప్రశ్నలు, కొద్దిగా జవాబులు, మరి

కొన్ని ప్రశ్నల కలగలుపే ఈ ప్రయత్నం. అందుకే ఇది కేవలం ఒక పరిచయ పత్రంలాంటిదే.

## ఆనాటి స్త్రీల స్థితి :

నైజాం సంస్థానంలోని 2,25,000 గ్రామాల్లో విద్యా, వైద్య, రవాణా సౌకర్యాలు దాదాపు మృగ్యం. 100కి 40 వంతుల భూమి జాగీర్దార్లు, మక్తేదార్లు, అగ్రహారం దార్ల కింద ఉండేది. అధికపన్నులు (షాదీపట్టీ, సమర్తపట్టీలతోసహా) అర్థం లేని పన్నులు. గ్రామీణ రుణభారం తెలంగాణాలో 89% ఉండేది. 75 అప్పుల్లో 16 (21%) పెళ్ళిళ్ళ సందర్భంగా చేసినవి. ధనిక, మధ్యతరగతుల్లో వరకట్నం, శ్రామిక జనంలో ఓలి ఆచారం ఉండేది. వీటిరూపం ఏదయినా దాని దుష్ప్రభావం మాత్రం స్త్రీమీదే అసలే అక్షరాస్యత అంతంతమాత్రం (8.5%) అందులో స్త్రీల అక్షరాస్యత 1.2% మాత్రమే. ఈస్థితిలో పుట్టినింటి ఊరు మెట్టినింటి ఊరుతప్ప మరోప్రపంచం తెలియని ధనిక మధ్యతరగతి స్త్రీలు, పాలకుల సంస్కృతి అయిన 'ఘోషా' బాధితులు. ఉత్పత్తిలో పాల్గొనే స్త్రీలు నాలుగు గోడలకు పరిమితం కానప్పటికీ వెట్టిపనులకి పోయినప్పుడు దొరకన్ను, అధికార్ల కన్నుపడితే లొంగిపోవడం తప్ప మరోదారిలేని స్థితి. ధనిక మధ్యతరగతుల్లో భర్త మరో స్త్రీని ఉంచుకొని భార్యని పట్టించుకోనిస్థితి. మరోపక్క గడీలలో తాత, తండ్రి, కొడుకు, మనవడు, అల్లుళ్ళు ఒకరేమిటి దొర బంధువుల్లో కాదనలేని 'ఆడపాప' బతుకులు, బండెడు చాకిరీ, రోజులకొద్దీ పురుటినొప్పులు (10, 15 రోజులు కూడా) బాలెంత రోగాలు (ఏదొచ్చినా అదే పేరు) మంత్రసానుల మోటువైద్యం, ఇట్లా 10, 20 కాన్పులు, పోయినవాళ్ళు పోగా గంపెడు పిల్లలు, పొద్దస్తమానం గొడ్డుచాకిరీ ఇదే జీవితం. ఎప్పుడో జన్మకోశివరాత్రి అన్నట్లు వెన్నెలరాత్రుల్లో ఆడవాళ్ళంతాచేరి చీరలు, రైకల మీద అద్దాలో, పూసలో మరేవుల్లో కుట్టుకుంటూ సీతమ్మవారి చెరలు, ఊర్మిళాదేవి నిద్ర, రుక్మిణీ కళ్యాణం, చంద్రమతిదేవి గాథలు పాడుకోవడం తప్పితే మరే శారీరక మానసిక విశ్రాంతి ఎరుగరు. శ్రామిక మహిళలు కోతలుకోస్తూ, నాట్లేస్తూ పాడుకొన్నా ఇట్లాంటివే. కాకపోతే మరోరాగం, మరోకథ. అయితే పోరాటం కాలానికి వచ్చేసరికి సీతమ్మవారి చెరలు పాడుకున్న స్త్రీలే 'జాయా, శాన్యా' కథలు, అయిలమ్మ భూపోరాటం, కొమరయ్య వీరమరణం పాడుకొన్నారు. చంద్రమతి గాథలు చెప్పుకొన్న స్త్రీలే గోర్కీ అమ్మగురించి విన్నారు, ఉత్తేజాన్ని ప్రేరణనీ చైతన్యాన్ని పొందారు. పాడిన గొంతూ రాగాలూఅవే. భావం మారింది. అంతేకాదు తాము స్వయంగా పాటలు కట్టారు. ఆంధ్ర ప్రజానాట్యమండలిలో కూడా స్త్రీలు చాలామంది ఉండేవారు, పాత సూర్యాపేట, బాలెంల పోరాటాలపై స్త్రీలు రాసిన ఒకపాట

వీరమల్లారెడ్డి ఉయ్యాలో - ధీరఅనంతారెడ్డి ఉయ్యాలో
మీవీరమరణము ,, - మరువమెన్నటికైన ,,
మీవంటివీరులు ,, - మామధ్య నిలబడి ,,
మాకువెల్గుచూప ,, - ఓర్వలేనిప్రభుత్వము ,,
ఈదొంగదోపిడీలు ,, - సాగవని సర్కారు ,,
ఆంధ్రమహాసభ తనను - అంతమొందించెనని ,,
హడలెత్తి సంఘాన్ని ,, - అణచజూస్తున్నారు ,,
పాతసూర్యాపేట ,, - పోరాటమునజాడు ,,
పురుషులు లేనపుడు ,, - పల్లెలో స్త్రీలంత ,,
పరువుకాపాడుకొన ,, - బయలుదేరినారు ,,
శీలరక్షణ కొరకు ,, - స్త్రీలంతాకూడారు ,,
లాఠీలచ్చేసి ,, - లడాయిచేసారు ,,
ప్రజల బలమూజూసి - పారిపోయిరి వాళ్ళు ,,
పౌరహక్కుల ,, - పోరాటమిదియమ్మ ,,
ఝాన్సీలక్ష్మి చరిత్ర ,, - చాటిచూపాలమ్మ ,,
మనప్రజలరాజ్యము ,, - పొందితీరాలమ్మ ,,

(భీమిరెడ్డి స్వరాజ్యం - 1949 ప్రాంతంలో రాసింది)

ఈమెకట్టిందే మరోపాట స్త్రీ పురుషులు సమానులేనంటూ-

భారతి భారతి ఉయ్యాలో - మాతల్లి భారతి ఉయ్యాలో
ఆడవారనగానే ,, - అంతలోకువఏమి ,,
అంతతేలికఏమి ,, - అంతచులకనఏమి ,,
రాణీరుద్రమదేవి ,, - రాజ్యమేలాలేదా ,,
ఝాన్సీలక్ష్మిబాయి ,, - పోరుచేయాలేదా ,,
(మిగతాభాగం గుర్తులేదు)

స్త్రీలు సమానప్రతిపత్తికోసం ఆరాటపడ్డారు. పోరాటంలోని అన్నిరంగాల్లో క్రియాశీల పాత్రవహించారు. అన్నిరంగాల పోరాటాల్లోనూ పురుషులకు ఏమాత్రం తీసిపోకుండా పరిధీటుగా పనిచేసారు. గెరిల్లాదళాల్లోను, కొరియర్లుగానూ, గ్రామ కమిటీ సభ్యులుగా పట్టణాల్లో అత్యంత క్లిష్టమైన 'డెన్ను'ల నిర్వహణ బాధ్యతను ఎంతో మెలకువతో నిర్వర్తించారు.

**ప్రారంభదశ** : 1920 లోనే హైదరాబాద్ ఆంధ్ర జనసంఘం ఏర్పడినప్పటికీ (తరువాత ఇదే ఆంధ్రమహాసభ - సంఘంఅయింది.) 1930లో కేంద్రసంఘంగా మారిన తర్వాత మహాసభ జరుపుకొన్న ప్రతిసారీ ఆంధ్రమహాసభతోపాటు ఆంధ్ర మహిళాసభకూడా జరిగేది. కానీ ఆంధ్రమహిళాసభలో చేసిన తీర్మానాలు ప్రచారం చేయడం, సంస్థలో ప్రాథమికసభ్యుల్ని చేర్పించడం ఉండేదికాదు. 1939-40 ప్రాంతాల్లో హైదరాబాద్ కమ్యూనిస్టు కమిటీ ఏర్పడింది. 1930నుంచే ఆంధ్రమహాసభలో పని చేస్తున్న రావి నారాయణరెడ్డి అట్లానే బద్దంఎల్లారెడ్డి తదితరులు ఆ తర్వాత కాలంలో నూటికి 90 మంది యువకులు కమ్యూనిస్టుల ప్రభావంలోకి రావడం ఆంధ్రమహాసభ ప్రజాసంస్థగా రూపొందడం, అప్పటికే ఆంధ్రప్రాంతంలో కమ్యూనిస్టుపార్టీ 1937-38 లో మహిళలకు వేసవి శిక్షణతరగతులు నిర్వహించడం (పాల్గొన్నవారు కమ్యూనిస్టు సభ్యుల భార్యలు, చెల్లెళ్ళు మాత్రమే). ఈ నేపథ్యంలోనే 1941లో ఆంధ్రమహాసభకి ఏకగ్రీవంగా ఎన్నికైన రావినారాయణరెడ్డి తన అధ్యక్షోపన్యాసములో రైతులు, కార్మికులు, స్త్రీ లస్థితి ఎంతదుర్భరంగాఉందో చూపుతూ వారికి అవసరంగా చేయవలసిన చట్టాలగురించి తెలిపారు. ఈ క్రమంలో 1944 మే నెలలోజరిగిన ఆంధ్రమహాసభలో వేయిమంది స్త్రీ లుపాల్గొన్నారు. హైదరాబాద్ పట్టణంలో మధ్యతరగతి మహిళల పలుకుబడిలోగల నవజీవన్ మహిళామండలిలో 1944కు కొద్దికాలం ముందునించి కమ్యూనిస్టు యువతులుచేరి పనిచేయడం ప్రారంభించి దానిని ప్రజాసంఘంగా అభివృద్ధి చేసారు. ప్రాథమికసభ్యుల్ని చేర్పించడం, ఆత్మరక్షణకు శిక్షణఇవ్వడం, చౌకడిపోలకోసం ఆందోళన జరపడం, రేషన్ఇప్పించడం, అందులో అన్యాయాలు జరక్కుండా చూడడం మొదలైన కార్యక్రమాలు చేస్తుండేవారు. 1943లో బెజవాడలో జరిగిన వేసవి రాజకీయ శిక్షణాతరగతులకు ఈ ప్రాంతంనుంచికూడా కొందరు హాజరైనారు. తరతరాల అణచివేత ఫలితంగా తమలోకలిగిన సంకోచం, సిగ్గు, మొహమాటం వదులుకొని మాట్లాడడం, చర్చించడం, ఉపన్యాసాలుఇవ్వడం, గ్రూపులుగా విడివడి కార్యదర్శుల్ని ఎన్నుకొని క్రమబద్ధమైనరీతిలో క్రమశిక్షణతో పనిచేయడం, సామూహికంగా పాటలుపాడడం, కాకినిక్కరు, షర్టుధరించి ఆత్మరక్షణ శిక్షణ పొందడం ఇక్కడనేర్చుకొన్నారు. ప్రసూతి, మాతాశిశుఆరోగ్యం, ఆర్థిక, రాజకీయ, భూగోళ, చరిత్రపాఠాలు విన్నారు. ఈ శిక్షణతో కార్యకర్తలు తమ తమ ప్రాంతంలో చొరవగాపనిచేసి 1944 మే నెలలో జరిగిన ఆంధ్రమహాసభకి వేయిమంది స్త్రీ లని సమీకరించారు.

1944 ద్వితీయార్థంలో ఆంధ్ర మహాసభ ప్రతిపాదించిన ప్రజామంత్రి వర్గకార్యక్రమంలో స్త్రీ లకు సంబంధించి కూడా నిర్దిష్ట ప్రతిపాదనలు చేసారు.

1) అన్నదమ్ములతోపాటు ఎట్టి భేదంలేక స్త్రీలకు ఆస్తిహక్కు ఉండాలి.

2) యువకులకు 18 సంవత్సరములలోపల, స్త్రీలకు 14 సంవత్సరములలోపల బాల్యవివాహాలు పూర్తిగా నిషేధించాలి. మైనారిటీ వెళ్ళిన స్త్రీ పురుషులకు రిజిస్ట్రేషన్ ద్వారా వివాహం చేసుకునే హక్కు ఉండాలి. వితంతు వివాహాలకున్న అడ్డంకులు తొలగించాలి. ప్రత్యేకపరిస్థితిలో విడాకులిచ్చుటకు అవకాశం ఉండాలి.

3) స్త్రీల విద్యాభివృద్ధికై ప్రత్యేక సౌకర్యములు, వృత్తివిద్యల నేర్పుటకై ఏర్పాట్లను ప్రభుత్వం చేయాలి.

4) గర్భంతోనున్న కార్మిక స్త్రీలకు ప్రసవించకముందు ఆరువారాలు, ప్రసవించిన తర్వాత ఆరువారాలు పూర్తి వేతనంతో సెలవుఇవ్వాలి. స్త్రీలకు ప్రసవించడానికి ఆధునిక తర్ఫీదు పొందిన మంత్రసానులను గ్రామాల్లో ఏర్పాటుచేయాలి. పట్టణాల్లోని ఆస్పత్రులలో గర్భిణీ స్త్రీల వార్డులను పెంచాలి.

5) స్త్రీలకు ఉద్యోగము లిచ్చుటలో ఉన్న నిర్బంధములను తొలగించాలి. ఒకే రకపు పనికి పురుషులతోపాటు సమానవేతనమివ్వాలి. (నేటి హైదరాబాదు మన కర్తవ్యాలు - పేజీ 199 200)

ఆంధ్ర ప్రాంతంలో కమ్యూనిస్టుల నాయకత్వంలోని ఆంధ్ర రాష్ట్రమహిళా సంఘం 1942 నుంచే ఆస్తిహక్కుకోసం ఆందోళన చేస్తున్నది. స్త్రీల హక్కుల గురించి పరిశీలన చేయడానికి వేసిన సెలెక్టు కమిటీకి కొన్ని సూచనలు చేస్తూ 10 వేల సంతకాలు చేయించి ఒక మహజరుపంపారు. ఆతర్వాత వేసిన శ్రీ బి. యన్. రావు కమిటీ తయారుచేసిన బిల్లులోని లోపాలు తెలుపుతూ కొన్ని సూచనలుచేస్తూ 50 వేల సంతకాలు చేయించి పార్లమెంటుకు పంపారు. పార్లమెంటుకు రాయబారం వెళ్ళాలని చేసిన ప్రయత్నాన్ని ప్రభుత్వం సాగనివ్వలేదు. 1943 జూన్‌కి మహిళా సంఘం ఒక్కకృష్ణాజిల్లాలోనే 124 స్థానిక యూనిట్లుగా విస్తరించింది. 8వేల సభ్యత్వం కలిగి ఉంది. బెంగాల్ తర్వాత అత్యధిక సంఖ్యగల మహిళా సంఘం ఆంధ్రరాష్ట్ర మహిళా సంఘమే. 1943 లో కొన్ని నెలలపాటు బెజవాడలో జరిగిన శిక్షణ తరగతుల ఆఖరిరోజు స్త్రీలు కాకినిక్కరు షర్టుధరించి యుద్ధవ్యతిరేక నినాదాలిస్తూ బెజవాడ పురవీధుల్లో ఊరేగింపు తీసారు. 1944 లో బెజవాడలో జరిగిన అఖిలభారత కిసాన్ సభాస్థలంలో 5వ వంతు స్త్రీలే కిక్కిరిసినిండారు. రైతు కుటుంబంలోని వ్యక్తులుగా కిసాన్‌సభలు మొదలైన ఉమ్మడి సభలకివెళ్ళి, తమప్రత్యేక సమస్యలకోసం మహిళా సంఘాన్ని అభివృద్ధి చేసుకున్నారు. 1948 లో ప్రభుత్వం నిషేధించేనాటికి ఆంధ్ర రాష్ట్ర మహిళా సంఘంసభ్యత్వం 45 వేలు. మహిళా సమస్యలపై "ఆంధ్రవనిత"

పేరుతో పత్రికనడిపేవారు. 48 లోనే మహాసభకి ముందు మహిళాసంఘంతోపాటు ప్రభుత్వం పత్రికను నిషేధించి సీలుచేసింది.

గ్రామాలలో స్త్రీలు దాడులను ప్రతిఘటించారు. నైజాం పోలీసులు, దేశ్‌ముఖ్ గుండాలు, కాంగ్రెస్ గుండాలు, యూనియన్ మిలిటరీని ఎదుర్కోవడానికి ఎప్పుడూ కారంముద్దలు, కారంనీళ్ళు సిద్ధంగా వుంచుకునేవారు. రాత్రిళ్ళు ఒంటరిగా కాకుండా పది, పదిహేను, ఇరవయిమంది స్త్రీలు కలిసి పడుకునేవారు. ఎప్పుడూ ఒకచోటచేరి వుండేవారు. ఏ స్త్రీ మీదైనా చేయవేస్తే అందరూకూడి బుద్ధిచెప్పేవారు. పోలీసు, మిల్ట్రీ లారీలని చుట్టుముట్టి తమవాళ్ళని విడిపించుకునేవారు. బాలెంల, పాతసూర్యాపేట, పోరాటాల నుంచి స్త్రీలు పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొన్నారు, అన్ని గ్రామాలలోను స్త్రీలు వూరేగింపులో నడిచి సమావేశాలు చేసారు. ఇండ్లనుంచి బయటకువెళ్ళని ధనిక స్త్రీలు కూడా ఈ సమావేశాలలో పాల్గొనకుండా వుండలేకపోయారు. ముసలివారు కూడా ఆశీర్వదించక తప్పలేదు. కొందరు అత్తలు కోడళ్ళను వారించారు. కొందరు భర్తలు వ్యతిరేకించారు. జమీందారీ విధానం తెచ్చిపెట్టిన మూఢాచారాలను వారినెత్తిన రుద్ది ఆపివేయచూసినారు. కాని స్త్రీలుమాత్రం ఈ జమీందారీ వ్యతిరేక పోరాటంలోనే ఈవిధంగా ముందుకు వచ్చారు.

ఊరేగింపులకు మొదటిసారిగా నాయకత్వం వహించినది బాలెంల వీరాంగనలు. ఇంతటితో ఆగలేదు. ఆకునూరు, మాచిరెడ్డిపల్లె దృశ్యాలు అప్పటికే తెలంగాణ స్త్రీల ముందు వున్నవి. స్త్రీలు పోలీసుల అరాచకాలనుంచి తమ్ము తాము రక్షించుకోవడానికి కృతనిశ్చయులైనారు. అయితే జమీందారీ విధానం వీరికి తెచ్చిపెట్టిన ఆయుధాలనే వారికి వ్యతిరేకంగా ప్రయోగించడానికి పూనుకొన్నారు. కారం, రోకలిబండలు, కొడవళ్ళు లాంటివి.

పోరాటంలో పాల్గొనే స్త్రీలు ఆంధ్రప్రాంతంలోనైనా, తెలంగాణాలో అయినా ఆంక్షలని ఎదుర్కోకపోలేదు. వారు సంఘాన్ని, కుటుంబాలని ధిక్కరించి పోరాటంలో కొచ్చారు. ఆత్మరక్షణ శిక్షణకి వెళుతున్న స్త్రీలని కొందరుభర్తలు ఆపడానికి ప్రయత్నించినపుడు "మా మానప్రాణాలను మీరు కాపాడలేరు. మా ఆత్మరక్షణకి మేం శిక్షణపొందుతాం అంటే ఆటంకపరుస్తారు" అని నిలదీసిఅడిగారు (సుందరయ్య గారి 'గుణపాఠాలు' పేజీ 195). అట్లానే పార్టీలో స్త్రీలపట్ల పాతభూస్వామ్య దృక్పథాన్ని ప్రశ్నించారు. ఒక దళసభ్యురాలు నర్సమ్మ "ఇప్పటికీ మా స్త్రీలంటే తక్కువ భావమే కొనసాగుతున్నది. ఏస్త్రీఅయినా పొరపాటుచేస్తే ఆమెపై నాయకత్వం కఠినంగా వ్యవహరిస్తున్నది. ఆ విషయం ఉబుసుపోక కబుర్లలోపడి అందరినోళ్ళలో నానుతున్నది. మాకు మంచిశిక్షణఇచ్చి వృద్ధిచేయాలెగాని దిగజార్చరాదు. కొంచెం

స్వేచ్ఛగాఉంచేవాలు మమ్మల్ని అనుమానంతో చూస్తున్నారు. అసలు ప్రత్యేకంగా శత్రువుపైజరిపే దళచర్యలో ఒక్క స్త్రీ నన్నా ఎందుకు పాల్గొననివ్వలేదు ?." (సుంద రయ్య గారి 'గుణపాఠాలు' పేజీ 423)

ఈ ప్రశ్నకి ఏమిసమాధాన మిచ్చారో, అసలు ఇచ్చారోలేదో ? ఎంతవరకు స్వీకరించారో ? ఎంతవరకు తిరస్కరించారో ? ఎంతవరకు దిద్దుకోవడానికి ప్రయ త్నించారో తెలియదు.

1951లో పోరాటం విలిపివేసినపుడు జరిగినచర్చల్లో స్త్రీలు ఎటు వైపు ? ఎక్కువ మంది అభిప్రాయం ఎట్లాఉండింది ? అనేదికూడా తెలియదు. ఇంత పెద్దసంఖ్యలో పాల్గొన్న ప్పటికీ అభిప్రాయాలు రికార్డుఅయి ఉండగల స్థాయికమిటీల్లో, అభిప్రాయా లను పరిగణలోకి తీసుకోగల స్థాయిల్లో స్త్రీలు ఒకటి అరా తప్పలేరు.

ఉద్యమంలో ఇంత పెద్దఎత్తునపాల్గొని కీలకపాత్ర నిర్వహించిన స్త్రీలు బాధ్యతవహించి స్త్రీల ప్రాతినిధ్యం, ఉద్యమనిర్వహణలో నాయకత్వపాత్ర, నిర్ణా యక శక్తిగా ముందుకురాలేదు. గెరిల్లాదళాల్లోను, ఏరియాకమిటీల్లోనూ కొందరు ఉన్నారు. నిజమేకానీ మొత్తంగాచూస్తే స్త్రీలు పాల్గొన్న సంఖ్యతో పోలిస్తే వాళ్ళకు లభించిన ప్రాతినిధ్యం తక్కువే.

ఇంతాచేసి పోరాటం నిలిపివేసిన తర్వాత పాతవిలువల్లో ఇమడలేక కొత్త విలు వల్ని కాపాడుకోలేక నలిగిపొయ్యారు. పోరాట విరమణ తర్వాత స్త్రీలకి నాయకత్వం ఇచ్చిన సమాధానం "మేమే ఏటూతేల్చుకోలేకుండా ఉన్నాం మీరు ఇళ్ళకివెళ్ళిపోండి" అన్నదే. కానీ తేల్చుకోవలసిన వాళ్ళలో స్త్రీలు జమకాదు. తేల్చుకోవలసిన వాళ్ళు పురుషులే అయ్యారు.

ఏదిఏమైనా ఈ 13 సంవత్సరాల విప్లవోద్యమ కాలంలో కంటే (2 సం॥ POW చరిత్ర మినహాయిస్తే) ఆనాటి పార్టీ స్త్రీలని విప్లవోద్యమంలోకి సమీకరించడానికి కృషిచేయడంతోపాటు చైతన్యాన్ని పెంచడానికి ముందుకు రావడానికి చాలాబాగా పని చేసింది. 45వేల సభ్యత్వం కలిగిన మహిళల ప్రజాసంఘాన్ని నిర్మించింది. రాశిరీత్యా మాత్రమే కాదు వాసిరీత్యా కూడా ఆనాటి అనుభవాల నుంచి నేర్చుకోవలసింది ఉంది. కొన్నిలోపాలు లేకపోలేదు. వాటినుంచి పాఠాలు నేర్చుకొంటాం. "స్త్రీ విముక్తి కావా లంటే వర్గపోరాటంలో పాల్గొనండి" అని పిలుపిచ్చి ఊరుకోలేదు. దాని అర్థాన్ని ఆనాటి స్త్రీల పరిస్థితులకి అన్వయించి తక్షణ సమస్యలమీద కదలింది చైతన్యవంతు లను చేయడానికి కృషిచేసింది. నిర్దిష్ట ప్రతిపాదనలతో స్త్రీలని సమీకరించింది.

స్త్రీలలో నిర్మాణదక్షతని (Organising Capacity) పెంచడానికి ప్రత్యేక తరగతులు నిర్వహించింది. ప్రత్యేక ప్రజాసంఘాలని నిర్మించింది. ప్రత్యేక పత్రిక నడిపింది.

చైనాలో మహిళా ఉద్యమం కూడా ఇదే విషయం రుజువుచేస్తున్నది. "నిజమైన మార్పును సాధించాలంటే ప్రజలను ఎంత విస్తృతంగా వీలైతే అంత విస్తృతంగా సమీకరించి పనిలో పెట్టాలి. ఎందుకంటే వాళ్ళు మార్పుయొక్క అవసరాన్ని అది నిర్వహించబడవలసిన మార్గాలను అవగాహన చేసుకోవాలి. సంస్థల్లో నిర్మాణాల్లో పనిచేయడం వాళ్ళల్లో మమేకభావాన్ని కలిగిస్తుంది. అది తమది అనే భావాన్ని కలిగిస్తుంది. ప్రజలు తాము ఇవ్వగలిగిందంతా ఇచ్చేలా చేస్తుంది. అందువల్లనే 1950 లో ప్రజాసంఘాల్లో, కమిటీలలో చెప్పుకోదగిన చైతన్యస్థాయిలో మార్పు కలిగిస్తుంది. ఇది ప్రత్యేకించి స్త్రీల విషయంలో మరింత కొట్టొచ్చినట్లుగా కనిపిస్తుంది. నిర్మాణ బాధ్యతల్లో స్త్రీలను ఎన్నిక చెయ్యడంగాని, నియమించటంగాని వాళ్ళ జీవితాల్లో వాళ్ళివ్వగలిగిందంతా ఇవ్వడానికి వ్యక్తులుగా ప్రత్యక్షంగా కమిటీకి తమ ప్రాముఖ్యం ఉందని భావించడంగాని జరిగింది" (Women - Work - Women and party in Revolutionary china by Dalia Davin - page 53).

అయితే చైనాలో మహిళా ఉద్యమం చాలాపెద్దది. ఒక క్రమంలో కొనసాగింది. దానితో ఈ ఉద్యమాన్ని పోల్చలేం. చైనాలో విముక్తి ప్రాంతాల్లో ముందు నుంచి భూమి పంపకాల సందర్భంగా స్త్రీలకి కూడా భూమి పంచారు.

"జియాంగ్సీ సోవియట్ చట్టంలో ప్రత్యక్షంగా స్త్రీలకు సంబంధించినవి భూమిచట్టాలు, వివాహచట్టాలు, కార్మికచట్టాలు, భూమిచట్టంక్రింద వ్యవసాయ కూలీలు, రైతులు లింగభేదం లేకుండా సమానహక్కులు అనుభవించారు భూమి పంపకాల్లో సమానత్వం అమలయింది. ఈ చర్యలో ప్రత్యేకంగా పేర్కొనవలసిన అంశం నిరుపేద స్త్రీలకు ఎక్కువ స్వాతంత్ర్యాన్ని ఇచ్చే అవకాశాన్నిచ్చింది." (పైపుస్తకమే పేజి 26)

ఇక్కడ కూడా స్త్రీకి పురుషుడితో సమానంగా ఆస్తిహక్కు ఉండాలని ప్రజామంత్రి వర్గకార్యక్రమంలో పేర్కొన్నారు. అయితే 10 లక్షల ఎకరాల భూమి పంపకం చేసినపుడు స్త్రీలకు భూమి పంచలేదు. వితంతువులకు మాత్రం పంచారు. గ్రామ కమిటీల్లో కూడా స్త్రీలను తీసుకొన్నారు. వాళ్ళు ఈ విషయం ఎత్తారోలేదో తెలియదు.

పోరాటంలో అనివార్యంగా విచ్ఛిన్నం కాజొచ్చిన పాత సంబంధాల స్థానంలో కొత్త సంబంధాల్ని నెలకొల్పడానికి, నూతన విలువల్ని ప్రచారంచేసి ప్రోత్సహించడానికి ప్రయత్నించింది. పార్టీస్వయంగా చొరవతీసుకుని వితంతువివాహాలు, కులాంతర

వివాహాలు జరిపించింది. పార్టీ నాయకత్వం ఇట్లాంటి వివాహాలు చేసుకొని ఇతరులకి ఆచరణ ద్వారా నేర్పడానికి ప్రయత్నించింది. పాత సంస్కృతిక సంబంధాలని దెబ్బగొట్టవలసిన అవసరాన్ని గుర్తించింది. ప్రత్యేకంగా శ్రద్ధతీసుకొని విస్తృత ప్రచారం చేసింది.

ఆనాటి మహిళా సంఘం స్త్రీల అణిచివేతని, దోపిడీ విలువలని వ్యతిరేకించే స్త్రీలందరి ఐక్యతా వేదిక. నాయకత్వం కమ్యూనిస్టులది. ఆనాటి కమ్యూనిస్టు యువతులు అప్పటికే మధ్యతరగతి విద్యాధిక మహిళల పలుకుబడిలో ఉన్న నవజీవన మహిళా మండలిలోచేరి దాన్ని ప్రజాసంస్థగా మలచగలిగారు. ఈ సంస్థకి మేం పేరు పెట్టి స్థాపించలేదుకదా అని దానికి దూరంగా ఉండలేదు.

అకునూరు మాచిరెడ్డి పల్లెలలో స్త్రీలపై పోలీసులు జరిపిన అత్యాచారాలపై పద్మజానాయుడు, మల్లాప్రగడ సీతాకుమారి వంటి వారితో కమిటీవేసి అక్కడికి తీసుకువెళ్ళి విచారణజరిపి ప్రకటనలిప్పించారు.

అయితే 48 నుంచి 51 వరకు యూనియన్ మిలటరీ, కాంగ్రెస్ గూండాలు జరిపిన అత్యాచారాలపట్ల పద్మజానాయుడు, సీతాకుమారి వంటివాళ్ళు మౌనంగా ఉన్నారన్నది గమనించవలసిన విషయం. అంతేకాదు కమ్యూనిస్టులు ఉన్నారనిచెప్పి అఖిల భారత మహిళా కాంగ్రెస్ ఆంధ్ర మహిళా సంఘాన్ని అనుబంధసంస్థగా చేర్చుకోవడానికి నిరాకరించింది.

అయితే చిట్టచివరిదాకా ధైర్యం, నిర్బంధాలు తట్టుకొని పోరాటంలో నిలిచిన ఉన్నత విద్యాధిక వర్గాలకు చెందిన మహిళల సంఖ్య తక్కువేమీ కాదు.

ఇక పోరాటం విరమించేనాక పోరాటంలో పాల్గొన్న స్త్రీల సంక్షోభ పరిస్థితి వాళ్ళు చెప్పాల్సిందేకాని వెయ్యోవంతుకూడా ఊహించడం సాధ్యంకాదు. 10 సంవత్సరాలకిత్రితం బాలికలుగా (12, 15 సం॥లు) యువతులుగా ఇండ్లు గ్రామాలు వదిలివచ్చి పోరాటంలో పాల్గొన్న స్త్రీలు పెళ్ళిళ్ళై, తల్లులై, పిల్లల్తో కొంతమంది, భర్తలతో కొంతమంది భర్తలులేక గ్రామాల్లో అడుగుపెట్టి ఆ పరిస్థితులను భరించిన స్థితి. తాము ధిక్కరించే విలువలపంచనేచేరిన వీళ్ళు కొందరు పూర్తిగా లొంగిపొయ్యారు. కొందరు సర్దుబాట్లు చేసుకొన్నారు. ఏమైనా అదిగతం అయిపోయింది.

ఇక ఆనాటి మహిళా సంఘం రెండై ఒకటి (సిపిఐ) ప్రభుత్వ సంస్కరణలు అమలుచేయించడం (కుట్టుమిషన్లు ఇప్పించడం గట్రా) రెండోది (సిపియం) మగవాళ్ళను డిటెన్యూలుగా అరెస్టుచేస్తే, అత్యవసరపరిస్థితిలో వాళ్ళు కాస్త పనిచేయలేని

# తెలంగాణా పోరాటం - 'ధనిక రైతాంగ' వాదం

కె. బాలగోపాల్

తెలంగాణా రైతాంగపోరాటం ఎందుకు విరమించబడింది అన్నప్రశ్నకు ఇంత వరకు సంతృప్తికరమయిన సమాధానంలేదు. నాయకత్వం విద్రోహంచేసింది సరే, కాని నాయకత్వం ఎందుకు విద్రోహంచేసింది? యూనియన్ సేనల ఆధునిక ఆయుధాలను చూసిభయపడిందా? స్టాలిన్ తప్పుదారిపట్టించాడా లేక నెహ్రూ సమ్మోహనాస్త్రం ప్రయోగించాడా? బెంగుళూరు దళిత ఉద్యమమేధావి రాజశేఖరశెట్టి అన్నట్టు హైందవ వర్ణధర్మం దానికి కారణమందామా లేక - అదేపరళిలో - భారత కమ్యూనిస్టు ఉద్యమానికి ఒక స్వతంత్రమయిన లక్ష్యం, వ్యూహం, ఏర్పడకపోవడానికి కారణం, భాష్యానికేతప్ప స్వంతఆలోచనకు తావివ్వని వేదాంత తాత్విక సంప్రదాయమందామా?

ఇట్లాంటి ప్రశ్నలెన్నయినా వేసుకోవచ్చుగాని సమాధానంచెప్పే సమగ్రమయిన ప్రయత్నంమాత్రం ఇంతవరకు జరగలేదు. అయితే ఈ మధ్యకాలంలో ఒక పాశ్చాత్య రచయిత అటువంటి ప్రయత్నంచేసాడు. (Barry pavier, The Telangana Movement, 1944-51), వివరమయిన పరిశీలనమీద, ఒక నిర్దిష్టమయిన సిద్ధాంతం మీద, ఆధారపడిచేసిన అతని వ్యాఖ్యానం విశ్వవిద్యాలయ మేధావులలోను, ఇతర అకడెమిక్ సర్కిల్స్‌లోను పరపతి గడించుకుంటోంది. ఆ వ్యాఖ్యానం ఇంతవరకు తెలుగు పాఠకులదృష్టికి రాకుండవచ్చునుగాని, అంతమాత్రంచేత దాన్ని పరిశీలించడం

---

స్థితిలో తర్జన భర్జనలు జరుపుతున్నప్పుడో తలెత్తడం ఆతర్వాత బుట్టలోకి వెళ్ళడం ఇదీస్థితి,

ఆ కుటుంబాల్లో పాతవిలువలు కొత్తరూపంలో విజృంభించాయి. ఆస్త్రీలే కొత్త రూపంలో విజృంభించిన పాతవిలువలకి కాపలాకాయక తప్పడంలేదు. (ఒకటి అరా మినహాయింపులు) దీని పరిశీలకులు చెప్పేజవాబు "ఏ ఆధారంతో చూసినప్పటికీ ఉద్యమంలో కులం ఏదైనా పాత్ర నిర్వహించిందనడానికి రికార్డులునసాక్ష్యం ఏదీ కల్పించడంలేదు. అంతేకాదు అందుకు భిన్నంగా ఉద్యమప్రభావంలో పాతసాంఘిక సంబంధాలు కులం విషయంలోనేకాదు స్త్రీల విషయంలోకూడ విచ్ఛిన్నమైపోయిన నిదర్శనాలే కనిపిస్తున్నాయి. 1950 లో ఉద్యమం వెనుకపట్టు పట్టేవరకు పాత సాంఘిక సంబంధాలు తలఎత్తి మళ్ళీ పైకివచ్చాయి. వీటికి ముఠా రాజకీయాల కొత్త ధోరణులు మరింత దోహదంచేసాయి.

(Telangana movement 1944-51 by Barry pavier - page 184)

(సమాచార సేకరణలో సహకరించిన మిత్రులు - తెలంగాణ పోరాట పాటల గురించి పరిశోధనచేస్తున్న జయధీర్ తిరుమలరావు.
సాహసానికి చైతన్యానికిదోహదం - స్త్రీశక్తి సంఘటన. హైదరాబాద్)

అనవసరంకాదు. దానికి మూడుకారణాలున్నాయి. మనలో ఇంగ్లీష్ పుస్తకాలు, పత్రికలు, చదివేఅలవాటు ఉన్నవాళ్లు తెలిసోతెలియకో తమ ఆలోచనల్ని పాశ్చాత్యదేశాలనుండి అరువుతెచ్చుకుంటారు. సామ్రాజ్యవాద సాంస్కృతిక ఆధిపత్యానికి ఇదొక సాధనం. భారతీయ భాషలుమాత్రమే తెలిసినవాళ్ళనుగూడ ఈ దిగుమతి అయిన భావాలు (మళ్ళీ తెలిసీతెలియకా) అనువాదరూపంలోను భాష్యరూపంలోను ప్రభావితం చేస్తాయి. ఇది ఒక కారణం.

రెండవ కారణం, ఈ వ్యాఖ్యానం తెలంగాణా రైతాంగ పోరాటానికి పరిమితమయినదికాదు. చైనాతో మొదలుపెట్టి వియత్నాం, లావోస్, కంపూచియా, అంగోలా, జింబాబ్వే, ఇంకా ఎన్నో ప్రాంతాలలో దీర్ఘకాలిక రైతాంగ పోరాటాల రూపంలో వచ్చిన విప్లవాలకు గూడ వర్తిస్తుంది. ఆ విప్లవాలన్నీ గూడ తరువాతి కాలంలో రకరకాల ఇబ్బందుల్ని ఎదుర్కొన్నాయన్న విషయాన్ని ఆసరాచేసుకుని, వాటి వ్యూహమూ అవగాహనా అనివార్యంగా వైఫల్యానికి దారితీస్తాయని వక్రీకరిస్తుంది. అందుకోసమే ఆవ్యాఖ్యానాన్ని ఎదుర్కోవలసివుంది. దానికి ఒక పేరుపెట్టాలి కాబట్టి 'ధనిక రైతాంగ' వాదం అంటాను. దానిబలమయిన సైద్ధాంతిక రూపం ట్రాట్స్కీయిజం. అయితే ట్రాట్స్కీయిస్టులు కానివాళ్లు చాలామంది ఆవాదాన్ని బలపరచడానికి సిద్ధంగావున్నారు. ఇది మూడవ కారణం.

ఈ 'ధనిక రైతాంగ' వాదం స్వరూపాన్ని తెలుసుకునే ముందు అసలు తెలంగాణా పోరాటం ఎందుకు వచ్చిందో గుర్తుకుతెచ్చుకుందాం. మన దేశంలో చరిత్ర గమనం మొదటి నుండీ గూడ అసమానంగానే వుంటూవచ్చింది. ఇవ్వాళ మదరాస్ నగరంలో ఎన్నూర్ థర్మల్‌స్టేషన్‌కు ఒక కిలోమీటర్ దక్షిణాన, ఉడతల్నీ, ఎలుకల్నీ పట్టుకు జీవించే యానాదుల నివాసాలు కనిపిస్తాయి. ఇంత విపరీతం గతంలోలేకున్నా, అసమాన అభివృద్ధీ, ప్రాంతీయ ప్రత్యేకతా, ఫ్యూడల్ దశలోనూ, అంతకుపూర్వమూ గూడ వుండేవి. అందుకే మనదేశ చరిత్రను దేశవ్యాప్తంగా వర్తించే 'దశలగా విభజించే ఏ ప్రయత్నమయినా ఔత్సాహికం కాకమానదు. అందుకే, యూరప్ ఫ్యూడలిజాన్ని ఒక్క వాక్యంలో కాకున్నా పదివాక్యాలలో నిర్వచించవచ్చునుగాని, మనదేశ ఫ్యూడలిజాన్ని ఒక్కొక్క ప్రాంతాన్నీ తీసుకొని వివరించగలమే గాని నిర్వచించలేం. ఒక్కవర్ణవ్యవస్థ మాత్రమే భారతదేశ ఫ్యూడలిజంలో సార్వత్రికమయిన అంశం.

అయితే ఫ్యూడలిజం బహుశా అన్నిప్రాంతాల కంటే హైదరాబాద్‌లో అసఫ్ జాహీల పాలనక్రింద అత్యంత విపరీత రూపాన్ని తీసుకుందనవచ్చునేమో. ఈ

ఫ్యూడలిజం తాలూకు ప్రముఖలక్షణం వెట్టిచాకిరీ. తెలంగాణాలో వెట్టి కేవలం భూస్వాములకు అదనపు ఉత్పత్తిని చేజిక్కించుకోవడానికి ఉపయోగపడ్డ ఆర్థిక దోపిడీ రూపం మాత్రమేకాదు, ఒకసార్వత్రిక సామాజిక పీడనారూపం, అంతకు మించి ఒక సాంస్కృతిక వాతావరణం. యూరప్ భూస్వాములు రైతులకు కౌలుకీయగా మిగిలిన భూమిమీద ఆ రైతులచేతనే వెట్టిచాకిరీ చేయించుకుని పంటపండించుకునే వారు. దీనిని Corvee అంటారు తెలంగాణ భూస్వాములు ఈ రకమయిన ఉత్పత్తి దాయకమయిన శ్రమ (productive labour) మాత్రమే కాక, అన్ని రకాల శ్రమలోనూ వెట్టి డిమాండ్ చేసేవారు చేసేవెట్టి ఆయాకులాల కులవృత్తులకు పరిమితమయినదీ కాదు. ఉదాహరణకు చాకలివాళ్ళు ఇంటిచాకిరీ చేయడం వాడుకలో వుండేది, దొర ఇంట్లో ఏవయినా వేడుకలయితే తమ ఇంట్లోనే అయినట్టు అందరూ చాకిరీ చెయ్యాలి. ఎవరి ఇంట్లో ఏశుభకార్యం జరిగినా అది దొర చలవయినట్టు అతనికి కానుకలివ్వాలి. ఎవరికి ఏతగువులొచ్చినా దొరే 'పంచాయితీ' జరిపించాలి. అందుకు ఇరుపక్షాలూ దొరకు దండుగలు ఇచ్చుకోవాలి. ఈ వెట్టిచాకిరీకి దండుగలకూ తోడుపోయింది భూమి సమస్య. ఇందులో గూడ మూడు అంశాలున్నాయి. ఒకటి భూమి పంపిణీలో విపరీతమయిన అసమానత, రెండు కౌలుదార్లకు భద్రత లేకపోవడం, మూడు రైతుల భూములను భూస్వాములు రకరకాల పద్ధతులలో ఆక్రమించుకోవడం.

ఇటువంటి సామాజిక పీడనకు వ్యతిరేకంగా వచ్చింది తెలంగాణా రైతాంగ తిరుగుబాటు. ఈ పీడనకు భూస్వాములుతప్ప తక్కినవారెవ్వరూ (ధనికరైతులతో సహా) మినహాయింపు కాదుగనక ఆ తిరుగుబాటులోగూడ ధనికరైతులనుండి వ్యవసాయ కూలీలదాకా అందరూ తరతమభేదాలతో పాల్గొన్నారు వెట్టిచాకిరీకి వ్యతిరేకంగా మొదలయిన తిరుగుబాటు అభివృద్ధిచెందిన క్రమంలో ఏవిధంగా తనపరిధిని విస్తృతపరచుకుందో తరువాత చూద్దాంగాని, ఇక్కడఆగి ఒకసారి పేవియర్ 'ధనికరైతాంగవాదం ఉద్యమానికిగల కారణాలను ఏవిధంగా అర్థంచేసుకుందో చూద్దాం.

వెట్టిచాకిరీవంటి ఫ్యూడల్ పీడనారూపాలను పేవియర్ కాదనడుగాని, రైతాంగ ఉద్యమాలకు ఫ్యూడల్‌పీడన కారణంకాగలదని అతని ట్రాట్స్కీయిజం ఒప్పుకోదు. ట్రాట్స్కీయిజం ప్రకారం, రైతాంగఉద్యమాలు రావాలంటే ముందుగా వ్యవసాయం వాణిజ్యపంటల ఉత్పత్తిని చేపట్టాలి, వ్యవసాయంలోకి పెట్టుబడి ప్రవేశించాలి, రైతాంగంలో విభజనఏర్పడాలి, ఒక ధనిక రైతాంగం పుట్టుకురావాలి, ఆ ధనికరైతాంగం తన పురోగమనానికి ఫ్యూడలిజం ఒక అవరోధమని గుర్తించి తిరగబడాలి, అప్పుడే రైతాంగఉద్యమాలు వస్తాయి, ఈ 'ధనిక రైతాంగ'వాదాన్ని సమర్థించడం

కోసం పేవియర్ సేకరించిన సమాచారం చాలా ఆసక్తికరమయినది కాబట్టి దాన్ని ఒక సారి పరిశీలిద్దాం.

ముందుగా వాణిజ్యపంటల ఉత్పత్తి రావాలని చెప్పుకున్నాం. తెలంగాణాలో ఆ రకంగా వచ్చినపంటలు వేరుశెనగ, ఆముదం. ఆముదం తెలంగాణాలో గత శతాబ్దం నుండి వుంది. 1925 తరువాత ఆముదంపంట అపారంగా పెరగడం, వేరుశెనగ విస్తరించడం, ఈ రెండుపంటల ఉత్పత్తిలో చాలాభాగం ఎగుమతికావడం (వేరుశెనగలో 98 శాతం, ఆముదంలో 71 శాతం), ఈ కారణాలవల్ల తెలంగాణాలోనికి పెట్టుబడి ప్రవేశించి తెలంగాణ ప్రపంచ పెట్టుబడిదారీ మార్కెట్‌లో భాగమయింది ('ధనిక రైతాంగ'వాదం ప్రకారం). 1925లో వేరుశెనగ క్రిందవున్నది 3000 ఎకరాలుకాగా అది 1937 నాటికి 6 లక్షల ఎకరాలకు ఎదిగింది. ఈ కారణంగా దేశ్‌ముఖ్‌లూ ఇతర భూస్వాములూ లాభదాయకమయిన వాణిజ్యపంటలు పండించడంకోసం భూమిని ఆక్రమించుకోవడం మొదలుపెట్టారు. ప్రభుత్వంఇచ్చే ద్రవ్యసహాయాన్నీ. ఇతర సౌకర్యాలనూ తమ గుత్తలోనికి తీసుకున్నారు. ఈ గుత్తాధిపత్యాన్ని ధనిక రైతాంగం విరసించింది, వాణిజ్యపంటలు పండించడానికి భూమి, పెట్టుబడి, తనకూకావాలని కాంక్షించడం మొదలుపెట్టింది. ఈ రకంగా ధనిక రైతాంగానికీ దేశ్‌ముఖ్‌లకూ వైరుధ్యం ఏర్పడింది, తెలంగాణా రైతాంగపోరాటానికి పూర్వరంగం సిద్ధమయింది.

తరువాతి పరిణామాలు ఈ పూర్వరంగాన్ని మరింత బలపరిచాయి. 1929 తరువాత వచ్చిన అంతర్జాతీయ సంక్షోభంలో ప్రపంచమంతటా జరిగినట్టే హైదరాబాద్ సంస్థానంలో గూడ సరుకుల ధరలు పడిపోయాయి. 1929 నుండి 1934 వరకు బియ్యం ధరసూచిక (index) 45 శాతం, గోధుమ 40 శాతం, జొన్నలు 40 శాతం, ఆముదం 50 శాతం, వేరుశెనగ 68 శాతం, పడిపోయాయి. ధనిక రైతులు కానివారు గూడ ఆహారేతర అవసరాలకోసం, పన్నుకట్టడం కోసం, కొంత పంట మార్కెట్‌లో అమ్ముకోవాలి కాబట్టి దీనితో రైతాంగం బాగాదెబ్బతినింది. మళ్ళీ ఆ భూస్వాముల దగ్గరే అప్పులపాలయింది. మొత్తం గ్రామీణ ప్రాంతాలలో రైతులఅప్పు 1930 నుండి 1939 వరకు హైదరాబాద్ రాష్ట్రంలో 63 శాతం పెరిగింది, తెలంగాణలో నయితే 89 శాతం పెరిగింది. దీనిఫలితంగా రైతులు భూమిని కోల్పోవడం, ఆభూమి భూస్వాముల ఆక్రమణలోకి పోవడం, జరిగివుంటుందని పేవియర్ భావిస్తాడు. కాని ఎంత భూమి పరాయీకృతమయిందో అంచనా వేయలేకపోయానంటాడు.

ఆర్థిక సంక్షోభం తగ్గి క్రమంగా 1940 లు సమీపించేసరికి యుద్ధవాతావరణం వల్ల, పిమ్మట యుద్ధంవల్ల, ధరలు పెరిగాయి. యుద్ధకాల ద్రవ్యోల్బణంవల్ల

బియ్యం ధర సూచిక (1939 నుండి 1944 కు) 100 శాతం, గోధుమధర సూచిక 170 శాతం, పెరిగాయి. పేదరైతులు, వ్యవసాయకూలీలు, తమ వాడకం కోసం కొంత ధాన్యం కొనక తప్పదు కాబట్టి ఈ ద్రవ్యోల్బణం వాళ్ళమీద గట్టిగా దెబ్బ తీసింది. మళ్ళీ వాళ్లు అప్పులపాలయ్యారు. 1939 నుండి 1950 వరకు తెలంగాణ రైతాంగం అప్పుభారం 122 శాతం పెరిగిందని పేవియర్ అంచనా. అయితే మళ్ళీ దీనివల్ల ఎంతమేరకు వాళ్ళభూమి పరాయీకృత మయిందన్న దానికి స్పష్టమయిన అంచనా లేదు.

కాకుండా, ధర పెరుగుతున్న సమయంలో ఆహారధాన్యాలను దొంగనిల్వ (hoard) చేయడం ఎక్కువ కావడంతో హైదరాబాద్ ప్రభుత్వం పట్టణప్రాంతాల ఆహార అవసరాలను దృష్టిలోవుంచుకొని గ్రామాలనుండి నిర్బంధంగా లెవీ (levy) సేకరించడం మొదలుపెట్టింది, ఈ లెవీని భూస్వాములు తమ పరపతిని వినియోగించుకొని తప్పించుకోగలిగారుగాని, ధనికరైతులకు అది సాధ్యంకాలేదు.

దీనంతటి ఫలితాన్నీ పేవియర్ ధనికరైతాంగానికీ దేశ్‌ముఖ్‌లకూమధ్య పెరుగుతూన్న వైరుధ్యంగా చిత్రిస్తాడు. ఒకవైపు ధనిక రైతాంగపు మిగులుఉత్పత్తిని లెవీ రూపంలో నిజాంప్రభుత్వం తీసుకపోతోంది. వేరొకవైపు ప్రభుత్వంఇచ్చే ద్రవ్య సహాయంగానీ ఇతరగ్రామీణ అభివృద్ధిపథకాలుగానీ దేశ్‌ముఖ్‌ల గుత్తఅయ్యాయి. దీనితో ధనికరైతాంగం కన్నెర్రజేసింది, పోరాటానికి సిద్ధమయింది.

అసలు దేశ్‌ముఖ్‌లు ఈ ధనిక రైతాంగాన్ని ఇబ్బందిపెట్టేంతగా వ్యవసాయ అభివృద్ధిమీద గుత్తాధిపత్యాన్ని సంపాదించుకున్నారా, వాళ్ళకసలు వ్యవసాయిక అభివృద్ధిపట్ల అంతటిపట్టింపు ఉండిందా, అని ఎవరికయినా అనుమానం రావచ్చు. దానికి పేవియర్ ఇచ్చేసమాధానం చాలాస్పష్టమయినది : దేశ్‌ముఖ్‌లు ఫ్యూడల్ ప్రభువులు కాదు, పెట్టుబడిదారీ వ్యవసాయదారులు, పైగావాళ్లు వ్యవసాయంలో "ప్రత్యక్షంగా నిమగ్నం" (directly involved) అయ్యారు. విసునూరు రామచంద్రారెడ్డి ఉత్పత్తిలో ఎంతప్రత్యక్షంగా నిమగ్నంఅయ్యాడో జనగామ ప్రజలేచెప్పాలి!

నిజానికి అనాటి దేశ్‌ముఖ్‌లు పూర్తిగా ఫ్యూడల్ ప్రభువులు, వాళ్ళకు పెట్టుబడిదారీ కవచం తొడగటం వికృతమయిన చర్య. అనాటి ధనిక రైతాంగానికి వున్న 'పెట్టుబడిదారీ' స్వభావం గూడ అంతంత మాత్రమే. ఇంతాచేసి, ఈ పెట్టుబడిదారీ అలంకరణకు మూలమయిన ఆముదం వేరుశెనగల ఉత్పత్తి ఏపాటి పరిమాణంలో వుండేది? 1941 నాటికి హైదరాబాద్ సంస్థానంలోని మొత్తం వ్యవసాయ యోగ్యమయిన భూమిలో వేరుశెనగ క్రిందవున్న భూమి 9 శాతం, ఆముదం క్రింద వున్నది

4 శాతం. ఈ మహాభాగ్యానికే వాణిజ్యపంటల పెట్టుబడిదారీ ఉత్పత్తినీ, అందుండి పుట్టిన వైరుధ్యాలనూ, ఊహించడం, ఆ వైరుధ్యాలను ఉద్యమానికి మూలంగా చిత్రించడం, హాస్యాస్పదం.

శాస్త్రీయంగా వ్యాఖ్యానించుకుంటే పేవియర్ ఇచ్చిన సమాచారం నిరుపయోగ మయినది కాదు. మార్కెట్‌లో ఏర్పడ్డ ధరల పెరుగుదల, తగ్గుదల, రైతాంగం మీద ప్రభావాన్ని వేసిందని ఒప్పుకోవడానికి నాటి తెలంగాణలో దేశ్‌ముఖ్‌లూ ధనిక రైతులూ పెట్టుబడిదారీ ఉత్పత్తి కొనసాగించేవారని నమ్మాల్సిన అవసరం లేదు. ప్రభుత్వం భూమిశిస్తును ధాన్యరూపంలోకాక రొక్కపురూపంలో సేకరించడం మొదలు పెట్టిన నాటి నుండీ రైతాంగానికి ఎంతోకొంత మార్కెట్‌తో సంబంధం ఏర్పడింది. ఎందుకంటే పన్ను చెల్లించడానికి అందరూగూడ పంటలో కొంతభాగం అమ్ముకోవాలి కాబట్టి. పైగా, గ్రామీణ స్వయంసంపూర్ణత విచ్ఛిన్నమయ్యేకొద్దీ తమ అవసరాలను గూడ మార్కెట్‌లోనే కొనాలి. 1929 తరువాత వచ్చిన ఆర్థిక సంక్షోభం ప్రపంచ వ్యాప్తంగా కాబట్టి దానివల్ల రైతులు దెబ్బతినడం, తాము మార్కెట్‌లో అమ్మే సరు కులధరలు పడిపోవడంవల్ల అప్పులపాలుకావడం, భూమిని భూస్వాములకు కోల్పోవడం, జరిగివుండవచ్చును. 1939 తరువాత (రెండవ ప్రపంచ యుద్ధకాలంలో) ప్రపంచ వ్యాప్తంగా వచ్చిన ద్రవ్యోల్బణంవల్ల మళ్ళీ ఇటువంటి పరిణామమే సంభవించి ఉండ వచ్చును. సాంప్రదాయికంగా వస్తూన్న భూమి పరాయీకరణకు ఇది కొంత దోహదం చేసివుండవచ్చును.

అంతేకాదు, తెలంగాణా పోరాటం మౌలికంగా వెట్టి వంటి ఫ్యూడల్ దోపిడీ రూపాలకు వ్యతిరేకంగా వచ్చిందని చెప్తున్నాం. రైతులకు మార్కెట్‌లో కొంత సంబంధం ఏర్పడడంతో వెట్టిచాకిరీపట్ల వ్యతిరేకత గూడ పెరగడం సహజం. దీనికి ఆ రైతు లాభంకోసం ఉత్పత్తిచేసే పెట్టుబడిదారీ వ్యవసాయదారుడు కానక్కరలేదు. శ్రమకు రొక్కపు విలువలేనంతకాలం వెట్టిచాకిరీ చేయడం ఒకెత్తు, రొక్కపు విలువ ఏర్పడ్డ తరువాత, అంటే ఒకగంట శ్రమ ఉత్పత్తిచేసే సరుకుకు ఇన్ని రూపాయల విలువ ఉందనీ, ఒక ఎకరంలో పండే పంటకు ఇన్ని రూపాయల విలువ ఉందనీ, తెలిసిన తరువాత వెట్టిచేయడం వేరొకఎత్తు. సారాంశంలో, పేవియర్ వివరించిన మార్పులు ఫ్యూడల్ పీడనకూ, దానిపట్ల వ్యతిరేకతకూ బహుశా పరిమాణాత్మకంగా దోహదం చేసివుండవచ్చును.

తిరిగి ఉద్యమందగ్గరికి పోదాం. అది ప్రారంభమయింది ఆంధ్రమహాసభ ఆధ్వర్యంలో, ఆంధ్రమహాసభ మొదట్లో నిజాం ప్రభుత్వంనుండి రాయితీలు సంపా దించడం, సాంస్కృతిక రంగంలో సంస్కరణలు సాధించడం, మొదలయిన కార్య

క్రిమాలుగల సంస్థగావుండేది. క్రమంగా కమ్యూనిస్టు ప్రభావంలోకి దానిస్వరూపం మారింది. శ్రామికజనం చెదురుమదురుగాజరిపిన ఫ్యూడల్ వ్యతిరేకచర్యలను వ్యవస్థీక రించ గలిగింది. 1944 తరువాత కమ్యూనిస్టు నాయకత్వంలో ఫ్యూడల్ వ్యతిరేక ప్రణాళికను చేపట్టింది. సాయుధమయినదే పోరాటమన్న తప్పుడునమ్మకం వలన తెలంగాణా రైతాంగఉద్యమం దొడ్డికొమురయ్య మరణంతో 1946లో మొదలయిందని చెప్పుతుంటున్నాంగాని, నిజానికి (పేవియర్ గుర్తించినట్టు) అది 1944లోనే మొద లయింది. సూర్యపేట, ఖమ్మంలాంటి కొన్ని ప్రాంతాలలోనయితే వెట్టిచాకిరీ వ్యతి రేక ఉద్యమం 1943లోనే మొదలయింది. ఫ్యూడల్ వ్యతిరేకతతోబాటు, బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి ఏజెంటయిన నిజాంప్రభుత్వాన్ని తొలగించి హైదరాబాదును స్వతంత్ర భారతదేశంలో భాగంచేయాలనే 'జాతీయ విమోచన' అంశంగూడ ఆ పోరాటంలోవుంది. అయితే ఈ అంశాన్ని ఈ రూపంలోకాక 'విశాలాంధ్ర' ఏర్పాటు రూపంలో పార్టీగుర్తించినట్టుంది.

అటువంటి పోరాటంలో ఎటువంటి వ్యూహాన్ని అవలంబించాలన్న ప్రశ్నకు సమాధానం 1935 తరువాత ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో జరిగిన రెండు ముఖ్య మయిన పోరాటాలు చూపాయి. ఒకటి సోవియట్ రష్యా మార్గదర్శకత్వాన నడిచిన ఫాసిస్టు వ్యతిరేక పోరాటం. రెండు చైనా విప్లవ పోరాటం. ఈ రెండూ గూడ 'ఐక్యసంఘటన' మీద ఆధారపడ్డాయి. ప్రధాన శత్రువుకు వ్యతిరేకంగా కలిసిరాగల వర్గాలనూ సెక్షన్లనూ కార్మికవర్గ ఆధిపత్యం క్రింద సంఘటిత పరిచేది 'ఐక్యసంఘటన' ఫ్యూడల్ వ్యతిరేక జాతీయవిమోచన పోరాటంలో అట్లా కలిసిరాగల సెక్షన్లలో ధనిక రైతాంగం, చిన్నవ్యాపారస్తులు, పట్టణప్రాంత పెటీబూర్జువావర్గం, జాతీయబూర్జువా వర్గం, ముఖ్యమయినవి. ఆనాటి పార్టీ ఈ వర్గాలను కలుపుకొచ్చి కార్మికవర్గ నాయ కత్వాన స్పష్టమయిన రాజకీయ ఐక్యసంఘటనను నిర్మించిందనడం అతిశయోక్తి అవుతుందిగాని, ఐక్యసంఘటన రాజకీయాలు మాత్రం సంకల్పితంగానో అసంకల్పి తంగానో- ఉద్యమ ఆచరణలో కనిపిస్తాయి.

ఈ 'ఐక్యసంఘటన' రాజకీయాలే ట్రాట్స్కీయిజానికీ ఇతర 'ధనిక రైతాంగ' వాదాలకూ గిట్టవు. స్టాలిన్ వ్యతిరేకత, తరువాతి కాలంలో మావో వ్యతిరేకత, ట్రాట్స్కీయిజానికున్న ముఖ్యలక్షణాలు. అందుకే స్టాలిన్, మావోల నాయకత్వంలో రూపొందిన వర్గ ఐక్యసంఘటనను వ్యతిరేకించడం ట్రాట్స్కీయిస్టుల ప్రధాన వ్యాపకం. ఈ దృక్పథం నుండి పుట్టిందే 'ధనిక రైతాంగ'వాదం ఆ వాదాన్ని ఉపయో గించి తెలంగాణా ఉద్యమ చరిత్రను పేవియర్ రాయడంలో గల ఉద్దేశ్యం, స్టాలిన్

మావోల వారసత్వాన్నీ, చైనా విప్లవ అనుభవం వెలుగులో నడుస్తూన్న వివిధ మూడవ ప్రపంచ దేశాల ప్రజాస్వామిక విప్లవాల్నీ, వ్యతిరేకించడం.

ఆ వాదం ఈ రకంగా నడుస్తుంది: శ్రామికవర్గం శ్రామికేతర వర్గాలతో, ముఖ్యంగా ధనిక రైతాంగం, జాతీయ బూర్జువా వర్గాలతో, ఐక్యసంఘటన కట్టడం అనివార్యంగా ఆ శ్రామికేతరవర్గాల అవసరాలకు శ్రామికవర్గాన్ని లోబరచడానికి దారి తీస్తుంది. అందుకే అట్లాంటి ఐక్యసంఘటన మీద ఆధారపడ్డ విప్లవోద్యమాలన్నీ గూడ ఒకనాడుకాకుంటే ఒకనాడు వైఫల్యాన్ని పొందుతాయి. ట్రాట్స్కీయిజం ఇది వరకు చైనావిప్లవం మావోమరణానంతరం ఎదురుకొంటూన్న సమస్యలను ఈ రకం గానే వ్యాఖ్యానించింది (ఉదాహరణకు నిగెల్‌హారిస్ చైనామీద రాసినపుస్తకం). పేవి యర్ తెలంగాణా పోరాటాన్నిగురించి రాసిందీ ఈ దృక్పథంతోనే. దానికికావలసిన భూమికగా, దేశ్‌ముఖ్‌లకూ ధనికరైతాంగానికీ భూమికోసం పెట్టుబడికోసం బలమయిన పెట్టుబడిదారీ వైరుధ్యం ఏర్పడ్డట్టు ఏరకంగా చిత్రించాడో ముందుచూసాం. ఆ వైరుధ్యంవల్ల పోరాటానికి సిద్ధమయిన ధనికరైతాంగానికి పోరాడడానికి అవసర మయిన పేదరైతాంగపు మద్దతును కమ్యూనిస్టుపార్టీ సంపాదించిపెట్టింది. స్టాలిన్ మావోలు రూపొందించిన ఐక్యసంఘటన రాజకీయాలను ఆశ్రయించి ధనికరైతాం గాన్ని పేదరైతాంగంతో కలుపుకొచ్చి పేదరైతాంగాన్ని ధనికరైతాంగం అవసరాలకు లోబరిచి, చివరికి యూనియన్‌సేనల ప్రవేశంతరువాత ధనికరైతాంగం అవసరాలను కాంగ్రెస్‌పార్టీ తీర్చగలదుకాబట్టి ఆ వర్గానికి పోరాటంపట్ల విముఖత ఏర్పడగా, పార్టీ పోరాటానికి స్వస్తిచెప్పింది. ఇది భారత కమ్యూనిస్టుపార్టీకో లేక తెలంగాణాకో పరి మితమయిన వైపరీత్యమనుకోవద్దు. ఇది 'ఐక్యసంఘటన' రాజకీయాల అనివార్య పర్యవసానం. ఈ వైపరీత్యం ఎందుకు అనివార్యమో ట్రాట్స్కీయిజం ఎక్కడా వివరించలేదుగాని, పేవియర్ చూపించే ఒకకారణం, పార్టీనాయకులు ధనికరైతాంగం నుండి రావడం. మరి చైనా వియత్నాం లావోస్ కంపూచియా జింబాబ్వే తదితర విప్లవాలు 'ఐక్యసంఘటన' రాజకీయాలనే అనుసరించాయిగదా, వాటి నాయకులుగూడ చాలామంది ధనికరైతాంగంనుండో పెటీబూర్జువా వర్గంనుండో వచ్చారుగదా అంటే ట్రాట్స్కీయిజం ఆ విప్లవాలను గుర్తించదు, ఆ నాయకులను అసలు మార్క్సిస్టు లుగా అంగీకరించదు.

అసలు విషయం చాలా సంక్లిష్టమయినది. 'ఐక్యసంఘటన' అనగానే అందులో అంతర్గతంగా వైరుధ్యాలుంటాయి. ఆవైరుధ్యాలు పార్టీలోనే ప్రతిఫలించడం గూడ సహజం. పార్టీలోనే పేదరైతాంగం పక్షం తీసుకునేవారు, ధనిక రైతాంగం పక్షం తీసుకునేవారు, హైదరాబాద్ యూనియన్‌లో విలీనం కాగానే ఉద్యమలక్ష్యం నెర

వేరిందనుకునేవారు, వ్యావసాయిక విప్లవంతోనే ఆ లక్ష్యం నెరవేరగలదనుకునేవారు, ఉండడం సహజం. దీనికి ఆయావ్యక్తుల సామాజిక పూర్వరంగం ఎంతవరకు కారణమన్నది యాంత్రికంగా నిర్ధారణ చేయాల్సిన విషయంకాదు. సామాజిక పూర్వరంగానికీ రాజకీయాలకూ సంబంధం వుంటుందిగానీ ఆ సంబంధంలో ఏరకమయిన అనివార్యతాలేదు. ఉందనుకోవడం భౌతికవాదం కాదు.

ఈ సంక్లిష్టత ఉద్యమక్రమంలో బాగా కనబడుతుంది. మొదట్లో వెట్టి, దండుగలు, మొదలయిన సామాజికపీడనా రూపాలకు వ్యతిరేకంగా మొదలయిన ఉద్యమం 1946 తరువాత భూమి ఆక్రమణకు దారితీసింది. కౌలుదార్లు కౌలుభూములను స్వంతం చేసుకోవడం ద్వారా 8 లక్షల ఎకరాలను భూస్వాముల నుండి గుంజుకున్నారు. భూస్వాములు రైతుల నుండి అక్రమంగా చేజిక్కించుకున్న భూమిని రైతులు తిరిగి ఆక్రమించుకోవడం మొదలుపెట్టారు. తరువాతి కాలంలో కమతాల పరిమాణంపై పరిమితులు (land - ceilings) నియమించి మిగులుభూమిని రైతులకు పంచడం మొదలు పెట్టారు. ఈ విధంగా స్వాధీనపరచుకున్న భూమి మరొక రెండులక్షల ఎకరాలు.

ఆ పరిమితిగూడ స్థిరంగాలేదు. మొదట్లో, నిజాం వ్యతిరేక పోరాటంలో కలిసి రాగల పెత్తందార్లను దూరంచేసుకోగూడదనే ఉద్దేశ్యంతో పరిమితి 20 ఎకరాలు తరి, 200 ఎకరాలు ఖుష్కి (మెట్ట) వుండేది. 10 ఎకరాలు ఖుష్కి 1 ఎకరం తరిపొలానికి సమానమన్న అంచనావల్ల. దీనిఅర్థం 40 ఎకరాల తరిపొలాన్ని గరిష్టపరిమితిగా నియమించారని, ఉద్యమక్రమంలో ఇది తగ్గి కొన్ని ప్రాంతాలలో 10 ఎకరాలు తరి, 100 ఎకరాలు ఖుష్కికి దిగింది. ముఖ్యంగా, అప్పటి నల్గొండజిల్లాలో (అంటే ఇప్పటి నల్గొండే కాకుండ, ఇప్పటి వరంగల్‌లోని జనగామ, చేర్యాల, కొడకండ్ల ప్రాంతాలు ఈ ప్రాతిపదికను విస్తృతంగా అమలుచేయడమేకాక, పేద రైతాంగం బలంగా ముందుకొచ్చిన చోట దాన్ని 5 ఎకరాలు తరి, 50 ఎకరాలు ఖుష్కికి తగ్గించడం జరిగింది (ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడ్డ తరువాత కాంగ్రెస్ ప్రభుత్వం నియమించిన గరిష్ట పరిమితి - 14 ఎకరాలు తరి - కంటె ఇది 30 శాతం తక్కువ). ఇవన్నీ పేవియర్ కాదనడుగానీ, కమ్యూనిస్టుపార్టీ అనుసరించిన 'ఐక్యసంఘటన' రాజకీయాలు ఉద్యమానికి ధనిక రైతాంగ స్వభావాన్ని అనివార్యంగా ఒకపక్క ఇస్తుండగా, నల్గొండలో మాత్రం దానికి తట్టుకొని పేదరైతాంగం పక్షంవహించిన నాయకత్వం వచ్చిందంటాడు. కాని వాస్తవానికి అప్పటిపార్టీ డాక్యుమెంట్లనుబట్టిచూస్తే పార్టీలోనూ ఆంధ్ర మహాసభలోనూ భూమిపంపిణీ గురించి విభేదాలున్నట్టు, అన్ని ప్రాంతాలలోను కొందరు పేదరైతుపక్షం, కొందరు ధనిక రైతుపక్షం, వహించినట్టు, కొందరు 'విలీన'వాదులు, కొందరు విముక్తివాదులు ఉన్నట్టు, తెలుస్తుంది. ఇందులో ఆరుట్ల

రామచంద్రారెడ్డి వంటి ధనికరైతుపక్షం వహించిన విలీనవాద నల్గొండ నాయకులూ ఉన్నారు. భూమిపంపిణీపట్ల చాలా అలసత్వం ప్రదర్శించిన ఖమ్మం వంటి ప్రాంతాలలో యూనియన్ సేనలను తీవ్రంగా ప్రతిఘటించిన వాళ్లూ ఉన్నారు.

కాకుండా ఐక్యసంఘటన విలువకోసం సహజంగానే ధనికరైతాంగానికి కొన్ని రాయితీలు ఇవ్వవలసి ఉంటుంది. ఐక్యసంఘటన వ్యూహరీత్యా, సిద్ధాంతరీత్యా, తప్పంటే వేరుగానీ, కాదంటే సమస్యస్వరూపమే మారుతుంది. చైనా విప్లవపోరాటంలో గూడ మనకు అన్నిదశలలోనూ ఈ సమస్యకనబడుతుంది. ప్రతిదశలోనూ పార్టీ ఐక్యసంఘటనను దృష్టిలోవుంచుకొని ధనిక, మధ్యతరగతి, రైతాంగానికి రాయితీలు ఇవ్వడం, మళ్ళీ క్రిందినుండి పేదరైతాంగం ఒత్తిడివల్ల పథకాన్ని విప్లవీకరించడం, కనబడుతుంది. విప్లవంతరువాత, నూతన ప్రజాస్వామిక దశనుండి సోషలిస్టుదశకు పరిణామంచెందే క్రమంలోగూడ, ధనిక, మధ్యతరగతి, రైతులవిరసనను దృష్టిలో వుంచుకొని వ్యావసాయిక సమిష్టీకరణను ఒక్కొక్క అడుగే అతిజాగ్రత్తగా పార్టీ ముందుకు నడిపిస్తూండగా పేదరైతాంగం ఒకవెల్లువగా ముందుకువచ్చి వ్యావసాయిక సమిష్టులను తామేఏర్పరచినతీరు, ఆ తరువాత పార్టీ ఆ ఏర్పాటుకు తానే నాయకత్వం వహించి ముందుకు తీసుకుపోయినతీరు, చైనా విప్లవచరిత్ర ఎరిగినవాళ్ళకు పరిచితమే. From the masses to the masses అనండి, ఐక్యసంఘటనలో అంతర్గతంగా unity and struggle అనండి, మావోఆలోచనతో పరిచయమున్న వాళ్ళకు ఈ క్రమంలో వింతేమీలేదు.

చైనావిప్లవంతో పోల్చడంలోగల ఉద్దేశ్యం, తెలంగాణా పోరాటానికి చైనా విప్లవపోరాటానికున్న స్పష్టత వుండిందని ఋజువుచేయడంకాదు, విషయంలోని సంక్లిష్టతను వివరించడం మాత్రమే. నిజానికి చైనా విప్లవపోరాటానికున్న స్పష్టమయిన లక్ష్యం లేకపోవడమేకాదు, తెలంగాణాలో ఐక్యసంఘటన ఆచరణలోగూడ ఎన్నో లోపాలు కనబడతాయి. చాలాసందర్భాలలో పార్టీ తీసుకోగలిగినంతగా పేదరైతాంగం పక్షం తీసుకోలేకపోయిందని ఆప్పటిపార్టీ డాక్యుమెంట్లు తెలుపుతాయి. పైనచూపినట్టు, వరంగల్-నల్గొండ ప్రాంతాలలో 10 ఎకరాలుతరి, 100 ఎకరాలు ఖుష్కీ, అన్న పరిమితిని అమలుచేసారు. జనగామలాంటిచోట్ల దాన్ని 5,50 ఎకరాలకుగూడ తగ్గించారు. 1950 నాటికి సారవంతమయిన ప్రాంతాలలో పరిమితిని 2 ఎకరాలుతరి 20 ఎకరాలు ఖుష్కీకి తగ్గించాలని (అంటే మొట్టమొదటి పరిమితిలో 10వ వంతు) ప్రతిపాదించడం జరిగింది. అయితే అమలుజరిపేలోపల పోరాటం విరమించబడింది.

కాని ఇతరప్రాంతాలలో పార్టీనిర్ణయాలను ఉల్లంఘించి పరిమితికంటే ఎక్కువ భూమిని ఉండనిచ్చారు. ఖమ్మంతాలూకాలోను, మధిరతాలూకాలోను మధిరఫిర్కాలోను,

అసలు భూమిపంపకమే జరగలేదని 1949 నాటి ఒకపార్టీ డాక్యుమెంటు తెలుపుతుంది.
భూమిపంపకం జరిగినచోట్లగూడ కొన్ని సందర్భాలలో పేదరైతులకుకాక, ఉద్యమం
లో ఆస్తులు కోల్పోయారన్న మిషమీద ధనికరైతులకు, మధ్యతరగతి రైతులకు,
ఇవ్వడంజరిగింది. అంతేకాకుండ వ్యవసాయకూలీల కూలిపెంపుదల ధనిక, మధ్యతర
గతి, రైతులను దెబ్బతీసే అవకాశంవుందికాబట్టి, కొన్నిచోట్ల కూలిసమస్యలు తీసు
కోకనేపోవడం జరిగింది. పార్టీ నిర్ణయంప్రకారం జీతగాళ్ళజీతం నెలకు 60 శేర్ల
ధాన్యంనుండి 90కి పెంచాల్సివుండిందిగాని కొన్నిచోట్ల మాత్రమే అది అమలయింది.
ఈ అసమత్వంలోనూ మళ్ళీ అసమానత కనిపిస్తుంది. భూమిపంపకం అసలేజరగని
ఖమ్మంతాలూకాలో జీతగాళ్ళ జీతంమాత్రం 120 శేర్ల జొన్నలకు పెంచబడిందని పైన
పేర్కొన్న డాక్యుమెంట్ అంటుంది.

అదే సమయంలో కొన్ని విషయాలలో పార్టీ ప్రజలకంటేగూడ 'అతివాదాన్ని'
ప్రదర్శించింది. అప్పులను పూర్తిగా రద్దుచేస్తే మళ్ళీ అప్పుదొరకదని రైతాంగం
భయపడిందిగాని, పార్టీమాత్రం అనాలోచితంగా అప్పులను పూర్తిగా రద్దుచేయాలని
డిమాండ్‌చేసింది ఇటువంటి మరొక ఉదాహరణ, భూముల ఆక్రమణకు సంబంధించి
నది. ధనికరైతులూ భూస్వాములూ మాత్రమే కాదు, మధ్యతరగతి రైతులయినాసరే
పేదరైతులకు అప్పులిచ్చి అప్పుకుమారుగా వాళ్ళ భూమిని చేజిక్కించుకొనివుంటే ఆ
భూమిలో కొంతభాగాన్నయినా సరే తిరిగి ఆ పేదరైతుకు ఇచ్చేయాలని రాష్ట్రకమిటీ
నిర్ణయం, ఆచరణలో దీనివల్లపేద, మధ్యతరగతి, రైతులమధ్య స్పర్థలు వస్తున్నా
యని గుర్తించిన తరువాతే, ఆరకంగా నష్టపోయిన పేదరైతులకు భూస్వాముల
భూములుపంచి ఇవ్వాలేగాని మధ్యతరగతి రైతునుండి తీసుకోగూడదనీ, ఏమయినా
సరే అటువంటి ప్రతికేసునూ నిర్దిష్టంగా పరిశీలించి నిర్ణయం తీసుకోవాలేగాని సార్వ
త్రికమయినా సూత్రాలను ఏర్పరచుకోగూడదనీ, అనుకోవడం జరిగింది.

నిజానికి ఆనాటిపార్టీ ఆచరణలోనూ సైద్ధాంతిక అవగాహనలోను ధనిక రైతాంగ
పక్షపాతం ఎంత కనబడుతుందో అగమ్యగోచరత, ఔత్సాహికత, అంతకనబడతాయి.
1950 లో రాసిన ఒక సర్క్యులర్ ఆత్మవిమర్శ చేసుకునే క్రమంలో ఈ రకంగా
అంటుంది : "గ్రామం వర్గనిర్మాణాన్ని గురించి ఎక్కడాగూడ సమాచారం సేకరించ
డం జరగలేదు, అంటే ఎవరు భూస్వామి, ఎంతమాత్రం భూమివుంటే రైతును
భూస్వామి అనవచ్చు, అనే విషయాల గురించి సమాచారం సేకరించలేదు. ఈ విశ్లే
షణ లేకపోవడం వలన సరయిన వర్గదృక్పథం అలవర్చుకోలేకపోయాము. 10 ఎక
రాలు తరి, 100 ఎకరాలు ఖుష్కి, కంటె ఎక్కువ భూమి ఉన్నవాళ్లే భూస్వామ్య
వర్గానికి చెందుతారని అంచనా వేసుకున్నాము. దీనివల్ల భూస్వామ్యాన్ని పట్టుబెట్టి

లేకపోయాము." అంతకంటే తక్కువ భూమివున్న ఫ్యూడల్ దోపిడీ రూపాలను అనుసరించేవాళ్ళు భూస్వాములే అవుతారన్న అవగాహన ఇక్కడ లోపించింది. దాని వల్ల "వ్యవసాయ కూలీలకూ, పేదరైతులకూ, కావలసినంత భూమి చిక్కలేదు. ఈ విప్లవ ప్రజానీకంలో చాలా అసంతృప్తి చెలరేగింది ఈ భూస్వాముల దగ్గర అంత భూమి ఎందుకు మిగల్చాలి? వాళ్ళకంటే మా కుటుంబాలు పెద్దవి కదా, మరిమేమెట్లా బ్రతకాలి? అని వాళ్ళు ప్రశ్నించడం మొదలుపెట్టారు" అని సర్క్యులర్ అంటుంది (స్వేచ్ఛానువాదం నాది)

విముక్తమయిన గ్రామాలలో పరిపాలనా నిర్వహణకోసం గ్రామకమిటీలను వేయడంజరిగింది. ఈ కమిటీలలో ఐక్యసంఘటనలో భాగమయిన ధనికరైతాంగ ప్రతినిధులు ఇద్దరు, పేదరైతుల, వ్యవసాయకూలీల, ఇతర గ్రామీణుల ప్రతినిధులు ముగ్గురు, ఉండేవారు, అయితే ఆ ఇద్దరు ధనికరైతులను ఎంచుకోవడానికి ఉపయోగించిన ప్రమాణం, ఆ వ్యక్తులకు 6 ఎకరాలనుండి 10 ఎకరాలవరకు తరి, 30 నుండి 100 ఎకరాలవరకు కుష్కి, ఉండడం (10 ఎకరాల కుష్కిని 1 ఎకరం తరికి సమానంగా పరిగణించారని గుర్తుంచుకుంటే, 6 ఎకరాలు తరి పొలం పైనవున్నవాళ్ళను ధనిక రైతులుగా నిర్ణయించడం జరిగిందని తెలుస్తుంది. దీన్నిబట్టిచూస్తే పార్టీకి 'ధనిక రైతాంగ' స్వభావం వుండేదన్న ఆరోపణ చాలా అసంతృప్తికరమనిపించక తప్పదు.)

అయితే ఇట్లాకేవలం భూమిపరిమాణాన్నిబట్టి వీళ్ళను ధనికరైతులని నిర్ణయించుకుని గ్రామకమిటీలో వేసుకోవడం వలన వాస్తవానికి చాలాచోట్ల గ్రామకమిటీలలో ఇద్దరు భూస్వాములను వేసుకోవడం జరిగిందని పైనఉటంకించిన సర్క్యులర్ అంటుంది. ఇట్లాజరిగినచోట్ల తమనిర్ణయాలను అనుసరించి భూమిపంపకం జరగ లేదని గుర్తిస్తుంది. "ప్రజలు ముందుకు రావడంలేదు" అన్న మిషమీద పంపకం ఆపడం జరిగేదట. జరిపినా, మంచిభూమిని భూస్వాములకే వుండనిచ్చి పనికిరాని భూమినే పంచేవారట. భూస్వాముల మిగులుభూమినిలాక్కొని పంచకుండ ఈ గ్రామ కమిటీలు పేదరైతులమధ్య వచ్చినతగువులను పరిష్కరించడం, ఒకపేదరైతునుండి అరఎకరం భూమితీసి ఇంకొకపేదరైతుకు ఇప్పించడం, మొదలయిన కార్యక్రమాలతో పొద్దుపుచ్చేవట.

ఇక్కడసమస్య, గ్రామకమిటీలలోచేరిన భూస్వాములూ ధనికరైతులూ ఇట్లా ఎందుకు ప్రవర్తించారన్నదికాదు. అటువంటిప్రవర్తన వాళ్ళకుసహజం. పార్టీ ఆ గ్రామకమిటీల ఆచరణపై నిఘాఎందుకు ఉంచలేక పోయింది, అసలు గ్రామకమిటీల నిర్మాణం ఏ వర్గాలకు దోహదంచేసేటట్లుందో ఎందుకు గుర్తించలేక పోయింది, అన్నది సమస్య.

ట్రాట్స్కీయిస్టు 'ధనిక రైతాంగ' వాదాన్ని పక్కకునెట్టినా, బాధ్యతాయుత-అయిన చాలామంది పరిశీలకులు, అప్పటిపార్టీ నాయకులు అత్యధికంగా ధనిక రైతాంగం నుండి రావడం దీనికి కారణమని వాదించడం జరుగుతోంది. ఐక్యసంఘటన రాజకీయాలు అనివార్యంగా ఉద్యమానికి ధనికరైతాంగ స్వభావాన్ని ఇస్తాయనే 'ధనిక రైతాంగ' వాదానికీ ఈ వాదానికీ చాలాతేడావుందని వివరించనక్కరలేదు. అయినా ఈ వాదనగూడ విశ్వసనీయంగాలేదు. వ్యవసాయిక విప్లవపోరాటం తాత్కాలిక-తిరుగుబాటుగాకాక దీర్ఘకాలిక లక్ష్యంతోను, చరిత్రాత్మక గమ్యంతోను, నడవాలంటే దానికి నాయకత్వం వహించేవారికి కొంత ప్రపంచజ్ఞానం, చరిత్రతో పరిచయం, అవసరం. భూస్వామ్యసమాజంలో భూస్వాములకూ ధనికరైతులకూ మాత్రమే అవి ఉంటాయి. అందుకే అటువంటి పోరాటాలకు నాయకత్వం వహించేవారు ఎక్కువగా ఈ వర్గాలనుండేవస్తారు. దీనికి తెలంగాణాయేకాదు, చైనా వియత్నాంలుగూడ మినహాయింపుకాదు.

అంతే కాకుండ పార్టీ ప్రదర్శించిన అగమ్యగోచరత తెలంగాణకు పరిమితమయింది కాదు. భారతకమ్యూనిస్టపార్టీ ఆదినుండి గూడ ఈ గుణం ప్రదర్శించింది. నిజానికి భారత చైనా కమ్యూనిస్టుపార్టీలను పోల్చిచూస్తే చాలా ఆసక్తికరమయిన పోలికలూ తేడాలూ కనబడతాయి. రెండూగూడ 1920ల తొలి సంవత్సరాలలో పుట్టాయి. రెండూగూడ 192[illegible] లో చరిత్రకెక్కాయి (మీరట్ కుట్రకేసు, షాంగై తిరుగుబాటు). 1935 తరువాత జరిగిన దీర్ఘకాలికమయిన ఫాసిస్టువ్యతిరేక పోరాటంలో రెండూగూడ ఐక్యసంఘటన రాజకీయాలను చేపట్టాయి (ఇక్కడ కాంగ్రెస్‌తో, అక్కడ చియాంగ్ కైషక్‌తో). అయినా 1948 చివరి నాటికి చైనా కమ్యూనిస్టుపార్టీ విప్లవానికి ఒక్కడుగు దూరంలో మాత్రమేవుంది, కాని భారత కమ్యూనిస్టుపార్టీ తాను నాయకత్వం వహించిన పోరాటాలలో అత్యంత మహత్తరమయినదయిన తెలంగాణా రైతాంగ పోరాటాన్ని విరమించుకోవడానికి సిద్ధమవుతోంది. అంతేకాదు, ఐక్య సంఘటనకు సంబంధించి అంతర్జాతీయ కమ్యూనిస్టు నాయకత్వం ఇచ్చిన స్థూలమయిన సూచనలను చైనా కమ్యూనిస్టుపార్టీ సృజనాత్మకంగా స్థానిక పరిస్థితులకు అన్వయించగా సిపిఐ మాత్రం వాటిని వర్గసంకర రాజకీయాలకు దిగజార్చిందని తరువాతి కాలంలో అప్పటి కార్యకర్తలే చాలా మంది అంగీకరిస్తున్నారు. 1926లో మావోహూనాన్ రిపోర్టుతో చైనా విప్లవ లక్ష్యానికీ వ్యూహానికీ బీజం ఏర్పడింది. 1948 వరకు భారత విప్లవానికి రాజ్యాధికార లక్ష్యంగానీ వ్యూహంగానీ లేవు. ఆ సంవత్సరంలో ముందుకొచ్చాయి, రెండు పరస్పర వ్యతిరేకమయిన ప్రతిపాదనలు (రణదివె పంథా, 'ఆంధ్ర' పంథా). మూడు సంవత్సరాలలోపుగా రెండింటికీ గోరీకట్టారు, మళ్ళీ నక్సల్బరీ,

# ప్రజల చరిత్ర - వీరుల జ్ఞాపకాలు

కొమరయ్య

మన చరిత్రలు చరిత్రలేనా ?

## 1

చరిత్రరచన ప్రధానంగా రెండురకాలుగా జరుగుతుంది. అసంకల్పితంగా, అన్‌కాన్షియస్‌గా రచించబడే చరిత్రగానూ, ఉద్దేశ్యపూర్వకంగా, ఆలోచనాయుతంగా, కాన్షియస్‌గా రాయబడే చరిత్రగానూ చరిత్రను విడదీయొచ్చును.

ఆదిమ మానవుడినుంచి ఇవాళ్టివరకూ ప్రజలు చరిత్రను నిర్మిస్తూవస్తున్నారు. తాము నిర్మిస్తూవచ్చిన ఈ చరిత్రను రికార్డ్‌చేయాలని వాళ్ళెన్నడూ కాన్షియస్‌గా గుర్తించినట్టు తోచదు. కాని చరిత్ర నిర్మాణ క్రమంతోపాటుగానే వాళ్ళు ఈ చరిత్రను రికార్డ్ చేయడానికుపక్రమిస్తారు. చరిత్రనిర్మాణం ఎంత ఎమోషనల్‌గా ఉంటుందో ఈ చరిత్రకూడా అంత ఎమోషనల్‌గా ఉంటుంది. అందువల్లనే ఈరకమైన చరిత్రలు ముఖ్యంగా కళారూపాల్లో, అంతకంటె ముఖ్యంగా మౌఖిక కళారూపాల్లో తయారవుతాయి. ఈ రకమైన చరిత్రరచన ఆదిమకాలంనుంచి ఇప్పటిదాకా అవిచ్ఛిన్నంగా సాగుతోనేవస్తోంది. మధ్య మధ్య ఇది లిఖితరూపంకూడా ధరిస్తోంది. సాంఘిక చరిత్రరచనలకు ఇవే అసలైన మూలాధారాలని, ఈ ముడిసరుకులను సాంఘిక చరిత్ర రచనకుపయోగించుకోవాలని సురవరం ప్రతాపరెడ్డిగారుకూడా గుర్తించిఉన్నారు.

---

వచ్చేదాకా భారత కమ్యూనిస్టు ఉద్యమానికి ఒక స్పష్టమయిన లక్ష్యం, దానికి అనుగుణ్యమయిన వ్యూహం, లేవు. ఇప్పటికీ గూడ రెండు రివిజనిస్టు పార్టీలకూ ఉన్న సకల అవలక్షణాలలో ఒకటి, తమ గమ్యం ఏమిటో తెలియకపోవడం. రాజ్యాధికార లక్ష్యం, దాన్ని సాధించడానికి అవసరమయిన వ్యూహం, లేకుండ దాదాపు 50 సంవత్సరాలు పనిచేసిన ఘనత ఒక్క భారత కమ్యూనిస్టు ఉద్యమానికే దక్కుతుందనుకుంటాను.

ఇవ్వాళ మనం కారణాలు వెతకాల్సింది ఈ ఘనతకేగాని, దానినుండి తెలంగాణా పోరాట విరమణను వేరుచేసి దానికిగల కారణాలను విడిగా అన్వేషించడం అర్థరహితమయినపని. అప్పుడు 'ధనిక రైతాంగ' వాదాలు ఎంత అసంతృప్తికరమయినవో అర్థమవుతుంది. ఆరుట్ల రామచంద్రారెడ్డిని భూస్వామో ధనికరైతో అనవచ్చు, కాని రణదివేనీ, డాంగేనీ, పిసిజోషీని ఏమనాలి ? పెటీబూర్జువాలు అనేటట్లయితే అదోఇదో కానివారు ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ నాయకులలో ఎంతమంది ?

ఇవికాక మరోరకం చరిత్రలున్నాయి. ఇవి ప్రజలపాత్రను గుర్తించవు. ఇవి కాన్షియస్‌గా, ఉద్దేశ్యపూర్వకంగా ప్రజల పాత్రనుతగ్గించి, వీరులపాత్రనుపెంచి రాసే చరిత్రలు. చరిత్రను ప్రజల నిర్మాణ క్రమాభివృద్ధిగాకాక కొన్ని సంఘటనల వరుస గానూ, ఆ సంఘటనలకు నిర్మాతలు కొందరు వీరులుగానూ ఈ చరిత్రలు భావిస్తాయి. ఇ.ఎచ్ కార్ ఇలాంటి చరిత్రలగురించే చరిత్రంటే ఎంపికచేసిన వాస్తవాల క్రోడీకరణే అనేనమ్మకం వాడుకలో ఉందనిరాశాడు.

నిజానికి ప్రజలచరిత్రే చరిత్ర. ప్రజలే చరిత్రనిర్మాతలని విశ్వసించే చరిత్రే చరిత్ర. మార్క్సిస్టు దృక్పథంలో చరిత్రరచన ప్రారంభమైనప్పట్నుంచీ వీరుల చరిత్రస్థానంలో ప్రజల చరిత్రరచన ప్రారంభమైంది. చరిత్రనిర్మాతలు ప్రజలేననే అంశం లిఖితచరిత్రలో తనస్థానాన్ని పదిలపరచుకోవడం మొదలైంది.

ఈ పరిణామం ఆ తర్వాతి కాలంలో కమ్యూనిస్టులు రాసే చరిత్రలన్నీ ప్రజల చరిత్రలే అవుతాయనే ఒక భ్రమ ప్రబలం కావడానికూడా దారితీసింది.

ఒకనొక "చారిత్రాత్మక" ఘటన గురించి, ఒకానొక "చారిత్రాత్మక" జనజీవన క్రమం గురించి వివరించే, రాయబడే ప్రతి వాక్యమూ, ప్రతి అక్షరమూ చరిత్ర అయిపోతుందనే భ్రమ మనలో చాలామందికి ఉంది. మరీ ముఖ్యంగా ఈ రచన వందల పేజీలకు పెంచబడి ఒక "మహద్గ్రంథం"గా అవతరించినపుడు దాన్నొక ప్రామాణిక చరిత్రగా గుర్తించడం మనకలవాటైపోయింది.

ఈ భ్రమల వల్లనే, ఈ పొరపాటు అవగాహనల వల్లనే తెలంగాణ విమోచనోద్యమం గురించి వెలువడిన రచనలన్నీ చరిత్రలుగానే పరిగణించబడుతున్నాయి. తెలంగాణ విమోచనోద్యమంలో భాగస్వాములు కాని వాళ్ళు, పరిశోధకులు రాసిన పుస్తకాలు పక్కనపెడితే ఉద్యమనాయకులూ, కార్యకర్తలూ 'అనుభవాలు', 'జ్ఞాపకాలు', 'స్మృతులు', 'గుణపాఠాలు', 'వాస్తవాలు' మొదలైన పేర్లతో పుస్తకరూపంలో వెలువరించిన పదిహేనువందల పేజీల సాహిత్యమూ, చెదురుమదురుగా పత్రికల్లో సంకలనాల్లో ప్రచురితమైన మరో వెయ్యిపేజీల సాహిత్యమూ చరిత్రగానే లెక్కించబడుతున్నది. సాధారణ పాఠకులు మాత్రమేకాదు, సమీక్షకులూ, విమర్శకులూ, పరిశోధకులూ గూడా ఈ సాహిత్యాన్నంతా చరిత్రగానే లెక్కించారు. అందువల్లనే ఈ రచనలను "సవివరమైన తెలంగాణ పోరాట చరిత్ర" అనీ, "అత్యంత చిరస్మరణీయమైన తెలంగాణ పోరాట చరిత్రకు ఇది నిజమైన కానుక" అనీ, "తెలంగాణ పోరాటానికి సంబంధించిన సాధికారికమైన సమగ్రమైన చరిత్ర" అనీ, "పోరాటాభివృద్ధిని గురించిన సమగ్రమైన వివరణ" అనీ, "సంక్షిప్త విశ్లేషణ" అనీ, "నిర్ధారణ"

అనీ రచయితలూ అనుకున్నారు, సమీక్షకులూ అనుకున్నారు ఇక తమ పుస్తకంతో పోరాట చరిత్రకు తుదిపలుకు పలకవచ్చుననీ, తమదే సాధికారికమైన నిర్ధారణ అనీ అనుకున్నారు, కాని నిజానికి ఈ రచనలేవీ చరిత్ర కానేకావు. కొన్ని మినహాయింపులతో ఈ రచనలను తెలంగాణ విమోచనోద్యమ చరిత్ర రచనకు పనికొచ్చే ముడిసరుకులుగానో, చారిత్రిక శకలాలుగానో మాత్రమే గుర్తించాలి. ఐతే ఈ శకలాలు గూడా అపోహలను, దురభిప్రాయాలను, అవగాహనాలోపాలను, వక్రీకరణలను, అతిశయోక్తులను వాస్తవాలఎంపికను అధిగమించలేదనే విషయాన్ని దృష్టిలోఉంచుకోవాలి.

ఈ వ్యాసం ఈ అన్ని "చారిత్రిక" రచనలను విమర్శనాత్మకంగా పరిశీలిస్తుంది. ఈ వ్యాసపరిధిలోకివచ్చే ప్రధానరచనలు

1. రాజేశ్వరరావు, చండ్ర - చరిత్రాత్మక తెలంగాణ పోరాటం, 1972
2. నారాయణరెడ్డి, రావి - వీరతెలంగాణా - నా అనుభవాలు, జ్ఞాపకాలు 1972
3. రాజేశ్వరరావు, సిఎచ్, రామచంద్రారెడ్డి ఆరుట్ల, కృష్ణారావు, వైవి - చారిత్రాత్మక తెలంగాణ సాయుధ పోరాటం - భూస్వామ్య విధానం రద్దుకై రైతుల వీరోచిత తిరుగుబాటు, 1973
4. Gour, Raja Bahadur,
   Glorious Telangana Armed Struggle, 1973
5. రామచంద్రారెడ్డి, ఆరుట్ల - తెలంగాణ పోరాట స్మృతులు, 1981
6. Sundarayya, P - Telangana peoples' struggle and it's Lessons, 1972.
7. బసవపున్నయ్య, మాకినేని - తెలంగాణ సాయుధ పోరాటం - వాస్తవాలు, 1972
8. పుల్లారెడ్డి, చండ్ర - వీరతెలంగాణా విప్లవ పోరాటం, 1968
9. Pulla Reddy, chandra - The Great Heroic Telangana Struggle, 1981.
10. వెంకటేశ్వరరావు, దేవులపల్లి - భారత విప్లవ పంథాను చూపిన తెలంగాణ సాయుధ పోరాటం, 1982.

(సుందరయ్యగారి పుస్తకం తెలుగు అనువాదం దొరకవందువల్ల ఇంగ్లీషు పుస్తకమే ఉపయోగించడం జరిగింది. అందువల్ల ఉటంకించిన భాగాల అనువాదంనాదే,

## 2

## వర్తమానం చెల్లువకు గతం అడ్డుకట్ట

తాత్కాలిక ప్రయోజనాలకు, దీర్ఘకాలిక ప్రయోజనాలకూ ఉన్న భేదాన్ని మార్క్సిస్టులు గుర్తిస్తారు. ఈ తేడాను గణనలోకి తీసుకొంటూ తమ కార్యక్రమాన్ని ప్లాన్ చేసుకుంటారు ఊహాజనిత సోషలిస్టులకూ, మార్క్సిస్టులకూ మౌలికంగా ఉండే తేడాల్లో ఇది ఒకటి. ఐతే తాత్కాలిక ప్రయోజనాలకూ, దీర్ఘకాలిక ప్రయోజనాలకూ మధ్య ఉన్న తేడాను గమనించకపోవడమూ చెరిపివేయడమూ తెలంగాణ విమోచనోద్యమ జ్ఞాపకాల రచనల్లో అతిఎక్కువగా జరిగింది.

1951 అక్టోబర్ 20న పోరాటవిరమణ నిర్ణయం తీసుకోబడింది. అనాటినుంచి 1968 అక్టోబరుదాకా, అంటే పదిహేడేళ్ళపాటు తెలంగాణ విమోచనోద్యమం గురించిన అంచనాలుగానీ, సమీక్షలుగానీ, కనీసం జ్ఞాపకాలుగానీ ఉద్యమనాయకుల్లో ఏ ఒక్కరూ ప్రకటించలేదు. ఈ పదిహేడేళ్ళ మౌనంఎందుకో స్పష్టమే : ఈ పదిహేడేళ్ళకాలంలో పార్టీలో పూర్తి స్తబ్దత ఏర్పడిఉంది. తెలంగాణా విమోచనోద్యమ ఉజ్వలజ్ఞాపకాలను నెమరేసుకోవడానికూడా శక్తిలేనంత నిర్వీర్యతలో నాయకత్వం మునిగిఉంది.

నిజానికి తెలంగాణ జ్ఞాపకాలను ప్రకటించడం ఆ కాలంలో రెండు ప్రయోజనాల దృష్ట్యాకూడా తప్పనిసరి అవసరం. తెలంగాణ విమోచనోద్యమం కమ్యూనిస్టుపార్టీ భారతదేశంలో నాయకత్వం వహించిన మొట్టమొదటి సాయుధ రైతాంగపోరాటం. దీర్ఘకాలిక విప్లవంగా సాగేలక్షణం దానిలోఉందని ఆ అయిదేళ్ళ పోరాటానుభవం చెప్పుతుంది. వ్యవసాయదేశాల్లో విప్లవక్రమం జనరల్‌సమ్మెగా ఉండాలా, దీర్ఘకాలిక సాయుధ రైతాంగపోరాటంగా ఉండాలా అనేఅంశాన్ని భారత కమ్యూనిస్టుపార్టీ ఎజెండా మీదికి తెచ్చిన మొదటిపోరాటంఇది. దీనిచరిత్రను గుర్తుతెచ్చుకోవడం, నిష్పాక్షికంగా ఈ చరిత్రను వివరించడం దీర్ఘకాలిక ప్రయోజనాలదృష్ట్యా అత్యవసరం. కానీ 1968 వరకూ ఉద్యమనాయకులెవరూ ఈకర్తవ్యాన్ని నెరవేర్చలేదు, లేదా తెలిసీ విస్మరించారు. ఇక ఈ చరిత్రను గుర్తుకుతెచ్చుకోవడానికి ఆకాలంలో తాత్కాలిక ప్రయోజనంకూడా ఉండింది. 1951 పోరాట విరమణతర్వాత, 1955 ఆంధ్ర ఉప ఎన్నికల్లో పరాజయంతర్వాత నిరుత్సాహానికిగురైన విప్లవశ్రేణులను ఉత్తేజపరచడం అప్పటి తక్షణావసరం. 1951 నుంచి పార్టీలో పేరుకుపోవడం ప్రారంభించిన (దీని మూలాలు 1948 నుంచే) స్తబ్దతను ఛేదించడం అప్పటి తక్షణఅవసరం. ఈ తక్షణావసరాన్ని తీర్చడానికికూడా పార్టీనాయకత్వానికి ఆ కాలంలో శక్తిలేకపోయింది.

లేదా పార్టీ ఈఅవసరాల్ని తీర్చదలచుకోలేదు. ఈ ప్రయోజనాలకోసం తెలంగాణను స్మరించుకోవడానికి బదులుగా సిపిఐ, సిపిఐ(ఎం)లు ఆకాలంలో కేరళ అసెంబ్లీ విజయాన్ని, కలెక్టరేట్‌లముందు భూ ఆక్రమణలను, మహాజర్ల ఉద్యమాలను, ఛలో ఢిల్లీలను ఆశ్రయించాయి.

సెప్టెంబర్ 1968లో మొదటిసారిగా చండ్రపుల్లారెడ్డిగారు 'వీరతెలంగాణ విప్లవపోరాటం' పేర ఒక చిన్న పుస్తకాన్ని ప్రకటించారు. తెలంగాణ పోరాటాన్ని పునరుద్ధరించాల్సిన అవసరాన్ని ప్రకటిస్తూ క్లుప్తంగానే ఐనప్పటికీ ఉత్తేజపూరితంగా ఆపోరాటాన్ని వివరించిన పుస్తకంఇది.

విరసనను, తిరుగుబాటును, విప్లవాన్ని తన సాంప్రదాయంలో కలిపేసుకోవడం, వాటి సారాన్ని పోగొట్టడం పాలకవర్గాలకు దాదాపు మొదటి నుంచీ అలవాటే. భారత పాలకవర్గాలు ఈ పనిని చాలా ప్రతిభావంతంగా కొనసాగిస్తూ వస్తున్నాయి. పాలకవర్గపు ఈ స్వభావాన్ని భారత రాజకీయరంగంలో కళ్ళకుకట్టేటు చేసింది నక్సల్బరీ. నక్సల్‌బరీ విప్లవరవ్వ దేశమంతా వ్యాపించబోయే దావానలమవుతుందని గ్రహించిన వెంటనే నక్సల్బరీ సాంప్రదాయం మీద, విప్లవ సాంప్రదాయం మీద పాలకవర్గాలు ఈ కుట్రను ప్రయోగించాయి. స్వయంగా ప్రభుత్వమే లెనిన్ శత జయంతికి పూనుకుంది, ప్రగతిశీలమనిపించే జాతీయకరణ విధానాన్ని చేపట్టింది. భూసంస్కరణల గురించి, సోషలిజం గుర్గించి గొంతుచించుకొని అరవడం మొదలు పెట్టింది. తెలంగాణ ప్రజాపోరాటాన్ని ప్రభుత్వం కూడా గుర్తించి కార్యకర్తలకు పెన్షన్‌లు తామ్రపత్రాలు (తెలంగాణ సాయుధ రైతాంగ పోరాట యోధుడు బద్దం ఎల్లారెడ్డి ఈ తామ్రపత్రాన్ని గొప్పసనదుగా ఇవ్వడం, శిలాఫలకాలు స్థాపించడం మొదలు పెట్టింది. ప్రస్తుతం తాము జరుపుతున్న మహోద్యమంలో ఉత్తేజం పొందడానికి ప్రజలు తమ గుండెపొరలనుంచి ఏ జ్ఞాపకాలను మళ్ళీ జీవితంలోకి తెచ్చుకోదలచుకుంటారో వాటిని ప్రజలకు కాకుండాచేసే కుట్ర ఇది. వాళ్ళ యోధులను వాళ్ళకు కాకుండా చేసిన రాజ్యమే ఆ యోధుల జ్ఞాపకాలను తాను పోషించడం ప్రారంభించి ప్రజల్ని ఆ యోధులనుంచి దూరం చేసే కుట్ర ఇది.

ఈ నేపథ్యంలో నక్సల్బరీ తర్వాత భారత రాజకీయాలను పరిశీలిస్తే ప్రజల జ్ఞాపకాల నుంచి ఇంకా చెరిగిపోని విషాదోజ్వల స్మృతులు ఎట్లా పాట్రనైజ్ చేయబడ్డాయో అర్థమవుతుంది. నక్సల్బరీ అన్ని రాజకీయ పక్షాలకు గతవర్తమానాల మీద ఏదో ఒక దృక్పథం ప్రకటించవలసిన అవసరం కలిగించింది. కనుకనే 1972 సెప్టెంబర్‌లో ప్రారంభించి సిపిఐ 'తెలంగాణ సాయుధ పోరాట రజతోత్సవాలు'

జరిపింది. 1973 జులైలో సిపిఐ(ఎం) 'వీరతెలంగాణ విప్లవపోరాట ఉత్సవాలు' జరిపింది. సిపిఐ, సిపిఐ(ఎం)లు ఎన్నో పుస్తకాలు ప్రకటించాయి. ఈ పుస్తకాలన్నీ గూడా నక్సల్బరీని దుమ్మెత్తిపోయడానికి తెలంగాణ పోరాట జ్ఞాపకాలను వాడుకున్నవే. దాదాపు ప్రతి పుస్తకమూ ఈ లక్ష్యాన్ని స్పష్టంగా ప్రకటించుకున్నది. ఉదాహరణకు చండ్ర రాజేశ్వరరావుగారు "....శ్రీకాకుళం జిల్లా నక్సలైట్ ఉద్యమం మన తెలంగాణ పోరాటం అనుసరించిన మార్గాన్నే సరిగా అనుసరించింది. ఐతే ఒక తేడా ఉంది, తెలంగాణ పోరాటాన్ని అత్యధికులైన ప్రజలు బలపరచగా శ్రీకాకుళం పోరాటానికి అట్టి విస్తారమైన ప్రజా తోడ్పాటులేదు.... శ్రీకాకుళ పోరాటం ఒకటిన్నర సంవత్సరాలలో ముగిసిపోయింది...." అని రాశారు. నక్సల్బరీని తప్పని రుజువు చేయడానికి తెలంగాణ జ్ఞాపకాలను వక్రీకరించే ద్రోహానికి కూడా ఈ రచయితలు పాల్పడ్డారు. తెలంగాణ జ్ఞాపకాలను వివరించడం కంటె నక్సల్బరీ మీద తీర్పును ప్రకటించడమే ఈ రచయితలకు ముఖ్యమైపోయింది. తెలంగాణ మీద తీర్పును ప్రకటించడం కాదు గదా కనీసం వాస్తవాలు వివరించడానికైనా ఇరవైఒక్క సంవత్సరాలు ఆలస్యం చేసిన ఈ నాయకులకు నక్సల్బరీ మీద, శ్రీకాకుళం మీద 1972 లోనే తీర్పు ప్రకటించే నైతిక అర్హత ఉందా? నక్సల్బరీని తిట్టాలనే తొందరపాటులో సిపిఐ ఐతే మామూలు లెక్కలు కూడా మరిచిపోయింది. 1946 లో మొదలై 1951 లో ముగిసిన (వాళ్ళ లెక్కప్రకారం 1948 లో ముగియవలసిన) పోరాటానికి 1972 ఎట్లా రజతోత్సవ సంవత్సరం అవుతుందో వాళ్ళకే తెలియాలి.

అసమగ్రంగానే ఐనప్పటికీ పుల్లారెడ్డిగారి పుస్తకం కొంతవరకు తెలంగాణ పోరాటాన్ని జ్ఞాపకంతెచ్చుకోవడంలో ఇమిడిఉన్న దీర్ఘకాలిక ప్రయోజనాలు చర్చించింది. మిగిలిన పుస్తకాలకు ఈ అవసరం పట్టనేలేదు. (పనిలోపనిగా సిపిఐ ప్రత్యేక తెలంగాణ, ప్రత్యేక ఆంధ్రోద్యమాలను ఖండించడానికికూడా తెలంగాణ పోరాటాన్ని వాడుకుంది!)

కనుక తెలంగాణ విమోచనోద్యమాన్ని స్మరిస్తూ విశ్లేషణలు, జ్ఞాపకాలు ప్రకటించడంలో ఆయా రచయితలు, ఆయాపార్టీ ఆలస్యంచేసారా లేదా అన్నది ఒక సమస్య అయినప్పటికీ తెలంగాణ విమోచనోద్యమ స్మరణ అవసరాన్ని వాళ్లెట్లా గుర్తించారన్నది ఇంకాముఖ్యం. ఈ అంశంలో వీళ్ళందరూ మౌలికంగా మార్క్సిస్టు అవగాహనసుంచి దూరమై ఈరచనలు చేశారు. తెలంగాణ రైతాంగం తమవీరోచిత పోరాటంద్వారా మార్క్సిజానికి చేర్చిన సృజనాత్మక కానుకలను ఈ రచయితలందరూ విస్మరించారు. అందువల్లనే దాదాపు తెలంగాణపోరాటం జరిగినంతప్రాంతంలోనే జరిగిన హునాన్ రైతాంగఉద్యమంగురించి చేసిన విశ్లేషణలో మావో రూపొందించిన సృజనాత్మక సూత్రీకరణలు వీళ్ళకు నమూనాఐనా కాలేకపోయాయి.

# 3

## చరిత్ర నిర్మాతలెవరు ?

ప్రజలే చరిత్రనిర్మాతలని మార్క్సిజం చెపుతుంది. మార్క్సిస్టులందరూ ఈ వాస్తవాన్ని విశ్వసిస్తారు. ఇది చారిత్రక భౌతికవాద దృక్పథంలో ఒకభాగం. దీనికి ప్రతిగా భావవాద దృక్పథం వీరులో, కథానాయకులో, రాజులో చరిత్రను నిర్మిస్తారని ప్రచారం చేస్తుంది. ఐతే ప్రజలు మాత్రమే చరిత్ర నిర్మాతలని అంగీకరించని ఏ దృక్పథమైనా అభివృద్ధి నిరోధకమేనని చైనాపార్టీ చరిత్ర రుజువు చేసింది. ప్రజలే చరిత్ర నిర్మాతలనే అంశాన్ని సూటిగా ఖండించడానికి భయపడి చరిత్రను ప్రజలూ కొందరు కథానాయకులూ (వీరులూ) కలిసి నిర్మిస్తారని డొంకతిరుగుడు వాదనను ముందుకుతెచ్చారు లీషావ్-చీ. మావో నాయకత్వాన చైనా కమ్యూనిస్టుపార్టీ ఈ వాదనలో అంతర్లీనంగా ఉన్న అభివృద్ధి నిరోధకత్వాన్ని బట్టబయలుచేసి ఖచ్చితంగా చరిత్ర నిర్మాతలు ప్రజలేననే అంశాన్ని రుజువు చేసింది. దీనితో మార్క్సిజం శ్రామికవర్గ నాయకుల పాత్రను పూర్తిగా నిరాకరిస్తుందని కాదు. సమాజంలో వర్గపోరాటం నడిపే ప్రజలు లేకుండా నాయకులు మాత్రమే వర్గపోరాటాన్ని సృష్టించలేరు. ఆ పోరాటం తనకవసరమైన నాయకత్వాన్ని తప్పనిసరిగా సృష్టించుకుంటుంది. అసలు చరిత్ర నాయకుల ఇష్టానుసారం మాత్రమేకాదు, ప్రజల ఇష్టానుసారం కూడా నిర్మాణం కాదు. అప్పటివరకూ ఏర్పడిఉన్న ఉత్పత్తి సంబంధాలపైన అభివృద్ధిగానే ప్రజలు చరిత్రను నిర్మిస్తారు. ఇదిఅనివార్య పరిణామం.

తెలంగాణ పోరాట చరిత్ర ప్రజల చరిత్ర అనే అంశాన్ని ఈరచయితలందరూ సరిగా అర్థం చేసుకోకుండానే వీరుల చరిత్రగా రాసిపడేశారు. నిజాం పాలనకింద మూడువందల ఏండ్లుగా ప్రజలు నిర్మిస్తూ వచ్చిన చరిత్రను స్థూలంగానైనా వివరించనందుకు ఈ రచయితలను క్షమించవచ్చునేమోగాని కనీసం 1946 కు ముందు ముప్పై ఏళ్ళగానో, నలభై ఏళ్ళగానో ప్రజలు నిర్మిస్తూ వచ్చిన పోరాటచరిత్రను గుర్తించక పోవడం మాత్రం క్షమించరాని నేరం. ఈ అన్ని పుస్తకాలూ 1946 తో, లేదా 44 తో మరికొన్ని ఇంకొంచెం ముందుకువెళ్ళి 40 తో మొదలవుతాయి. 1930 లో ప్రారంభించి ఆంధ్రమహాసభల వివరాలు వరసగా ఇచ్చినప్పటికీ అవి ప్రజలపాత్రను గుర్తించిన వివరణలేమీ కావు. కనీసం 'మాభూమి' నాటకం ద్వారా ప్రఖ్యాతుడైన మృతవీరుడు బందగీ గురించి కూడ ఈ పుస్తకాలేవీ రాయనేలేదు దీన్నిబట్టి 1940కి ముందు తెలంగాణ ప్రజానీకానికి పోరాట చరిత్ర లేదనుకోవాలా ? ఇంకా ఖచ్చితంగా చెప్పాలంటే తెలంగాణలో కమ్యూనిస్టుపార్టీ ఏర్పడక ముందు ప్రజలు పోరాటం తల

పెట్టనే లేదనుకోవాలా ?

తెలంగాణ ప్రజాపోరాటంగురించి రాసిన పుస్తకాల్లో ప్రజలే ఎట్లాలేకుండా పోయారో ఒక్కొక్క పుస్తకం తీసుకొని వివరంగా చర్చించవచ్చును. కాని ప్రజలను లేకుండాచేయడంలో ఈ అన్నిపుస్తకాలూ అవలంబించిన ఉమ్మడి పద్ధతినిమాత్రం వివరిస్తాను.

ఈ పుస్తకాలన్నింటిలోనూ ఒక్కో అధ్యాయం హైదరాబాద్ రాష్ట్ర స్థితిగతులు వర్ణించడానికి కేటాయించబడింది. ఈ అధ్యాయంలో నైజాం రాజ్యాంగయంత్రం వివరించబడినంతగా ప్రజానీకపు సాంఘికార్థిక పరిస్థితులు వివరించబడలేదు. ప్రజల అసంతృప్తి ప్రజ్వలనకూ, అంతిమంగా పోరాటానికీ ప్రధానకారణమైన వెట్టిచాకిరీ గానీ, భూమిసమస్యగానీ అతితక్కువగా చర్చించబడ్డాయి. నాటి తెలంగాణ గ్రామసీమల్లో వర్గవిశ్లేషణకుగానీ, భూసంబంధాల వివరణకుగానీ ఈ రచయితలెవరూ పూనుకోనే లేదు.

1946 నాటికే తెలంగాణ విమోచనోద్యమం అనుభవించిన పురిటినొప్పులున్నాయి. పాలకుర్తి ఐలమ్మ పంటస్వాధీనం, మొండ్రాయి, ధర్మాపురంలలో భూఆక్రమణ మొదలైన సంఘటనలు అవి. ఈ సంఘటనల్లో ప్రజలపాత్ర మనకీ పుస్తకాలు చాలతక్కువగా వివరిస్తాయి. ఆంధ్రమహాసభ (సంఘం) వలంటీర్లు ప్రజలకు ఈపనులు సాధించిపెట్టినట్టుగా ఈ పుస్తకాలువర్ణిస్తాయి.

ఇక 1946-48 కాలపు పోరాటంగురించి వర్ణించడంలో రజాకార్ దాడులకు గురైన ప్రజల కడగండ్లను వివరించినంతగా ప్రజాప్రతిఘటనను వివరించడం జరగలేదు. ఈ కాలంలో కొందరు రచయితలు ప్రజలను పట్టించుకున్నారుగాని ఈ సందర్భంలో కూడా ప్రజానీకం సంఘచైతన్యంపొందిన క్రమంకాక సంఘనిర్మాణ క్రమమే ఎక్కువస్థానం ఆక్రమించినట్టు కనిపిస్తుంది. నిర్మాణం ఒకానొక చైతన్య రూపమేగాని దానంతటదే చైతన్యం కాజాలదు. నిర్మాణంలో సంఘటిత పడడానికవసరమైన చైతన్యంకంటె నిర్మాణాన్ని ముందుకు తీసుకుపోవడానికవసరమయ్యే చైతన్యం ఎంతోభిన్నం.

ఇక 1948-51 పోరాటకాలం గురించి : ఈ కాలంలో పోరాటం కొనసాగించి ఉండకపోవలసిందనే దృక్పథంతోనే సిపిఐ రచయితలురాస్తే, కొనసాగింపు విజయాల రక్షణకొరకు మాత్రమే సాగిఉండవలసిందని, విముక్తి పోరాటంగా ఉండకపోవలసిందని సిపిఐ(ఎం) రచయితలు రాశారు. సరే-పోరాటం గురించి వాళ్ళ దృక్పథమేమైనా ఈ కాలపు చరిత్రలోనైనా ప్రజలు కనిపిస్తారా అంటే అణచివేత దగ్గరతప్ప,

నిర్బంధం దగ్గరతప్ప ప్రజలుఅనేమాటే మరెక్కడా కనిపించదు. నెహ్రూసైన్యా లకు వ్యతిరేకంగా ప్రజలుచూపిన వీరోచిత ప్రతిఘటన ఈ రెండున్నరవేల పేజీల సాహిత్యంలో కనీసం యాభై పేజీలయినా ఆక్రమించి ఉండడంటే అతిశయోక్తి కాదు. ప్రజలమీద నెహ్రూసైన్యాలు జరిపిన దురాగతాలు నాయకులకోసం జరిగిన చర్యలు గానే కనిపిస్తాయి.

ఇవి ప్రజలచరిత్రలు కావని చూపడానికి రెండు సంఘటనలున్నాయి. మొదటిది బైరాన్‌పల్లి పోరాటం. బైరాన్‌పల్లి నాటి నలగొండజిల్లాలో (ప్రస్తుత వరంగల్ జిల్లాలో) ఒక గ్రామం. ఈ గ్రామంచుట్టూవున్న కోటగోడ, బురుజు గ్రామరక్షణలో ఘనమైన పాత్రవహించాయి. 1947 తర్వాత రాజాకార్లకు వ్యతిరేకంగా గ్రామరక్షణ దళాలు జరిపిన పోరాటాలలో ప్రజానీకం వీరోచితంగా పాల్గొన్నారు, ఈ గ్రామ ప్రజానీకపు ఐక్యతను, పోరాటశీలాన్ని గమనించిన రజాకార్లు ప్రతిసారీ రెట్టింపు బలగాలతో, సైన్యం సహకారంతో గ్రామంపై విరుచుకుపడ్డారు. సుందరయ్యగారి పుస్తకం ప్రకారం రజాకార్లు ఐదుసార్లు గ్రామాన్ని లొంగదీసుకోలేక వెనుదిరిగి పోయారని తెలుస్తుంది. ఆరోసారి 1948 ఆగస్ట్ 27న (ఈతేదీ కూడా సుందరయ్యగారు రాయలేదు) మూడు ఫిరంగులతోసహా వచ్చిన నిజాం సైన్యం, రజాకార్ల ముందు పదిపన్నెండు గంటలపాటు ప్రతిఘటించి ప్రజలు ఓడిపోయారు. ఈ ప్రతిఘటన మూడురోజులపాటు సాగిందని గ్రామస్తులు చెపుతున్నారు. మొత్తంమీద 88 మంది ప్రజలు ఈ పోరాటంలో చంపేయబడ్డారు. ఆ జిల్లాకే చెందిన ఇద్దరు నాయకులు రాసిన పుస్తకాల్లోగానీ, సుందరయ్య, పుల్లారెడ్డిగారల పుస్తకాలు మినహా మరే పుస్తకంలోగానీ బైరాన్‌పల్లి ప్రజానీకపు వీరోచిత ప్రతిఘటన ప్రస్తావనైనా ఉండదు. పుల్లారెడ్డిగారి పుస్తకంలో ఒక్కవాక్యమే ఇందుకు కేటాయించబడగా, సుందరయ్య గారు రెండుపేజీలు కేటాయించినప్పటికీ "కొన్ని చెప్పుకోదగిన సాయుధచర్యల్లో" ఒకటిగానే ఇది చూడబడిందిగాని ప్రజల పాత్రను గుర్తించినట్లు కనబడదు. ఈ సంఘటన ఇంత తక్కువగా ప్రస్తావించబడడానికి కారణం బహుశా ఈ ప్రతిఘట నకు నాయకత్వం వహించినవాళ్ళు పార్టీ తాలూకా స్థాయిలోనో, జిల్లా స్థాయిలోనో ఉన్నవాళ్ళు కాకపోవడమేననుకుంటాను. ఈ సంఘటన గురించి ఇది ఒక విపరీత ధోరణి అయితే ఇక్కడ అప్రస్తుతమే అయినప్పటికీ మరొక విపరీతధోరణిని కూడా చెప్పాలి. అది 'నవభారతి' (ఆర్ ఎస్ ఎస్ సంస్థ) ప్రచురించిన ఇందేరావ్ కులకర్ణి పుస్తకం 'హైదరాబాద్ అజ్ఞాత చరిత్రపుటలు'లో బైరాన్‌పల్లి ఘటన వచ్చిన విధం. ఈ పుస్తకం బైరాన్‌పల్లెను భైరవునిపల్లెగా మార్చడమేగాక ప్రజా ప్రతిఘటనకు నాయకత్వం వహించిన 'సంఘం' పాత్రను, స్థానాన్ని అసలేగుర్తించదు. ఈ పుస్త

కం-ప్రకారం రజాకార్లు రెండుసార్లు మాత్రమే వెనుదిరిగి మూడోసారి బైరాన్‌పల్లెను వశపరచుకున్నారు. మొత్తం మరణించినవారి సంఖ్య 90.

ఇంకొక సంఘటన సిపిఐ(ఎం) సాహిత్యంలో పదే పదే చెప్పబడింది. సుందరయ్యగారి పుస్తకంలోనూ, ప్రజాశక్తి 1973 సంచికలోనూ, 1982 సంచికలోనూ ఇది ప్రచురించబడింది. కృష్ణకు భీకరంగా వరదలు వస్తున్నప్పటికీ పార్టీ నిర్ణయాన్ని పాటించడానికై కృష్ణను దాటివచ్చిన కమ్యూనిస్టు కార్యకర్త ముత్తురెడ్డి వెంకటచలం చేసిన సాహసాన్ని ఈ సంఘటన వివరిస్తుంది. కమ్యూనిస్టు కార్యకర్తగా కామ్రేడ్ వెంకటచలం చేసిన సాహసం మనకెప్పుడూ ఉత్తేజకరంగానే ఉంటుంది. కాని వెంకటచలంతోపాటు నదిలోకి దూకటానికి సిద్ధపడిన లంబాడీల సాహసాన్ని మనం గుర్తుకు తెచ్చుకోవద్దా? సుందరయ్యగారు వాళ్ళ గురించేమీ రాయనేలేదు.

ఈ దృక్పథం లోపించడం. దేవులపల్లి వెంకటేశ్వరరావుగారు మిగిలిన చోట్ల నలగొండలో జరిగిన లాంటి పోరాటాలు రాకపోవడానికి అక్కడి నాయకత్వవైఫల్యమే కారణమని, అంటే తమ నాయకత్వం పోరాటాన్ని సృష్టించిందని తమలాంటి నాయకులు లేనిచోట పోరాటాలు ప్రజ్వరిల్లలేదని సూత్రీకరించేంత దూరానికి దారితీసింది.

ప్రధానంగా ఈ రచయితలందరూ నాయకుల ప్రతిఘటననూ, దళాల ప్రతిఘటననూ, నాయకుల, దళాల వీరోచితకార్యాలను అభివర్ణించడానికి ఎన్ని పేజీలుపయోగించారో, ప్రజలపై నిర్బంధాన్ని, ప్రజల వీరోచిత ప్రతిఘటనను చెప్పడానికి అందులో ఐదోవంతు కూడా ఉపయోగించలేదు. ఈ అంశం లోపించడంవల్ల ఈ పుస్తకాలన్నీ కమ్యూనిస్టుపార్టీ చరిత్రలుగానో, దళాల చరిత్రలుగానో, వ్యక్తుల సాహస కృత్యాల జాబితాగానో మిగిలిపోయాయి.

ప్రజలే చరిత్ర నిర్మాతలనే అంశాన్ని విస్మరించి చరిత్రను కొన్ని సంఘటనల గొలుసుగా రాసే సాంప్రదాయిక చరిత్ర రచనా పద్ధతిని కూడా వీళ్ళుపాటించలేదు. సాంప్రదాయిక చరిత్ర రచనతో మనకెన్ని విభేదాలున్నప్పటికీ ఆ చరిత్రకారుల కాలానుక్రమ పద్ధతిని ఒప్పుకుని తీరవలసిందే. కాలానుక్రమాన్ని పాటించనప్పటికీ చరిత్రను గతితార్కిక క్రమనిర్మాణాభివృద్ధిగా వాళ్ళు గుర్తించరనేది వేరేవిషయం. ఈ రచయితలందరూ ఏ సంఘటన ఏతేదీన జరిగిందనేది ఎక్కడా చెప్పరు. బైరాన్‌పల్లి ఘటన గురించి ఈ రచయితలెవ్వరూ ఎన్నడు జరిగిందో రాయనేలేదు. అసలు తెలంగాణ పోరాటం గురించి ఒక సమగ్రకాలానుక్రమణికపట్టిక ఇంతవరకూ ఎవరూ తయారు చేయనేలేదు. విరసం, జనసాహితి తయారుచేసిన పట్టికలు ప్రధానఘట్టాలవే.

## 4

### ప్రజాయుద్ధపల్లవి

జనజీవన సంఘర్షణ కళారూపంపొందడం సహజమైన పరిణామం. సాధార ణంగానే కళలో వ్యక్తీకరించబడుతూఉండే జనజీవితం సంక్షోభానికి గురైనప్పుడు కళారూపాల్లో మరింత ప్రస్ఫుటంగా, మరింత ఉత్తేజపూరితంగా వ్యక్తీకరణ పొందు తుంది. ఇందువల్లనే కళ సంస్కృతి సాహిత్యాలకు విప్లవాలకానుకలే చాలఎక్కువ. అట్లాగే తెలంగాణ విమోచనోద్యమంకూడ సాంస్కృతిక రంగంలోనూ పదనెక్కింది.

"విప్లవవస్తువు, జాతీయరూపం" అని స్టాలిన్ దేనినైతే నిర్వచించిఉన్నాడో అది తెలంగాణ విమోచనోద్యమం మొదటిసారిగా పెద్దఎత్తున సాధించింది. తెలంగాణ జనజీవితంలో విడదీయరాని భాగమైన పాటమాత్రమేకాదు, బుర్రకథ, హరికథ, చిరుతల రామాయణం, తుపాకిరాముడు, అల్లాకెనాం రూపకం, గొల్లసుద్దులు, వీధి భాగోతం బహురూపులవేషం, ధూంలాంటి ఎన్నో జాతీయ కళారూపాలను విప్లవ వస్తువుతోనింపి ప్రయోగాలుచేసింది తెలంగాణ విమోచనోద్యమం.

ఉత్పత్తిశక్తులకూ ఉత్పత్తి సంబంధాలకూమధ్య వచ్చేఘర్షణను న్యాయ, రాజ కీయ, మత, కళాసాహిత్య, తాత్వికరంగాల్లో - ఒక్కమాటలో బౌద్ధికరూపాల్లోకూడా గుర్తించి ప్రజలు పోరాటం ప్రారంభిస్తారని మార్క్స్ చెప్పినమాటను తెలంగాణ రుజువుచేసింది. పునాదిలోపోరాటం ఉపరితలంలో మహత్తరమైన విజయాలను ఎట్లా సాధించగలుగుతుందో తెలంగాణ చూపింది. ఎట్లాపోరాటం సాహిత్యానికి కారణ మైందో, ఎట్లా సాహిత్యం పోరాటానికి ఉత్తేజాన్నిచ్చిందో తెలంగాణ వివరించింది. మేల్కొంటున్న తెలంగాణ పునాదిపట్ల ఉపరితలంపట్ల ప్రజాస్వభావ స్పందనను వ్యక్తీకరించింది. ఉపరితలంలోని ప్రధానమైన విజయాలు సాంస్కృతికోద్యమం లోనే సాధించబడినప్పటికీ మతరంగంలోగానీ, తదితర ఉపరితలరంగంలోగానీ, సాధించినవిజయాలు తక్కువవేమీగావు.

ఈ రచయితలందరూ ఈ అంశాన్ని ఏ కొంచమైనా గుర్తించలేదు. సాంస్కృతి కోద్యమానికీ, సాంస్కృతికోద్యమం ద్వారా పోరాటానికీ ప్రజలందించిన విలువైన కానుకలను వీళ్ళెవ్వరూ గణనలోకి తీసుకోలేదు. ఈ లోపంకూడా వీళ్ళు తమ రచన లను ప్రజల చరిత్రలుగా రాయకపోవడంలోనే ఇమిడిఉంది,

తెలంగాణ ప్రజానీకం అసంకల్పితంగానే రికార్డ్ చేసిన పోరాటచరిత్ర, తెలం గాణ ప్రజానీకం గానంచేసిన పోరాటగాథలు, వాళ్ళు తమకష్టాలనూ, కడగండ్లనూ,

ఆశలనూ, ఆశయాలనూ వ్యక్తీకరించిన కళారూపాలు అసంఖ్యాకంగా ఉండగా సిపిఐ, సిపిఐ(ఎం) వాటిని తమపుస్తకాల్లో రాయకపోవడమేగాక, రికార్డ్ చేయడానికికూడా పూనుకోలేదు. (సిపిఐ ప్రచురించిన తెలంగాణా పోరాటగేయాలు పుస్తకం ప్రాతినిధ్య స్వభావం కలిగిందికాదు). అందువల్లనే నిరక్షరాస్యులైన ప్రజలు కట్టిన ఎన్నో పాటలు తమ సహజ సౌందర్యంతో భాసిస్తూఉండగా, వాటిని గుర్తిఛనైనా గుర్తించని సుందరయ్యగారు తన పుస్తకానికి హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ కవితను అనుబంధంగా ప్రకటించారు. (హరీన్ కవితస్థానాన్ని తక్కువజేయడానికి ఈ మాట చెప్పడంలేదు.)

వాస్తవానికి నాటి సాంస్కృతికోద్యమాన్ని గుర్తించక పోవడానికి, లేదా గుర్తించినట్టు నటించడానికి సిపిఐకి, సిపిఐ(ఎం)కు స్పష్టమైన, బలమైనకారణాలే ఉన్నాయి. అవేమిటంటే ఆనాటి సాంస్కృతికోద్యమాన్ని గుర్తిస్తే ప్రజాపోరాటం సాంస్కృతికోద్యమానికి కారణమవుతుందని, విస్తృతమైన ప్రజాపునాది కలిగిన ఏ ఉద్యమమైనా సాంస్కృతికరంగంలో వ్యక్తీకరణ పొందుతుందని గుర్తించినట్టే అవుతుంది. ఈ సూత్రీకరణను అంగీకరించడమంటే పరోక్షంగా నక్సల్బరీ ఉద్యమానికి ప్రజా పునాదిఉందని అంగీకరించడమే. నిజానికి మొత్తంమీద కాకపోయినా, కొన్ని అంశాలలోనయినా తెలంగాణా పోరాట సాంస్కృతికోద్యమంకన్న నక్సల్బరీ సాంస్కృతికోద్యమం రాశిలోనూ, వాసిలోనూ మిన్న. (తెలంగాణాలో తెలంగాణా వారసత్వాన్ని, నక్సల్బరీ పంథానూకొనసాగిస్తున్న ఆదిలాబాదు కరీంనగర్ రైతాంగ పోరాటంనుంచి వెల్లువుతున్న ప్రజాసాహిత్య కళారూపాలు ఇందుకు సజీవమైన దాఖలా.) జననాట్యమండలి పాటలుమార్చి, అనుకరించి పాడడమూ, ప్రచురించడమూ అలవాటు చేసుకున్న సిపిఐ, సిపిఐ(ఎం)లు ఈ అంశాన్ని పరోక్షంగా గుర్తిస్తున్నట్టేకాని ప్రత్యక్షంగా గుర్తించడానికి వాళ్ళకున్న అభ్యంతరమే తెలంగాణా సాంస్కృతికోద్యమంపట్ల వాళ్ళను మౌనంవహించేట్టు చేసింది.

తెలంగాణా విమోచనోద్యమం సాంస్కృతిక రంగంలో సాధించిన విజయం "గ్రంథాలయోద్యమంవంటి లిఖిత సాహిత్యప్రచారానికీ, రక్షణకూ ప్రారంభమైన ఆంధ్రమహాసభను సాయుధపోరాటం మౌఖిక సాహిత్య ప్రచార వేదికగా" మార్చేవాదం.

## 5

### తప్పులన్నీ ఇతరులవి

కమ్యూనిస్టుల పనివిధానంలో అతిముఖ్యమైనది విమర్శ- ఆత్మవిమర్శ పద్ధతి. మిగిలిన భావజాలాలు విమర్శతో ఆగిపోతాయి. జరిగిన తప్పులన్నిటికీ విమర్శలో

ఇతరుల్లో కారణాలు వెతుకుతాయి. కాని మార్క్సిజం విమర్శను ఆత్మవిమర్శతో ప్రారంభిస్తుంది. ఈ ఆత్మవిమర్శకూడా క్రియాశూన్యమైన ఆత్మవిమర్శ కాదు. కమ్యూనిస్టుల ఆత్మవిమర్శలో సరిదిద్దుకోవడం ప్రధానమైన భాగం.

తెలంగాణా విమోచనోద్యమంలో భాగస్వాములు రాసిన పుస్తకాలన్నిట్లోనూ ఆత్మవిమర్శ అంశం పూర్తిగా లోపించింది. ప్రతి రచయితా అప్పటికీ ఇప్పటికీ భారత విప్లవోద్యమంలో తానమసరించిన పంథాయే సరైందనీ, మిగతా వాళ్ళందరూ తప్పుడు పంథాలు అవలంబించడంవల్లనే నష్టాలు జరిగాయనీ రాసాడు. పార్టీ చేసిన తప్పులకు బాధ్యత ఉమ్మడిగా నాయకత్వానిది కాక కొందరువ్యక్తులదన్నట్టుగా రాసారు. సరైన ఆత్మవిమర్శనా పద్ధతి పాటించక పోవడంవల్లనే ఈ పుస్తకాలేవీ సరైన గుణ పాఠాలు తీయలేకపోయాయి.

ఈ రచనలు ఆలస్యంగా వెలువడడానికి ఈ ఆత్మవిమర్శనా దృక్పథం లేక పోవడం కూడా ఒక కారణం. ఆత్మవిమర్శ చేసుకుని, భవిష్యత్ కార్యక్రమాన్ని రూపొందించుకునే ఉద్దేశ్యమే ఉండిఉంటే ఈ పుస్తకాలన్నీగూడా పోరాట విరమణ కాగానే రాయబడి ఉండేవి.

## 6

## "కంటవిప్పులను చెరిగిన చండ్ర రాజేశ్వరయ్య !!"

భారత కమ్యూనిస్టుపార్టీ (సిపిఐ) 1972 సెప్టెంబర్‌లో తెలంగాణా సాయుధ పోరాట రజతోత్సవాలు ప్రారంభించింది. ఈ ఉత్సవాల్లో భాగంగా 1972, 73 లో నాలుగు పుస్తకాలు ప్రచురించింది. ఈమధ్యనే మళ్ళీ మరొక పుస్తకం ప్రచురించింది.

సిపిఐ దృక్పథం ప్రధానంగా 1948 సెప్టెంబర్ 13 తర్వాత పోరాటం కొన సాగించి ఉండవలసిందికాదని. ఈ అంశం దగ్గర అందరు రచయితలూ ఏకీభవించి నప్పటికీ మిగిలిన కొన్ని విషయాల్లో అందరికీ ఏకాభిప్రాయమేమీలేదు.

పోలీసుచర్య గురించి వాళ్ళదృక్పథాన్ని వాళ్ళ మాటల్లోనే చూడాలంటే "....భారత ప్రజలు ఈ విజయానికి జేజేలు పలికారు. నిజాం నిరంకుశత్వం నుండి విమోచనం లభించినందుకు సంస్థాన ప్రజలు ఉత్సవాలు జరుపుతున్నారు.... భారత యూనియన్ సమైక్యత సంపూర్ణమైంది.... రాజకీయ వర్గసంబంధాల కలయికలో నూతన మార్పులు ఏర్పడ్డాయి", "....ప్రజలు నిట్టూర్పు విడిచారు. హైదరాబాదు సంస్థానంలో ముఖ్యంగా తెలంగాణాగడ్డపై అనేకుల వేలాది అమరవీరుల త్యాగము

ఫలించినందుకు ప్రజలంతా సంతృప్తి చెందారు" "పోలీసు యాక్షన్‌తో నైజాం రజాకారు ప్రభుత్వ దురంతాలు, హత్యలు, దోపిడీలు, మానభంగాలు అన్నీ అంతమైనవి. ప్రజానీకం స్వేచ్ఛా స్వాతంత్ర్యవాయువుల్ని తమ జీవితంలో మొదటిసారి చవి చూశారు."

ఇవి ఎంత అవాస్తవాలో 1948-51 చరిత్ర చూస్తే తెలుస్తుంది. ప్రజలు నెహ్రూ సైన్యాలను ఇంత ఆదరంతో ఆహ్వానిస్తే మరి ఆతర్వాత మూడేళ్ళు ఎందుకుపోరాడారో సిపిఐ వివరించదు ఈ మాటలు ఈ రచయితలు ఎంత నిస్సిగ్గుగా రాశారంటే ఆ తర్వాతపేజీల్లో వాళ్ళే నెహ్రూసైన్యాలకు ప్రజలుచూపిన వీరోచిత ప్రతిఘటననుకూడా వర్ణించారు తర్వాతపేజీలతోనే పైమాటలు ఎంతఅసంబద్ధమో రుజువవుతుంది. నెహ్రూ అభివృద్ధి కాముకతపట్ల ఈ నాయకులకు విశ్వాసంఉంటే ఉండవచ్చునేమోగాని, నెహ్రూ పటేల్ సైన్యాలచేతుల్లో నిరంతరమూ నిర్బంధానికీ, అణచివేతకూ గురవుతున్న ప్రజలకు మాత్రం ఏభ్రమలూలేవు. నిజానికి 1948 సెప్టెంబర్‌కుముందు ప్రజలు పాల్గొన్న పోరాటానికీ, ఆ తర్వాతి పోరాటానికి గుణాత్మకమైన తేడాకాకున్న దశాత్మకమైన తేడా అయినావుంది. 1946-48 పోరాటం ఆత్మరక్షణకోసం, జమీందార్, జాగీర్దారీ వెట్టిచాకిరీ విధానం రద్దుకోసం, వీటికి గొడుగుపట్టిన నైజాం నిరంకుశ పరిపాలనకు వ్యతిరేకంగాసాగితే 1948-51 పోరాటం ప్రజల స్వాధీనంలోవున్న భూమిని కాపాడుకోవడానికి చవిచూసిన గ్రామ రాజ్యఅధికారాన్ని సంరక్షించుకోవడం కోసం సాగింది. ఈ పోరాటం 'తమవాళ్ళే' అనుకోబడే నెహ్రూపటేల్ సైన్యాలకు వ్యతిరేకంగా సాగిందిగనుక దీనికొనసాగింపు దీర్ఘకాలిక జాతీయవిముక్తి పోరాటానికి అనివార్యమైన దృఢమైన, విశ్వాసనీయమైన చోదకశక్తి అయిన వర్గపోరాటంలోగానీ సాధ్యంకాదు. ఒకప్పటి పాశికదిమాండ్ల పోరాటం 48-51కాలానికి విమోచనోద్యమంగా రూపుదాల్చింది

ఖచ్చితంగా ఈ కాలపు పోరాటాన్నే సిపిఐ ప్రస్తుతం వ్యతిరేకిస్తోంది. అంటే రాజ్యంమీద స్పష్టాస్పష్టంగానైనా ఎక్కుపెట్టబడిన పోరాటాన్ని సిపిఐ వ్యతిరేకిస్తోంది, ఆ కాలంలో పోరాటం కొనసాగించి ఉండవలసింది కాదని సిపిఐ ముందుకుతెస్తున్న వాదనలు కుంటిసాకులేనని ఈ ముప్పైఏళ్ళ చరిత్ర రుజువుచేసింది. నెహ్రూ ప్రగతి శీలాన్నీ, నెహ్రూకుటుంబ ప్రగతిశీలాన్నీ గుర్తించడానికి తగినంత 'నిశితదృష్టి' ప్రజలకు నాడూలేదు, నేడూలేదు.

1948-51 కాలంలో పోరాటాన్ని రెండవదశకు విస్తరించడం పొరపాటయిందని, అందువల్ల తెలంగాణానుంచి వేరుబడిపోయామని చండ్ర రాజేశ్వరరావుగారు అంటున్నారు. "కమ్యూనిస్టులపట్ల ప్రజలు ఇప్పటికీ సానుభూతితోనే ఉన్నప్పటికీ

కమ్యూనిస్టులు ఎప్పటికైనాసరే తిరిగివచ్చి తమకు సహాయపడతారనే నమ్మకం వారికి పోయింది. కనుక వారు భూస్వాములతో ఒకవిధమైన రాజీకివచ్చారు," అనిరాశారు. ఈ కాలంలో పోరాటాన్ని "విస్పృహ"తో ప్రజాపెల్లువ ఏదీలేని అంధ్రప్రాంతానికి విస్తరింపజేయడం జరిగిందని అంటున్నారు. ఇవి నిజంకావాలంటే నాటితెలంగాణాలో మూడుఅంశాలు వాస్తవంలో ఉండిఉండాలి. ఒకటి, రెండవదశకు విస్తరించడం తప్ప యితే ఈకాలపు పోరాటాల్లో ప్రజలు పాల్గొనకుండా ఉండవలసింది. రెండు, కమ్యూ నిస్టులు ప్రజలనుంచి వేరుపడి ఉన్నట్టయితే 1952 ఎన్నికల్లో పిడిఎఫ్ అభ్యర్థులు అత్యధిక మెజారిటీతో గెలిచి ఉండకపోవలసింది. మూడు, నాయకత్వం విస్పృహలో మునిగిఉండంటే ప్రజాపునాది లేకుంటేనే అదిసాధ్యం. ఈ మూడు అంశాలు ఎంత అవాస్తవాలో చరిత్ర మనకుచెపుతుంది. పోరాట కొనసాగింపుమీద బురదజల్లడానికి రాజేశ్వరరావుగారు నోటికొచ్చిన అబద్ధాలు చెప్తున్నారని అర్థమవుతుంది.

ఇక ప్రజలకు, భూస్వాములకుమధ్య రాజీ, ఇది రాజేశ్వరరావుగారి బుర్రలో పుట్టిన వర్గసామరస్యమేగాని తెలంగాణా ప్రజానీకానికి, భూస్వామ్యానికిమధ్య రాజీ కాదు, ప్రజలు నోరెత్తలేదంటే కారణాలురెండు. నీటిలోచేపలా, తలలోనాలుకలా మెదులుతుందనుకున్నపార్టీ కనబడకుండా పోయింది. మరోవైపు అమానుష నిర్బంధం అమలయింది.

ఒకప్పుడు చైనావిముక్తికి పూర్వమే చైనామార్గమే మనమార్గంఅని నినాద మిచ్చిన చండ్రరాజేశ్వరరావు ఇవాళ చైనాపంథాను "సర్వసమగ్రమైన ఊహా ప్రధాన మైన పెట్టేరియన్ పంథా. దేశపరిస్థితులతో ఏమాత్రం పొందికలేనిపంథా," అంటు న్నారు. విముక్తికి పూర్వమే విముక్తిసాధించగల పంథాను గుర్తించిన రాజేశ్వరరావు గారు విజయంసాధించిన ఆ పంథాను ఇవాళెందుకు నిరాకరిస్తున్నారో స్పష్టమే.

ఇంతేగాక రాజేశ్వరరావుగారు ఈ పుస్తకంలో భారత విప్లవమార్గాన్నికూడా ప్రతిపాదించారు. "....మనదేశంలో సాయుధ విప్లవమే జరగవలసిఉంటే అది చైనా విప్లవ మార్గాన్ని అనుసరించబోదు." సంతోషం ; అంటే ఈ దేశంలో కమ్యూనిస్టు లకు రైతాంగంలో పని చేయాల్సిన అవసరంలేదు, మరి రాజేశ్వరరావుగారి భారత విప్లవ మార్గమేమిటి? "....కార్మికవర్గం ప్రత్యక్షంగా పాల్గొని విప్లవానికి నాయకత్వం వహించేమార్గాన్నే భారతదేశం అనుసరించవలసి ఉంటుంది." ఈ మాట రాసి పదేళ్ళయింది; మిగిలినకాలమంతా పోనీయండి కనీసం ఈ పదేళ్ళలో సిపిఐ ప్రభా వితం చేసిన కార్మికవర్గంఎంత ? ఇంతకూ కార్మికవర్గ నాయకత్వంఅన్నపుడు కార్మిక వర్గచైతన్యంగల, కార్మికవర్గ చైతన్యంలో అగ్రగామి (vanguard) అయిన కమ్యూ

నిస్టు పార్టీ నాయకత్వంఅని సృజనాత్మకమైన అర్థం చెప్పుకోవాలా లేక పారిశ్రామిక కార్మికులు అని అర్థంచెప్పుకోవాలా ! ఒక వర్గంయొక్క చైతన్యానికి కార్యక్రమానికి పార్టీఅనేది ప్రాతినిధ్య స్వభావాన్ని వహిస్తుందాలేదా ? కార్మికవర్గ నాయకత్వంఅంటే కమ్యూనిస్టుపార్టీ నాయకత్వమే కాకపోతే భారత రైతాంగ విప్లవమనేమాటకు అర్థం లేదు. అయితే ఈ విషయం భారత కమ్యూనిస్టుపార్టీని, దాని నాయకుడైన చండ్ర రాజేశ్వరరావును అడిగి, లేదా ఆయనకుచెప్పి ప్రయోజనం లేదు. ఎందుకంటే సిపిఐ కూడ మార్క్సిజం - లెనినిజం అని పల్లించినా అది బోల్షివిక్‌పార్టీ కాదుకదా.

పోరాట విరమణ గురించి ముందెప్పుడో జరగాల్సిన మంచిపని ఆనాడు జరిగి నట్టుగా సిపిఐ ప్రకటిస్తుంది. తమ మనసులోని పోరాట వ్యతిరేకతను, పోరాటం ఆగిపోవడంపట్ల సంతోషాన్ని దాచుకోవడానికిగానీ, అక్షరాల్లో పెట్టకుండా ఉండడానికి గానీ కూడా ప్రయత్నించకుండా ఎంత నిర్లజ్జగా రాసారో రాజేశ్వరరావుగారి పుస్తకం నుంచి ఒక ఉదాహరణ ఇస్తాను. "....మనం ఇరుక్కున్న బురదలోనుండి బయట పడడానికి అనుకూలమైన నూతన పరిస్థితుల లోనికి ప్రవేశించడానికి తోడ్పడది. తెలంగాణా పోరాటం ఉపసంహరించబడ్డది...." ప్రజా ఆకాంక్షలకు తగినట్టుగా పోరాటం నడువలేకపోతే పోరాటం బురదగా కనిపించక తప్పదు, నిజమే ! అందుకే సిపిఐ మళ్ళీ ఎప్పుడూ 'బురద'లో ఇరుక్కోదలచుకోలేదు.

# 7

## "పోరాటం నడిపించిన పుచ్చలపల్లి సుందరయ్య !!"

సిపిఐ(ఎం) 1973 జులై నాలుగుతో ప్రారంభించి పదిహేనురోజులపాటు వీర తెలంగాణా విప్లవపోరాట సభలు జరిపింది. ప్రజాశక్తి ప్రత్యేక సంచిక వేసింది. సుందరయ్యగారి 'వీరతెలంగాణా విప్లవ పోరాటం గుణపాఠాలు' పుస్తకాన్ని, బసవ పున్నయ్యగారి 'తెలంగాణా సాయుధపోరాటం - వాస్తవాలు' పుస్తకాన్ని ప్రచురించింది.

బసవ పున్నయ్యగారు ప్రజాశక్తిలో రాసిన వ్యాసంలో "మితవాదుల రజతోత్స వాలకు సందర్భమేమిటో ?" అని లెక్కలతో సిపిఐ సందర్భాన్ని ఖండించి, తమ సందర్భాన్ని మాత్రం దాటవేశాడు. నిజానికి సిపిఐ(ఎం) సందర్భం కూడా నక్సల్బరీ యేనని ఆయన వ్యాసం మనకు తెలియజేస్తుంది.

1948 తర్వాత పోరాటాన్ని విముక్తిపోరాటంగా, నెహ్రూ ప్రభుత్వవ్యతిరేక పోరాటంగా కాక విజయాల రక్షణ పోరాటంగా సాగించి ఉండవలసిందని సిపిఐ(ఎం)

అవగాహన, అందుకే బసవ పున్నయ్యగారి వ్యాసశీర్షిక "నైజాంపాలన కూలిపోతు న్నప్పుడు నెహ్రూసైన్యాల ప్రవేశం అంతర్యం కమ్యూనిస్టుల నాయకత్వాన సాగుతున్న రైతాంగ విప్లవం సాధించిన విజయాలను దారుణంగా అణచడమే". ఇది నిజమేకాని ఈ అంశంమీదనే సిపిఐ(ఎం) ఎందుకు నొక్కిచెప్తున్నదంటే ఆకాలంలో ఆత్మరక్షణే అత్యవసరమైందనే విషయాన్ని ఇప్పుడు స్థాపించడానికే. మూడువేల గ్రామాలను విముక్తంచేసి, గ్రామరాజ్యాలను స్థాపించి, విస్తృత ప్రజాపునాది కలిగిఉన్న పార్టీ ఎందుకు ఆత్మరక్షణ స్థాయికి దిగజారిపోయింది? విజయాలను రక్షించుకోవడమే అప్పటి అవసరమని సిపిఐ(ఎం) ఇవ్వాళ వాదిస్తున్నదంటే నాటి ప్రజాపునాదిని అది గుర్తించ నిరాకరిస్తున్నదన్నమాట. నిజానికి అనాడు ప్రజానీకం తమ విజయాలు రక్షించుకోవడానికి మాత్రమే కాదు, ఆ విజయాలను శాశ్వతంచేసే విముక్తి పోరా టాన్ని సాగించడానికి సిద్ధంగా ఉన్నారు, కాని అనాడందుకు సిద్ధంగాలేని నాయకత్వమే ఇవాళ ఆ పోరాటానికి విముక్తిపోరాట స్వభావంలేదని వక్రీకరిస్తున్నది.

"సాయుధ పోరాటంద్వారా సాధించుకున్న రైతాంగ విప్లవాన్ని సమూలంగా విధ్వంసం చేయడమా? లేక విప్లవవిజయాలు చవిచూసిన పీడితరైతాంగాన్ని వాటి ననుభవించనిచ్చి, వ్యవసాయ విప్లవజ్వాలలను దావానలంగా వ్యాప్తిచెందనీయడమా? కమ్యూనిస్టు ఉద్యమాన్ని కాలరాచివేయడమా? లేక తెలంగాణా విజయాలను సంఘ టిత పరచుకోనిచ్చి తద్వారా పోరాటానికి నాయకత్వం వహించిన కమ్యూనిస్టుపార్టీని బలపడనీయడమా?" అనేదే అనాడు నెహ్రూప్రభుత్వాన్ని పట్టిపీడించిన ఆలోచనా సరళిఅని బసవపున్నయ్యగారు అంటున్నారు. కనుకనే నాటిపోరాటం నెహ్రూ వ్యతి రేక పోరాటంగా ఉండవలసిందన్న సహజమైన ముగింపుకు సిపిఐ(ఎం) ఒప్పుకోదు గాని కనీసం నెహ్రూ ప్రభుత్వ ఆలోచనాసరళిని గుర్తించాక తమదైన ఒకవిధానాన్ని చేపట్టాలావద్దా? శత్రువు మనను దెబ్బదీయడానికే సర్వశక్తులూ కేంద్రీకరిస్తున్నా డని తెలిసినప్పుడైనా ఆత్మరక్షణ మన మొత్తంకార్యవిధానంలో ఒకభాగం అవుతుందా? అదే మొత్తం కార్యవిధానం అయిపోతుందా? మొత్తం కార్యక్రమంలోని ఒకచిన్న భాగాన్నే కార్యక్రమంగా భావించే శక్తిని సిపిఐ, సిపిఐ(ఎం)లు ఆ తర్వాత మరింత బాగాకూడా వెల్లడించుకున్నాయి.

ఐతే 'పోలీసుచర్య' గురించి సిపిఐ(ఎం)కు ఒక ఖచ్చితమైన అవగాహనేమీ ఉన్నట్టులేదు. ఎందుకంటే ఈ పుస్తకాలు రాయడానికి నాలుగేళ్ళముందు (1968లో) మార్క్సిస్టు ప్రచురణలు తరఫున పోలీసుచర్యను, ఒక దళనాయకుడు సమర్థించే నవల 'తెలుగుగడ్డ'ను సిపిఐ(ఎం) ప్రచురించింది.

సుందరయ్యగారి పుస్తకంమీద ఒక సమగ్ర సమీక్ష రాయవలసిఉంది. తెలంగాణాపోరాటంపై అదే ప్రామాణిక గ్రంథంగా భావించబడుతూ ఉండడంవల్ల ఒక సమగ్ర సమీక్ష అవసరం మరింత ఎక్కువగాఉంది. ఐతే ఈ అధ్యాయంలో మొత్తం పుస్తకంగాక కొన్ని ప్రధానాంశాలు మాత్రమే చర్చించడం జరుగుతుంది.

ఈ పుస్తకంలో నిజాంకు, రజాకార్లకు వ్యతిరేకంగా సాయుధ ప్రతిఘటనోద్యమం అనే అధ్యాయంలో పరస్పర విరుద్ధమైన అంశాలెన్నో కనబడతాయి. 1947 ఆగస్ట్ 15న జరిగింది బ్రిటిష్ సామ్రాజ్యవాదంనుంచి బూర్జువా - భూస్వామ్య కాంగ్రెస్ అధికారమార్పిడేనవిరాసి, "భారతయూనియన్‌లో విలీనంకోసం స్టేట్ కాంగ్రెస్ చేపట్టిన ఉద్యమంలో కలిశాం" అని సుందరయ్యగారు రాశారు. అంటే కాంగ్రెస్ వర్గస్వభావమేమిటో గుర్తించికూడా కాంగ్రెస్‌తో కలిశారా అనేది పక్కన పెట్టినా నిజాం నిరంకుశ భూస్వామ్యపు బంధనాలను, తెంచుకోవడానికై సాగుతున్న భూస్వామ్య వ్యతిరేకపోరాటాన్ని (నిజాంకు బ్రిటిష్ వత్తాసుకూడా ఉండిందిగనుక ఇది సామ్రాజ్యవాద వ్యతిరేకపోరాటంకూడా) విలీనోద్యమం స్థాయికి ఎందుకు దించేయవలసి వచ్చింది? భూస్వామ్య బంధనాలను తెంచుకోవడానికై ఒళ్ళు విరుస్తున్న తెలంగాణాను "బూర్జువా - భూస్వామ్య" ప్రభుత్వయూనియన్‌లో విలీనం చేయాలనే తాపత్రయం కమ్యూనిస్టుపార్టీకి ఎందుకుకలిగింది?

ఇక విలీనోద్యమకాలం మొత్తంలోనూ ఎట్లా కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెస్ తోక పట్టుకు పోయిందనేదే సుందరయ్యగారి పుస్తకంలో కనబడుతుంది. గ్రామీణ తెలంగాణాకు ఏకైక ప్రతినిధిగా ఉన్న పార్టీ ఈ పంథానెందుకు అవలంబించవలసి వచ్చిందో సుందరయ్యగారు వివరించరు. భారత ప్రభుత్వం, అంటే కాంగ్రెస్‌పార్టీ నిజాంతో యధాస్థితి ఒడంబడికచేసుకొన్ని ఆయుధాల సరఫరా కూడా ప్రారంభించి నప్పటికీ కాంగ్రెస్‌పట్ల కమ్యూనిస్టుపార్టీ దృక్పథంలో మార్పెందుకు రాలేదు?

తామెన్నడూ తప్పచేయలేదని చూపుకోవడానికి సుందరయ్యగారు రాసిన విషయాలైతే ఇంగితజ్ఞానం ఉన్నవాడెవడైనా అంగీకరించడానికి వీల్లేనివి. ఒక ఉదాహరణ చూడండి. "బైరాన్‌పల్లి కూటిగల్లులమీద దాడిచేయడానికి జనగామకు పెద్దపెద్ద మిలిటరీ బలగాలొచ్చాయి. గ్రామం నుంచి గెరిల్లా దళాలువెళ్ళిపోవాలనీ, ప్రజలను ఖాళీచేయించాలనీ ఒక ముఖ్య కామ్రేడ్ ద్వారా పార్టీ నాయకత్వం చెప్పంపింది. కాని ఈ మాట గ్రామానికి చేరలేదు. సూచనలు అమలుచేయబడలేదు." ఈ విషయం నిజమే అయితే 88 మంది వీరులమరణాలకు ఖచ్చితంగా ఆ నాయకత్వమూ, ఆ ముఖ్య కామ్రేడ్ మాత్రమే బాధ్యతవహించాలి. ఆ మాట గ్రామానికి

చేరేట్టుగా పార్టీ ఎందుకు ప్రయత్నించలేదు ? ఐదుసార్లు వెనుదిరిగిపోయిన అవమానంతో, కోపంతో మిలిటరీ పెద్దఎత్తున దాడిచేయబోతున్న సమయంలో పార్టీ ఎందుకంత నిర్లక్ష్యంగా ప్రవర్తించింది ? ఐతే ఈ విషయం వాస్తవం అయిఉండదనే నా అనుమానం. నాయకత్వం ఎప్పుడూ తప్పుచేయలేదని, పరిస్థితుల్ని సరిగా అంచనా వేసిందని, ప్రజలో మధ్యవర్తులో మాత్రమే తప్పుచేశారని చెప్పుకోవడానికి సుందరయ్యగారు ఇట్లా రాసి ఉంటారు.

"....హైదరాబాద్ రాష్ట్రంలో భారతసైన్యాల ప్రవేశంతో, ఇండియన్ యూనియన్‌లో హైదరాబాద్ విలీనంతో, పూర్తిగా వేరైన వర్గశక్తుల సమ్మేళనం కలిగిన నూతన రాజ్యం ఒకటి ఏర్పడింది. కనుక నిజాం వ్యతిరేక విమోచనోద్యమం దానంతటదే భారతరాజ్యపు నెహ్రూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా విమోచనోద్యమంగా పరిణమించలేకపోయింది...." అని సుందరయ్యగారు అంటున్నారు.

1948 సెప్టెంబర్ 17 వరకూ హైదరాబాద్ రాష్ట్రంలో ఉన్నది నిజాం నిరంకుశ భూస్వామ్యం. సెప్టెంబర్ 17న నిజాంను తీసేసి ఆ భూస్వామ్యాన్ని నిలపడానికే తెలంగాణా పల్లెల్లో నెహ్రూ - పటేల్ సైన్యాలు ప్రవేశించాయి. భారతరాజ్యం తెలంగాణాలోనయితే 1951 కి ముందు అర్ధభూస్వామ్య స్వభావాన్నయినా సంతరించుకున్నదా అనేది అనుమానమే. మరి సుందరయ్యగారికి ఈ పూర్తిగా వేరైన వర్గశక్తుల సమ్మేళనపు విభిన్నరాజ్యం ఎక్కడ కనిపించింది ? మీర్ ఉస్మానలీఖాన్ దిగిపోయి (దిగిపోనూలేదు, చాలాకాలం రాజప్రముఖ్‌గా కొనసాగి రాజభరణాలు పొందాడు ) గద్దెమీదికి నెహ్రూ - పటేల్‌లు రాగానే తెలంగాణాలో వివిధవర్గాల బలాబలాలు మారిపోయి, నూతన రాజ్యం ఒకటి ఏర్పడి, తక్షణమే మన పోరాట వ్యూహాన్నే మార్చుకోవాల్సిన అవసరం ఏర్పడిందా ?

సుందరయ్యగారు కూడా ప్రజానీకానికి నెహ్రూ ప్రభుత్వం పట్ల భ్రమలుండేవని రాస్తున్నారు. రూమీటోపీలు తీసేసి గాంధీ టోపీలు పెట్టినదొరలు సైన్యాలవెంట తిరిగివస్తూంటే "రంగూ రంగూలమారి నెవురయ్యో, నీ రంగూ బైరంగమాయె నెవురయ్యో" అని పాడుకున్న ప్రజానీకానికి వివిధ వర్గశక్తుల నూత్నసమ్మేళనాన్ని గుర్తించడానికి సుందరయ్యగారికున్నంత సిద్ధాంత పరిజ్ఞానం లేదుగదామరి !

ఆయుధాలు ప్రభుత్వానికి అప్పగించడం గురించి వచ్చిన విమర్శలను "పిచ్చి వాదన" అని కొట్టివేస్తూ సుందరయ్యగారు "....ఈ రోజు పోరాడేందుకు ఆ తుప్పు పట్టిన మధ్యయుగపు ఆయుధాలేకావాలా ?...." అన్నారు. ఇంతకంటే సిగ్గుమాలిన వాదన మరొకటుండదు. అవి ఇప్పుడు పనికొచ్చునారాదా అన్నది సమస్యేకాదు.

కమ్యూనిస్టుపార్టీ పాలసీ ఏమిటి అన్నది ముఖ్యం. తుపాకి బరువైతే భుజం మార్చుకుంటే తప్పేమీలేదు. రెండడుగులు ముందుకు వేయడానికి ఒకడుగు వెనక్కువేసినా తప్పులేదు. ఆయుధాలు శత్రువు చేతికిస్తామా అన్నదే సమస్య. ఇక్కడ బేషరతుగా ఆయుధాలు అప్పగించడమన్నది చెరవిడిపించిన భూమిని భూస్వాములకు మళ్ళీ కట్టబెట్టడంతో ముడిపడివున్నది. 'దున్నేవాడిదే భూమి' నినాదం నిజం కావాలంటే ఆభూమి ఎర్రజెండా నాయకత్వంలో సాయుధంగా కాపాడబడాలి. ఇక్కడ సాయుధంగా అనేమాట ప్రజాచైతన్యానికి, వర్గపోరాటానికి సంకేతం. అది అన్ని వేళలా తుపాకీపట్టడమో, పేల్చడమో అని కాదు. వెల్లోడీ అడగకుండానే, తమ కార్యకర్తలందరి విడుదలకూడ షరతుగా పెట్టకుండా, రైతులు ఆక్రమించుకున్న భూమి వదిలేదిలేదని చెప్పకుండా బేషరతుగా ఆయుధాలు అప్పగించింది కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం. అంతేకాదు కమ్యూనిస్టుపార్టీ మీద నిషేధంకూడ తొలగకుండా పిడిఎఫ్‌గా ఎన్నికల్లో పోటీచేసింది. అంటే పార్లమెంటరీ రాజకీయాల చరణాలదగ్గర ఆయుధవిసర్జన చేసింది.

## 8

### తెలంగాణా వారసత్వం

దాదాపు మార్క్సిస్టు లెనినిస్టు గ్రూపులన్నీ తెలంగాణామీద ఏదోఓ సందర్భంలో తమ అభిప్రాయాన్ని ప్రకటించాయి. పుస్తకరూపంలో ప్రకటించినవారు చండ్ర పుల్లారెడ్డి, దేవులపల్లి వేంకటేశ్వరరావు గార్లిద్దరే.

చండ్ర పుల్లారెడ్డిగారు మొదట 1968 లో పుస్తకం వెలువరించారు. ఆనాటికదే మొదటి పుస్తకం. ఆపుస్తకం పోరాటానికి ఉత్తేజకరమైన వివరణనిచ్చింది. ఆతర్వాత 1981 లో ప్రచురించిన ఇంగ్లీషు పుస్తకంలో మొదటి పుస్తకానికి అనువాదమూ, మరి కొంత అదనపు సమాచారమూ కలిపి ఇవ్వబడ్డాయి. పోలీసుచర్య కమ్యూనిష్టులకు వ్యతిరేకంగా ఎక్కుపెట్టబడిందేనని, 1948 తర్వాత పోరాటం విమోచనోద్యమమేనని, పోరాట విరమణ విద్రోహమని, పోరాటాన్ని కొనసాగించి ఉండవలసిందని పుల్లారెడ్డి గారు భావిస్తారు. తమ పార్టీ మాత్రమే తెలంగాణా నుంచి సరైన గుణపాఠాలు రాబట్టిందని, తెలంగాణా పోరాటానికి నిజమైన వారసత్వం తమదేనని పుల్లారెడ్డిగారు భావిస్తారు. అయితే అగుణపాఠాలేమిటో మాత్రం ఆయన పుస్తకంలో లేవు. గుణపాఠాలు అనే శీర్షికకింద ఉన్న ఎనిమిది అంశాలూ తెలంగాణా పోరాటంపై పరిశీలనలు మాత్రమే. తెలంగాణా పోరాటాన్ని నిర్వచించిన ఈ ఎనిమిది అంశాలే గుణపాఠాలని ఆయన భావిస్తే ప్రస్తుత విప్లవోద్యమం ఖచ్చితంగా తెలంగాణాను అనుకరించాలని ఆయన భావిస్తున్నారనుకోవాలి.

దేవులపల్లి వేంకటేశ్వరరావుగారు "సుందరయ్యగారి పుస్తకంలో ఉన్న నయా రివిజనిస్టు అవగాహనకు విరుద్ధంగా" "మౌలికంగా సరైన అవగాహన" నిచ్చేందుకు గాను ఒక సమీక్షను ప్రకటించారు. ఈ పుస్తకంలో పాలిమిక్స్ ఉన్నంతగా చరిత్ర లేదు. తర్కంఉన్నంతగా వాస్తవాలపై ఆధారపడ్డ వాదనలేదు.

ఈ పుస్తకం ప్రారంభంలోనే "....తెలంగాణా రైతాంగం లీగల్ (చట్టబద్ధమైన) పోరాట రూపాలన్నింటిని పూర్తిగా వినియోగించుకున్న (exhaust) తర్వాతనే 1946లో సాయుధ పోరాటం ప్రారంభించి, 1951లో ఉపసంహరించేవరకు కొనసాగించింది." అని డి. వి. గారన్నారు. మొట్టమొదట ఇది వాస్తవంకాదు. పోరాట ఆయుధాగారంలోని ఏ ఆయుధాన్నీ తెలంగాణా రైతాంగం వ్యతిరేకించలేదు. సాయుధ పోరాటకాలంలో గూడా ఉపయోగించుకోదగినచోట్ల లీగల్ పోరాటరూపాలనెట్లా ఉపయోగించుకున్నారో తెలంగాణా పోరాట చరిత్ర తెలుపుతుంది. అసలు ఈవాక్యంలో అంతర్లీనంగాఉన్న డి. వి. గారి ధోరణి మరింత ప్రమాదకరమైనది. డి. వి. గారు వర్తమానంకోసం గతాన్ని వక్రీకరించడం ఈ వాక్యంలో కనబడుతుంది. ఈ వాక్యం వెనుక అన్ని లీగల్ పోరాటరూపాలనూ ఎగ్జాస్ట్ అయ్యేవరకూ వినియోగించుకోవాలనీ, ఆ "తర్వాతనే" సాయుధపోరాటం ప్రారంభించాలనీ చెప్పే తప్పుడు ధోరణిఉంది. పోరాటాన్ని దశలుగా విభజించే ధోరణిఉంది.

ఇక పుస్తకమంతా నల్లగొండజిల్లాలో పోరాటప్రజ్వలనకు స్థానిక నాయకత్వమే కారణమనే ఒకవాదనఉంది. ఇది ప్రజలస్థానాన్ని గుర్తించకపోవడం మాత్రమేకాదు, సబ్జెక్టివ్ ఫాక్టర్స్ పాత్రను ఎక్కువచేసి చూపడం. ఇది మౌలికంగా కమ్యూనిస్టు అవగాహననుంచి దూరంకావడమే.

ఈ పుస్తకం ఎట్లా పాలిమిక్స్‌తో నిండిఉందో దానిపై సమీక్షకూడా అంత పాలిమికల్‌గా ఉండవలసి వస్తుందిగనుక ఈ పరిశీలనిక్కడితో ముగించి మొత్తం పోరాటంమీద డి. వి. గారి అంచనాలుచూద్దాం. 1946 వరకు తెలంగాణా రైతాంగం తమ పాక్షిక కోర్కెలకొరకు పోరాటంసాగిస్తూ ఉన్నతదశలో భూస్వాధీనమనే మౌలిక కోర్కెతో ముందుకువచ్చారనీ, ఈకాలంలో లీగల్ పోరాటరూపాలన్నీ ఉపయోగించుకొని, ఎగ్జాస్ట్అయ్యాక 1946లో సాయుధపోరాటం ప్రారంభించారని డి. వి. గారి అవగాహన. పోలీసుచర్యపట్ల మిగిలిన మార్క్సిస్టు లెనినిస్టుల దృక్పథంతో ఏకీభవిస్తారు. పోరాటవిరమణను అంగీకరిస్తారుగాని, అప్పుడు నాయకులుగా ఉండికూడా "సాయుధ పోరాటవిరమణ ఒక వాస్తవమై, ఇకదానిగురించి చేయగలిగిందేమీ లేని

స్థితిలో దానిగురించి తిరిగి లేవనెత్తడంలో ఇంకేమీ ప్రయోజనం లేదుగదా"అని మౌనంవహించారు. వీరుకూడా నిజమైన తెలంగాణా వారసత్వం తమదేనవిప్రకటిస్తారు.

మిగిలినగ్రూపులు, పార్టీలు తెలంగాణా పోరాటంమీద పుస్తకాలేమీ ప్రకటించ లేదుగనుక వాళ్ళ సమగ్రఅవగాహన ఏమిటో తెలుసుకునే అవకాశంలేదు. ఏవోకొన్ని అంశాలమీద వాళ్ళురాసిన వ్యాసాలో, ఏదో ఓ సందర్భంలో వాళ్ళుచేసిన వ్యాఖ్యలో మాత్రమే కొన్ని పరిస్థితులపట్ల వాళ్ళ అవగాహనను వివరిస్తాయి.

సిపిఐ(ఎంఎల్) అనుభవాలను చారిత్రక నేపథ్యంలో అంచనావేసే క్రమంలో సిపిఐ(ఎంఎల్)సిఆర్ సి తెలంగాణామీద తనపరిశీలనను ప్రకటించింది. ముఖ్యంగాఇది పార్టీలో రివిజనిస్టు పంథా ఎట్లాపెరిగిందో వివరించే క్రమంలో రాయబడింది గనుక 1948 కలకత్తా కాంగ్రెస్ చర్చలతో తెలంగాణా పోరాట ప్రస్తావన మొదలై 1951 ని విద్రోహం అనడంతో ముగుస్తుంది.

సిపిఐ(ఎంఎల్) పీపుల్స్‌వార్ సి. ఓ. సిగా ఉన్నప్పుడు ప్రకటిస్తూ ఉండిన "పిలుపు" పత్రికలో రివిజనిస్టుల రజతోత్సవాలను విమర్శిస్తూ రాసిన వ్యాసంలో కుమార్‌గారు "....ఏ పోరాటంలోనైనా ఆటుపోటులూ ఒడిదుడుకులూ ఉంటాయి. తలెత్తిన పరిస్థితులనుబట్టి, సమస్యలనుబట్టి ఎత్తుగడలను మాత్రమే మార్చు కొంటుండాలి కాని వ్యూహాన్ని మాత్రం కాదు...." భారత విప్లవాన్ని ఇంకా ఉన్న తంగా ముందుకు తీసుకుపోవడం ద్వారానే తెలంగాణా సాయుధ పోరాట వారసత్వాన్ని పుణికిపుచ్చుకున్నట్లవుతుంది...." అన్నారు, ఖమ్మం ఉపన్యాసంలో కొండపల్లి సీతా రామయ్యగారూ అన్నారు. "భారత విప్లవం కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం క్రింద మాత్రమే విజయవంతంకాగలదు. అయితే భారతదేశంలో కమ్యూనిస్టుపార్టీ పుట్టి 50 ఏళ్ళు అయింది. ఈ 50 ఏళ్ళ చరిత్రచూస్తే మావో చెప్పిన డ్రాగన్‌కథ నాకు గుర్తు కొస్తుంది. డ్రాగన్‌ను చూడాలి చూడాలి అని ఉబలాటపడ్డ రాకుమారుడు తీరా అది గుమ్మంలో కొచ్చేసరికి గుండెఆగి చచ్చిపోయాడట. ఇండియాలో రివిజనిస్టుల పని ఇలావుంది. పార్టీ నాయకత్వం చాలకరవుట అయిపోయింది. దోపిడీవర్గాలతో స్నేహ లేర్పరచుకొని, వారితో కలిసిపోయారు.... ఆంధ్రదేశంలోనూ, భారతదేశంలోనూ కమ్యూనిస్టుపార్టీ భూస్వాముల ఇళ్ళల్లో పుట్టి కార్మికవర్గాన్ని వెతుక్కుంటూ బయలు దేరింది. తెలంగాణా సంగతే చూడండి 1939 లో ఆ రోజుల్లో 20 మంది పార్టీలోకి వస్తే 19 మంది రెడ్డి ప్రభువులే. వాళ్ళతో పుట్టింది పార్టీ. తెలంగాణా పోరాటం జరుగుతూవుంటే వీరంతా ఎక్కడున్నారో గుర్తుకుతెచ్చుకోండి. రావి నారాయణరెడ్డి గారు బొంబాయిలో వున్నారు. సరే ఆ కథలా ముగిసింది. తెలంగాణా పోరాటం

మధ్యలోనే ఆపేసినా ఆపోరాటం అంతా వృథా అయిపోయిందని నేననుకోవడం లేదు. నైజాంకు స్థానం లేకుండా చేసాం. అంతవరకు విజయం. భూస్వామ్య విధానం రద్దుచేసి పొలాలు పంచుకుంటామన్నాం. అందులో ఓడిపోయాం. ఆ పోరాటం. ఇప్పటికీ కొనసాగించవలసేఉంది...." అన్నారు.

## 9

"ఇదేనండి ఇదేనండి ఎర్రెర్రని తెలంగాణా
కమ్యూనిస్టు గుండెకాయ, కష్టజీవి కలలకోన"

తెలంగాణా విమోచనోద్యమ స్మృతులు, వివరణల సమీక్ష ముగించడానికి పైవాక్యాలకన్న మించిన వాక్యాలులేవు, తెలంగాణా పోరాటస్వభావాన్ని క్లుప్తంగా, ప్రతిభావంతంగా ఈ వాక్యాల్లో చెరబండరాజు పొందుపరిచాడు.

పల్లెలను విముక్తంచేసి పట్టణాలుచుట్టుముట్టి రాజ్యాధికారం హస్తగతం చేసుకునే క్రమమే భారత విప్లవక్రమం అవుతుందని తెలంగాణా స్పష్టాస్పష్టంగా రుజువు చేసింది. ఆ నాటికి పట్టణాలలో పార్టీబలంగాఉండి ఉంటే, రైతాంగపోరాటాన్ని కార్మిక, విద్యార్థి ఐక్యతతో సమ్మిళితంచేసిఉంటే, నాయకత్వంలో ధనికరైతాంగమూ, స్వప్రయోజనపరులూఉండి ఉండకపోతే కె.వి. రమణారెడ్డిగారన్నట్టు "....భారతదేశం ఈనాటికి మరొకచైనా అయిఉండేదా లేదా అనేదికాదుప్రశ్న. ఆ మార్గంలో చాలా దూరంనడిచి అంతిమగమ్యానికి చాలా చేరువైఉండేది".

నక్సల్బరీ తెలంగాణాకు కేవలఅనుకరణో, కొనసాగింపో మాత్రమేకాదు. ఒక పరిశోధకుడు గుర్తించినట్టు "నక్సల్బరీ తెలంగాణాను అధిగమించిన పోరాటం." ఇది ఎందువల్ల వాస్తవమంటే పాతక్రమాన్ని సరిగా అర్థంచేసుకొని, గుణపాఠాలుతీసి, లోపాలు పరిహరించుకుంటే ప్రతిక్రమానికీ పాతక్రమాన్ని అధిగమించగలిగిన శక్తి ఉంటుంది; ఐతే ఇందుకు కావలసిందల్లా తప్పులను ఒప్పుకోగల సాహసమూ, తప్పుల్ని సరిదిద్దుకోగల చిత్తశుద్ధీ, ఈ రెండు లక్షణాలనూ నిర్ణయించేశక్తి విస్తృత ప్రజాపునాది. తప్పుల్ని ఆచరణలోదిద్దుకొని, ఒప్పులను విప్లవపోరాటంలో వారసత్వంగా స్వీకరించి అమలుచేస్తూ తెలంగాణా విమోచనోద్యమ ఆకాంక్షను నూతన ప్రజాస్వామిక విప్లవంలో ఆవిష్కరించడానికి నిర్వహించబడుతున్న నక్సల్బరీ పంథా మాత్రమే తెలంగాణా చరిత్ర రచించగలదు. ఎందుకంటే అపుడది చరిత్ర రచనగానే మిగిలిపోదు, అది ప్రజలు నిర్మిస్తున్న చరిత్రలో భాగమవుతుంది.



సంస్మరణ : సుద్దాల హనుమంతు :

# ప్రజలపాటే ఆయుధంగా...

జయధీర్ తిరుమలరావు

నైజాం వ్యతిరేక పోరాటంలో జానపద ఫక్కీలో పాటలురాసి గానంచేసి ప్రజలను ఉత్తేజితులనుచేసిన సుద్దాల హనుమంతు తమ స్వగ్రామమైన మోతుకూరులో అక్టోబర్ 10న మరణించారు. ఆయన వయసు సుమారు 70 సంవత్సరాలు. ఆయనకు భార్య, ముగ్గురు సంతానం ఉన్నారు.

నైజాంకు వ్యతిరేకంగా జరిగిన 1946-51 సాయుధ పోరాట సమయంలో సుద్దాల హనుమంతు కమ్యూనిస్టుపార్టీ సాంస్కృతిక దళానికి నాయకత్వం వహించారు. 'బండెనక బండిగట్టి' పాటరాసిన యాదగిరి హనుమంతు దళంలోనిసభ్యుడే. వందలాది పాటలురాసి వేలాది ప్రదర్శనలుఇచ్చిన హనుమంతు ఆ రోజులలో తెలంగాణా ప్రజల చైతన్యదీపంగా వెలిగారు. ఆయన పాటలు జనం నాలుకలమీద నాట్యంఆడేవి. హనుమంతు పోరాటంలో పాటని ఆయుధంగా, ఆయుధాన్ని అవసరంగా చేపట్టారు. నాటి తెలంగాణా పోరాటంలో హనుమంతు రాసిన పాటలు పాడనిగ్రామంలేదు. ప్రసిద్ధమైన 'పల్లెటూరి పిల్లగాడా పసులగాసే మొనగాడా' అన్నపాట హనుమంతు రాసిందే. ఆయన ప్రజలభాషలో, యాసలో, శైలిలో ప్రజోపయోగమైన ఎన్నో పాటలురాసి, పాడి, ప్రదర్శనలిచ్చారు. ఆనాడు ప్రజాకవులపంథాకే ఆయన కొత్త ఒరవడి పెట్టారు. చేస్తున్న చిన్నఉద్యోగంకూడా వదిలిపెట్టి ప్రజలపక్షాన నిలబడ్డారు.

ఉపన్యాసాలు చేయలేనిపని హనుమంతు దళం చేస్తున్నదని నైజాం కన్నెర్ర చేశాడు. పర్యవసానంగా హనుమంతు అనేక సంవత్సరాలు అజ్ఞాతజీవితం గడపవలసి వచ్చింది.

1952 సార్వత్రిక ఎన్నికల్లో పి.డి.ఎఫ్ పేరిట పోటీచేసిన రావినారాయణరెడ్డి దేశంలోకెల్లా అత్యధిక మెజారిటీ వోట్లుసాధించడానికి హనుమంతు దళంచేసిన ప్రచారం ఎంతోతోడ్పడింది. ఆ ఎన్నికల్లో పీపుల్స్ డెమొక్రటిక్ ఫ్రంట్ ఎన్నికల చిహ్నం చేయి. అప్పటికే కవిగా లబ్ధప్రతిష్ఠుడైన కాళోజీ నారాయణరావు వరంగల్ పార్లమెంట్ నియోజకవర్గంనుండి కాంగ్రెస్ టికెట్ మీద పోటీచేశారు. ఆ సందర్భంలో కాళోజీ చేయిగుర్తును హేళనచేస్తూ 'మొండిచేయి' శీర్షికతో "గొంతులు కోసేది

చేయి" అంటూ పాటరాసి తన ఎన్నికలప్రచారంలో బుర్రకథదళాలతో పాడించారు. ఈ పాటవిని బాధపడి హనుమంతు "వీణనుమీటేదీ చేయి, నాగలిదున్నేదీచేయి, రైలింజను నడిపేదీచేయి' అంటూ జవాబుగా ఒకపాటరాశారు. ఈ పాటవిని కన్నీరుకార్చిన శ్రోతలుకూడా ఉన్నారు. ఈ పాటముందు కాళోజీపాట వెలవెలా పోయింది.

'అశోక్‌కుమార్ సాబ్', 'గొల్లసుద్దులు' హనుమంతు ఇతర రచనలు. ఆయన రచనలేవీ సంకలనంగా ఇంతవరకూ అచ్చుకాలేదు.

ఆయన క్యాన్సర్ వ్యాధితో బాధపడుతూ దాదాపు చరమ దశలో ఉన్న సమయంలో సైతం ఇంటర్వ్యూ చేసినప్పుడు ధీమాగా చెప్పదలచుకున్నదేదో చెప్పారు.

## సుద్దాల హనుమంతుతో ఇంటర్వ్యూ

ప్రశ్న : మీ బాల్యం గురించి చెబుతూ, సామాజిక చైతన్యం ఎలా అబ్బిందో చెబుతారా ?

జవాబు : నల్లగొండజిల్లా రామన్నపేట తాలూకాలోని పాలడుగు మా గ్రామం. తాతతండ్రులది ఆయుర్వేద వైద్యవృత్తి. కానిగీ బడుల్లో అయ్యవార్ల దగ్గర పెద్దబాలశిక్ష, శతకాలు, పురాణగాథలు చదివాను.

చిన్నతనం నుండే హరికథలు, నాటకాలు, పాటలంటే ఇష్టం. హరికథలు చెప్పే అంజనదాసుగారు తమ మండలిలోకి తీసుకొన్నారు. వారి అద్వైతమార్గంలో ఏకాంతవాసం, ప్రాణాయామాలు, యోగాభ్యాసాలు చేసాను. ఇలా కొంతకాలంగడిచింది.

కాని ఎంతకాలమని అలా ప్రత్యేకంగా ఉంటాం? ఊళ్ళో పన్నులవసూలు కోసం దొరలు చేసే జులుం ఇంతింతకాదు. ఒక సంఘటన చెబుతాను.

మండే ఎండల్లో హరిజనవాడలోకి బరువువంతుల మనిషి కోసం వచ్చారు. కొన్నేళ్ళుగా జ్వరపడ్డ ఒక అస్థిపంజరం గుడిసెలోంచి బయటకు వచ్చింది. దొరవారి ఇంట్లో బరువులు మోయడానికి రమ్మని జవాన్లు బలవంతపెట్టారు. 'నేను చేయలేను బాబయా' అన్నాడు. ఫలితం : ఘోరమైన లాఠీదెబ్బలు.

నేను నేనుగా ఉండలేకపోయాను. ప్రజలకు పంటచేను, పాడియావు, పడుచుబిడ్డ, నడిచేగొడ్డు ఈ నాలుగుకాసులు ఉండటానికిప్పీల్లేదు. ఇది ఆనాటి తెలంగాణా పరిస్థితి.

అందుకే ప్రభుత్వోద్యోగానికి రాజీనామా చేసాను. ఆర్యసమాజ్ సంస్కరణోద్యమాలు వదిలివేసాను. ఇలాంటి అన్యాయాలు జరగని సమాజంలోనే నాకు మనశ్శాంతి దొరుకుతుంది. అందుకే ఏదోచేయాలనే తపన ఎక్కువైంది.

మళ్ళీ గ్రామంలోకి వచ్చాను. గ్రామాల్లోని పరిస్థితి చాలా దిగజారిపోయింది. 1944 సం॥లో భువనగిరి ఆంధ్రమహాసభలో కార్యకర్తగా పాల్గొని కొత్తజన్మ ఎత్తాను.

ప్రశ్న : సాహిత్యం అంటే అభిరుచి ఎలా కలిగింది? మొదట్లో ఏం రాసారు ?



జవాబు : కళలంటే ప్రేమపద్యాలు చదవడం హాయిగా ఉండేది. జానపద పాటలు పాడించుకొని వినేవాణ్ని. ప్రజలంటే సానుభూతి అపారం గనుక ఆ పాట

అన్నా చాలా ఇష్టం ఉండేది. ఆ పాటల్లోనే గొప్ప సాహిత్యం కనిపించేది.

కాని నేను చిన్నతనంలో చదువుకున్నదంతా ఎక్కువగా దైవభక్తికి సంబంధించింది. ఆధ్యాత్మిక జీవితం గడిపేరోజుల్లో ఏమి రాయలేదు. తరువాత ఆర్యసమాజ కార్యక్రమాలలో పాల్గొంటూ అస్పృశ్యతా నివారణ, వర్ణాంతర వివాహ ప్రచారం, నైజాం పాలనలోని లోపాలు మొదలైన అంశాలను తీసుకొని పాటలురాసి సభల్లోపాడే వాణ్ని.

ఎప్పుడైతే భోనగిరి ఆంధ్రమహాసభలో పనిచేసానో అప్పటినుండి అధికమెజారిటీ ప్రజల బాధలకు కారణం తెలిసివచ్చింది. కులాల, మతాల మంచుతెరలు తొలగిపోయాయి.

సభల్లో పాల్గొనడం ప్రారంభించాను. ఉపన్యాసాలువిని అర్థంచేసుకోవడం ప్రజలకు కొంత బాధ కలిగిస్తోంది. రాజకీయ పదాలను, భావాలను సమన్వయం చేసుకోలేకపోవడం కనిపించింది. అందుకే వారికవగతమయ్యే రూపాన్నిఎన్నుకోవాలని అనుకొన్నాను. అప్పటినుండి పాటని నాబాణగామలచుకొన్నాను.

ఎవరోరాసిన పాటలకన్నా, ఎవరోపాడే పాటలు తీసుకోవడంకన్నా మా గ్రామ ప్రజల అవసరాన్నితీర్చే పాటలను నేనేను రాయడం ప్రారంభించాను. ప్రజల భావాలను బాధల అందులో చిత్రించాను. వెంటనే ఆపాటలు ప్రజల నోళ్ళలోకివెళ్ళి వ్యాప్తి పొందేది.

ప్రశ్న : పాటలతోనే తృప్తి పొందారా ? మరే కళారూపాలైనా తీసుకొన్నారా?

జవాబు : ప్రజాసాహిత్యాన్ని, ప్రజాకళలను, తక్కువ అంచనావేయవద్దు. అన్నిటిలోను వారికళాశక్తి కనిపిస్తుంది. ఉపన్యాసాల్లో వెట్టిచాకిరీ చెయ్యొద్దు చెయ్యొద్దు అని గీపెట్టి అరిచినా లాభంలేదు. అదే ఒక పాటలోపెట్టి వారి జీవితాల్ని చిత్రించి పాడితే వారి గుండెలకు హత్తుకొంటుంది.

కాని ఒక కళారూపంద్వారా చూపితే ఇంకా బలంగా గుండెలోనాటుకుపోతుంది, ఉదా: గొల్లసుద్దులు. ఇందులో ఒకపాత్రద్వారా ఆ వెట్టివాని జీవితం కన్నులకు కట్టినట్లు చూపితే ప్రజలకు బాగాఅర్థమవుతుంది. అందుకే అలాంటి కళారూపాల్ని తీసికోక తప్పలేదు, పిట్టలదొరవేషం, ఫకీర్లవేషం, బుర్రకథలు మొదలగు ప్రక్రియల్ని తీసుకొని ప్రదర్శించాను. గొల్లసుద్దుల్ని స్వయంగా రాసాను. పోరాటం నిరంతరం మార్పుచెందుతుంది. ఆయా మార్పుల కనుగుణంగా ఉపన్యాసాలు చెబితేచాలదు. దృశ్యగాన ప్రక్రియల్లో వాళ్ళదగ్గరకు వెంటనే తీసుకొనిపోవాలి, ఎందుకంటే పోరాటం చేసేది మనంకాదు, వాళ్ళే, ఐతే తెలంగాణాలో నాటకప్రక్రియని ఎవరూ వాడ్కేదు, చాలామంది ఈజీరూపాల్నే తీసుకొన్నారు.

ప్రశ్న : తెలంగాణా పోరాటం తదుపరి పరిస్థితి ఏమిటి ? మీ సాహిత్య వ్యాసంగం సాగిందా ?

జవాబు : నైజాం ఫ్యూడల్ ఉన్మాదరాజ్యం పోయింది. ఆంగ్లేయుల నియంతృత్వం తొలగింది. కాని దేశంలో దోపిడీఉన్మాదం హెచ్చుగానే పెరిగిపోతున్నది. ప్రజాస్వామిక భావాలు అడుగంటి పోతున్నాయి. దోపిడీ రూపుమారిందేకాని అంతం కాలేదు. దౌర్జన్యం ఏ ఒకరిద్దరో చేసేవారు ఇప్పుడు చాలామంది చాలారకాలుగా చేస్తున్నారు. పేదవానిబ్రతుకు అట్లనేఉంది, మళ్ళీ పోరాటం చేయక తప్పనిపరిస్థితులు నల్లదొరలే కల్పిస్తున్నారు.

1952 తర్వాత ఎన్నికలవరకే నేను పాటల్ని రాశాను. బుర్రకథల్ని చెప్పాను కాని ఆరోజు రాసినటువంటి గొప్పపాటలు రాయలేకపోయాను. నాకా అవకాశంకూడా లేకపోయింది. ప్రజలునన్ను కవిగా గుర్తించారు కాని మా పార్టీస్నేహితులు నా సృజనాత్మకశక్తిని గుర్తించలేదు. నాకైనేను కొన్నిగేయాల్ని రాసుకొన్నాను. ఐదేండ్లకొకసారి ఎన్నికలపాటలు రాసేవాణ్ని. ఇప్పటికీ మా కుటుంబం పార్టీకుటుంబమే. నా వారసత్వాన్ని మాలో ఎవరు ఎలాగ్రహిస్తారో చూడాలి.

ప్రశ్న : ఇలా చివరి సమయంలో ఇలాంటి ప్రజాకవులకు ఏమైనా సందేశం చెబుతారా ?

జవాబు : ఈదేశం పెత్తందారులనుండి విముక్తం కాకతప్పదు. పోరాటం వస్తుంది. కాని ప్రజలను చైతన్యవంతులను చేయాలి. అలా చేయలేకపోతున్నాం. ఈ విధంగా శక్తి వంచనలేకుండా ప్రజాకవులు కళాకారులు నిరంతరం శ్రమచేస్తేనేసాధ్యం. అలా చేయనిపక్షంలో ఈ సమాజంలో మార్పు తేలేరు. పాటలు కళారూపాలు మరింత రాటుదేలాలి. ఇప్పుడు 'జననాట్యమండలి' మొదలయిన సంస్థలు ఆ మార్గంలో సక్రమంగా పనిచేస్తున్నాయి. ఆనాటి రోజుల్ని గుర్తుతెస్తున్నాయి. నాకు భరోసా ఉంది.

ప్రశ్న : అన్నట్టు క్యాన్సర్ ఆపరేషన్ చేయించుకోరా ?

జవాబు : సంపాదన ఏమీలేని నాకు మిగిలిన కొన్ని వస్తువుల్ని మాకు కాకుండా చేసుకోలేను. ఎంత ఉచితవైద్య సహాయమైనా ఈ సమాజంలో చాలా డబ్బు అవసరమవుతుంది. నాకు డబ్బువచ్చే అవకాశం లేదు.

ప్రశ్న : ఏ ప్రశ్నా అడగలేను మీరేమైనా చెబుతారా ?

జవాబు : చాలా చెప్పాలనే ఉంది. అందరికీ తిండి, వైద్యవసతి, ఉద్యోగం కల్పించే సమాజం రావాలని ఉంది. అది వచ్చేవరకు నాలాంటి ఎంతోమంది వ్యవస్థ రక్కసి కోరలమధ్య చిక్కిపోవల్సిందే. కొత్తవ్యవస్థ కోసం ప్రజాకవులు మరింత ఉత్సాహంగా కదంతొక్కవల్సిందే అలా జరుగుతుందనే నమ్మకం నాకుంది అదే ఆశ.

## కుందుర్తి స్మృతి

'నయాగరా' కవుల్లో ఒకరుగా నూతనసమాజానికి ఆహ్వానంచెప్పే గొంతుతో తెలుగు సాహిత్యరంగంలో ప్రవేశించి కమ్యూనిస్టుపార్టీతో అభ్యుదయ రచయితల సంఘంతో ప్రయాణంచేసి 'తెలంగాణా' కావ్యంద్వారా తెలంగాణా విమోచనోద్యమంలో 'సంఘోదయాన్ని' ఆహ్వానించిన కుందుర్తి అక్టోబర్ 25వ తేదీన మరణించాడు. ఫ్రీవర్స్ ఫ్రంట్‌ను స్థాపించి రూపవాదంలోను, సాహిత్య దృక్పథంలో రాజీవాదంతోను పయనించిన కుందుర్తితో మాకు సైద్ధాంతిక ఏకీభావం లేకపోయినప్పటికి తెలుగుకవిత్వంలో ఆయన కృషిని గుర్తించి స్మరించుకుంటున్నాం.

'సాహితీ మిత్రులు'

## సంతాపం

సృజన మిత్రుడు, రాజమండ్రికి సృజనను పరిచయంచేసి చాలాకాలం సృజన ఏజంటుగా రాజమండ్రిలో వ్యవహరించిన ఏలూరి సూర్యారావుగారి మరణానికి విచారిస్తున్నాం. ఆయన కుటుంబానికి మా ప్రగాఢ సానుభూతిని అందజేస్తున్నాం.

సాహితీమిత్రులు

# పుస్తక స్వీకారం

1. 'నాయని సుబ్బారావు కృతులు : పరిశీలన', డాక్టర్ అనుమాండ్ల భూమయ్య, (సెప్టెంబర్ 1981) 288+xvi పేజీలు, 1/8 డెమీ, సాదాప్రతి రు. 30, మేలుప్రతి రు. 40 ప్రతులకు : శ్రీ బాలాబుక్ డిపో, వరంగల్ 506 002.

2 'లూషన్ వ్యక్తిత్వం - సాహిత్యం' సంపాదకుడు, అనువాదం : నిర్మలానంద, జనసాహితీ సాంస్కృతిక సమాఖ్య ప్రచురణ (సెప్టెంబర్ 1982), 124+xx పేజీలు, 1/8 క్రౌన్, ఐదు రూపాయలు.

3. 'స్త్రీ పురుష సంబంధాలు - రంగనాయకమ్మ అశాస్త్రీయభావాలు', దివి కుమార్ జనసాహితీ సాంస్కృతిక సమాఖ్య ప్రచురణ (సెప్టెంబర్ 1982) 20 పేజీలు 1/8 డెమీ, ఒక రూపాయి.

ఈ రెండు పుస్తకాలూ ప్రతులకు : మైత్రి బుక్ హౌస్, లబ్బీపేట, విజయవాడ 520 010.

4. 'రాకాసికోర' బెంగాలీమూలం . మహాశ్వేతాదేవి, తెలుగు : సూరంపూడి సీతారామ్, హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ (జులై 1982), 170+iv పేజీలు 1/8 డెమీ, ఆరు రూపాయలు,

5. 'కథాయజ్ఞం' కాళీపట్నం రామారావు కథలపై యజ్ఞం అనుబంధంగా చర్చా వ్యాసాలు, హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ (జులై 1982) 176+40+xvi+4 పేజీలు, 1/8 డెమీ, పదిరూపాయలు.

ఈ రెండు పుస్తకాలు ప్రతులకు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్, 3-6-694, హిమాయత్‌నగర్, హైదరాబాద్ 500 029.

6. 'Nationality Question in India'. Seminar papers, AP Radical Students Union (July 82), 216+iv+6 Pages, 1/8 demy, Ten Rupees, for copies: Peace Book Centre, 4-5-421, Sultan Bazar, Hyderabad 500 001.

---

## జననాట్యమండలి గురించి............

ప్రజా పోరాటాల ప్రతిస్పందనగా గత 12 సంవత్సరాలు జననాట్యమండలి ప్రజలలో పనిచేస్తున్న తీరు విప్లవాభిమానులంతా గమనిస్తున్నారని మా గట్టినమ్మకం. ప్రజల సేవలో ప్రజల నుండి నేర్చుకొని మళ్ళీ ప్రజలకు నేర్పి మార్పుకోసం పరితపించే జననాట్యమండలి నూటికి నూరుపాళ్ళు ప్రజలపై ఆధారపడ్డ ప్రజాసంస్థ. జననాట్యమండలి అనుభవాన్ని వివరించడం కోసం ఒక సావనీర్ ప్రచురించబోతున్నాం. విప్లవాభిమానులూ, రచయితలూ జననాట్యమండలిపై తమతమ రచనలను, అభిప్రాయాలను పంపవలసిందిగా కోరుతున్నాం. సాంస్కృతిక రంగంలో పనిచేస్తున్న కార్యకర్తలు దీన్ని తమ బాధ్యతగా గుర్తించి సహకరించగలరని ఆశిస్తున్నాం. రచనలు ఫోటోలు పంపవలసిన అడ్రెసు : జననాట్యమండలి, కేరాఫ్ సృజన, హన్మకొండ 506 001, వరంగల్, ఆంధ్రప్రదేశ్.

– జననాట్యమండలి,
ఆంధ్రప్రదేశ్.

---

## "ఆధునిక చేతన"

సాహిత్య సాంస్కృతిక వేదిక, తిరుపతి.

మొదటిసారిగా బులెటిన్ ప్రచురణ చేపట్టనున్నది. కవితలు, కథలు, వ్యాసాలు, చిన్న నాటికలు ప్రచురణకోసం అహ్వానిస్తున్నాం. రచనలు ప్రజాపోరాటాన్ని, ఆధునిక చైతన్యాన్ని ప్రతిబింబించేవిగా వుండాలి అని వేరేచెప్పనక్కర్లేదను కుంటాం.

మీ అందరి సహకారంతో త్వరలోనే వెలువడే ప్రారంభ సంచికకు రచనలు నవంబర్ 15వ తేదీలోగా పంపగలరు. పారితోషికం వుండదని మనవి.

అడ్రెసు :

పి. సి. నరసింహారెడ్డి, లెక్చరర్ (లింగ్విస్టిక్స్)
తెలుగు అధ్యయనశాఖ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి – 517 502

---

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22 9-1967.

Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu'
Printed at Navatha Printers J. P. N. Road, Warangal - 506 002
for Venkataramana Mudranalayam, Warangal
Working Editor : Varavararao

**SRJANA Telugu Monthly** Oct. 82 H/WI-10
Regd. No. with Registrar of Newspapers 10953/67.



1948 అగస్ట్ 27న రజాకార్లతో, నైజాం పోలీసుతో వీరోచితంగా పోరాడి ప్రాణాలర్పించిన 87 మంది బైరాన్‌పల్లి మృతవీరుల సంస్మరణ స్థూపం. రాడికల్స్ నిర్మించిన ఈ స్థూపం 1982 జూన్ 9న బైరాన్‌పల్లిలో ఆవిష్కరించబడింది.

SRJANA
Hanamkonda-506001

Single copy Rs. 4-00
Yearly Subscription Rs. 20-00